


# నలంద
## రెసిడెన్షియల్ జూనియర్ కాలేజెస్

హెడ్ ఆఫీస్: 3వ ఫ్లోర్, ఇందిరాగాంధీ మున్సిపల్ స్టేడియం కాంప్లెక్స్, లబ్బీపేట, విజయవాడ-10

అధ్యాపకుల మధ్యన్నులే
విద్యార్థిలోకపు ఉషస్సులు.
మా **నలంద** కు ఆస్తి
అధ్యాపకులే!

మా విద్యార్థులకు మరియు తల్లిదండ్రులకు మా అధ్యాపక బృందంపై దినదినం పెరుగుతున్న విశ్వాసానికి కృతజ్ఞులం.

మా ఆశయసాధనకు మీ ఉత్సాహ ప్రోత్సాహాలుతోడై నిలచిన మా ఈ సంస్థల తరుపున మా విద్యార్థినీ,విద్యార్థులకు వారి తల్లితండ్రులకు మరియు మా శ్రేయోభిలాషులకు మా నూతన సంవత్సర "**ఉగాది**" శుభాకాంక్షలు!

BHAVANI PUBS

## నలంద
### రెసిడెన్షియల్ జూనియర్ కాలేజి

యెర్నేని జానకి రామయ్య ఎస్టేట్, గంగూరు,
విజయవాడ రూరల్,ఫోన్:58275,పెనమలూరు(మం)

## నలంద
### మహిళా కళాశాల (రెసిడెన్షియల్)

3వ ఫ్లోర్, ఇందిరాగాంధీ మున్సిపల్
స్టేడియం కాంప్లెక్స్, లబ్బీపేట,
విజయవాడ-10, ఫోన్:477193.

## నలంద
### ఎమ్సెట్ కోచింగ్ సెంటర్

2వ ఫ్లోర్, ఇందిరాగాంధీ మున్సిపల్
స్టేడియం కాంప్లెక్స్, లబ్బీపేట,
విజయవాడ-10, ఫోన్:477193

డైరెక్టర్స్: **కె.బసవపూర్ణయ్య** (రిటైర్డ్) ఫిజిక్స్
**ఎ.వి.సుబ్బారావు** (రిటైర్డ్) కెమిస్ట్రి
**కె.రాంబాబు** (రిటైర్డ్) ఫిజిక్స్

ప్రిన్సిపాల్: **I.V.కామేశ్వరరావు**
(రిటైర్డ్-మాథ్స్)

కరస్పాండెంట్: **A.విజయబాబు**

# చతుర సమీక్ష



ఈ శీర్షికద్వారా ప్రతినెలా 'చతుర'లో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మొత్తం మళ్లీ చెప్పకుండా, అవసరమైన మేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరఠావుకి మించకుండా కాగితానికి ఒక వైపునే రాయాలి.
2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేటట్లు పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.
4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర', 'ఈనాడు' కాంపౌండ్, హైదరాబాద్-500 482 అనే చిరునామాకు పోస్ట్‌చేయాలి.

మాకు అందిన సమీక్షలలో ఉత్తమమైనవిగా ఎంపికచేసి ప్రచురించిన వాటిలో మొదటి మూడింటికి రూ. 100/-, రూ. 75/-, రూ. 50/- చొప్పున; మరో మూడింటికి రూ. 25/- చొప్పున నగదు బహుమతులు పంపగలం. పాఠకుల పరిశీలనాశక్తిని, రచనాసక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటు చేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.

★ కొందరు బహుమతి విజేతలు తమ బహుమతి తాలూకు చెక్కు అందలేదనీ, అడ్రను మారిందనీ రాస్తున్నారు. బహుమతి మొత్తాలు ప్రతినెలా మొదటివారంలోనే పంపుతున్నాం. అడ్రసుల విషయంలో కూపన్‌లో రాసేటప్పుడే జాగ్రత్తపడటం మంచిది. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు సాధ్యంకాదు.

కూపన్

ఏప్రిల్ 'చతుర' నవల: భయం

సమీక్షకుని పేరు : ..........................................................

చిరునామా : ..........................................................

..........................................................

..........................................................

..........................................................

# రచయితలకు సూచనలు

ప్రచురించే ప్రతి నవలకు రు.2000/- పారితోషికం అందజేస్తున్న 'చతుర'లో ప్రతిభావంతులైన రచయితలకు నెలనెలా నవలల పోటీయే. వైవిధ్యపూరిత ఇతివృత్తాలతో, ఆసక్తికర రచనా సంవిధానంతో పాఠకులను ఆకట్టుకోగల నవలలకు వేదిక 'చతుర'.

★ 'చతుర'లో నవలకు వేసే చిత్రాలు, చతుర కథలు, చతుర ప్రపంచం వంటి శీర్షికలు కాక కేవలం నవల మాత్రమే అచ్చులో 100 పేజీలు ఉంటుంది. "చతుర"లో అచ్చులో ఒక పేజీలో సుమారుగా 300 పదాలు వస్తున్నాయి. నవలనుబట్టి పేజీల సంఖ్య పెంచటంగాని, తగ్గించటంగాని ఉండదుగనుక నవలలన్నీ సరిగా ఈ సైజుకు సరిపడేలా, మొత్తంమీద 30వేల పదాలకు తక్కువకాకుండా ఉండాలి. వ్రాతప్రతిలో వారివారి దస్తూరినిబట్టి, ఒక పేజీకి ఎన్నిపదాలు వస్తున్నాయనే దానినిబట్టి మొత్తం నవల పేజీలకు ప్లాన్‌వేసుకోవటం అవసరం.

★ ఈ ప్రకారం "చతుర" కొరకై ప్రత్యేకంగా రాసిన నవలలు మాత్రమే పరిశీలనార్హాలవుతాయి.

★ నవలను ప్రచురించే సమయంలో అవసరాన్నిబట్టి కొంత కుదించవలసివచ్చే పక్షంలో, అందుకు అభ్యంతరంలేనివారే తమ నవలలను పంపించాలి.

★ ప్రచురణకై ఎన్నికకాని నవలలు త్రిప్పి పంపేందుకై నవలతోపాటే తగు పోస్టేజిని జతపరచాలి. వ్రాతప్రతులు పోస్టులోగాని, ఇతరత్రాగాని పోయిన సందర్భాల్లో మా బాధ్యత ఉండదు.

★ సాధారణంగా నవలలు మాకు అందిన 4 వారాలలోగా ప్రచురణార్హంగా భావిస్తే ఆ విషయం తెలియపర్చటమో, లేనిపక్షంలో తిప్పి పంపటమో జరుగుతుంది.

★ పారితోషికం ఏ నెలలో ప్రచురిస్తే ఆ నెల మొదటివారంలో పంపబడుతుంది.

ఎడిటర్

**చతుర**

'ఈనాడు' కాంపౌండ్, హైదరాబాద్-500 482

# 'కామయజ్ఞం'పై సమీక్షలు

ఫిబ్రవరి 'చతుర'లో ప్రచురితమైన కె.టి.గట్టి నవల 'కామయజ్ఞం'పై మాకు అందిన సమీక్షలలో ఉత్తమంగా ఉన్న ఆరింటిని ఈ సంచికలో ప్రచురిస్తున్నాం.

## సంసార కామయజ్ఞంలో!

**ప్రథమ బహుమతి రూ. 100/- పొందిన సమీక్ష**

ప్రముఖ కన్నడ రచయిత కె.టి.గట్టి గారి నవల 'కామయజ్ఞం' ధూర్త పురుషాహంకారానికి ఒక ఎదురుదెబ్బ. పెళ్ళితో ప్రారంభమై చావుతో. అంతమయ్యే 'సంసార కామయజ్ఞం'లో సమిధలా మాడిపోయే లక్షలాది స్త్రీలకిది తిరుగుబాటు పిలుపు. పాఠకులకు ఉత్పన్నమయ్యే ప్రశ్నలకు రచయిత్రి ఇచ్చిన నవివరణతో కూడిన సమాధానాలు సమంజసంగానూ, సమర్థనీయంగానూ ఉన్నాయి. తన రచనపై తానే విమర్శలు కురిపించిన ఈ పరిణామం ఆహ్వానించ దగినది.

మారుతున్న కాలంతో పాటు సామాజిక కట్టుబాట్లు మారాలి. కార్యేషుదాసి... అన్న నానుడికి నూకలు ఎప్పుడో చెల్లిపోయాయి. వర్తమానంలో సామాజిక, ఆర్థిక సమానత్వం కోసం స్త్రీలు ఎప్పుడో పోరాటం ప్రారంభించారు. నేడు అది మరింత ఉధృతమయి మొత్తం స్త్రీ సమాజాన్ని తన వెంటతీసుకొని వెళుతుంది.

వివాహబంధం కేవలం మంగళసూత్ర బంధనంతో కొనసాగేది కాదు; రిజిష్ట్రారు ఆఫీసులో సంతకాలతో నిలిచేదీ కాదు, అది భార్యాభర్తల మధ్య చక్కని అవగాహనతో నిలిచేది. ప్రేమాభిమానాలతో పుష్పించేది.

ఆనంద్‌లాంటి వ్యకులు ఇతరుల అంతరంగాన్ని గుర్తించలేరు. వారి దృష్టిలో పరాయి స్త్రీకి, భార్యకి, సానికి తేడా ఉండదు. భార్య అనేది వాళ్ళ దృష్టిలో లైసెన్సు ఉన్న సానిలాంటిది. మంగళసూత్రం వాళ్ళ చేతిలో ఉన్న ఆయుధం. దానితో భార్యని బెదిరిస్తారు, నానా హింసలకు గురిచేస్తారు. తాను ఎక్కడికి వెళితే అక్కడికి భార్యని లాక్కుపోవడానికి ఉపయోగపడే పలుపుతాడుగా భావిస్తారు. ఆనంద్ భార్య సుధలో అతనిపట్ల వ్యతిరేకత పెరగడానికి, ఆమె తిరుగుబాటు చెయ్యడానికి అతని ప్రవర్తనే కారణం. ఎదుటివ్యక్తిని రెచ్చగొట్టే ఏ వ్యక్తి అయినా ఎదురయ్యే పరిణామాలకి తట్టుకోక తప్పదు.

రచయిత అన్నట్లుగా 'మనం అర్థంచేసుకోనిదల్లా రాధని, ద్రౌపదిని, అంబని, అహల్యని ఇంకా అటువంటి ఎందరో స్త్రీలని' వారిని అర్థం చేసుకోవడానికి ఆనాటి సమాజం ప్రయత్నించకపోయి ఉండొచ్చు. ఈనాటి సమాజం మాత్రం వారిని తప్పక అర్థం చేసుకొంటుంది. స్త్రీ హృదయం అగాధం అని కొట్టి పారేస్తే సరిపోదు. ఆ అగాధపులోతుల్లో ఏముందో చూడాలి. ప్రేమని, కరుణని, అనురాగాన్ని వెలికి తీయాలి. ఆ అగాధపు అట్టడుగున పేరుకొంటున్న ద్వేషాన్ని కడిగివేయాలి. లేని యెడల ఒక ద్రౌపది ప్రతిన మూలంగా 18 అక్షౌహిణులసేన నేలకూలినట్లుగా సుధలాంటి ఎందరో స్త్రీమూర్తుల తిరుగుబాటుతో ఈ సమాజమూ పతనంకాక తప్పదు.

— కాళహస్తి నాగేశ్వరరావు, కొరాపుట్.

## మానసిక సాన్నిహిత్యం అవసరం

**ద్వితీయ బహుమతి రూ. 75/- పొందిన సమీక్ష**

శ్రీ కె.టి.గట్టిగారి 'కామయజ్ఞం' నవల కొందరు విలాసపురుషుల విశృంఖలత్వానికి, అహంకారానికి, వ్యామోహానికి ''ప్రతీక''లాగా ఉంది. నైతిక విలువలు, మానవ ధర్మము మంటగలుస్తున్న ఈరోజులలో ఆనంద్‌లాంటి అహంభావులు, ఆడంబరప్రియులు, వాచాలురు, కామాంధులు అడుగడుగునా మనకి సాక్షాత్కరిస్తూనే ఉంటారు. వారికి తనువు, మనసు,

మాట ఒకటి కాదు. పెదవి చివర తేనె పూసుకొని ఆడవారిని ఆకర్షించే సంభాషణలు చేయటంలో వారికి వారే సాటి. పరాయి స్త్రీలతో వారి చొరవను, పోకడలను ఏభార్య భరించగలదు? వీరివలన దాంపత్య జీవితానికి, పవిత్ర జీవనానికి స్త్రీలు దూరమవుతున్నారు. సుధ లాంటి విజ్ఞానవంతురాలు, సహనశీలి కూడా అపవిత్రమయ్యే స్థితికి దిగజార్చుతారు.

పదిమందికి ఆదర్శంగా నిలబడవలసిన సుధ దారి తప్పడం బావుండలేదు. నవల మొదటినుండి పాఠకులు ఆమె పాత్రపై పెంచుకున్న మమకారం, గౌరవం చివరలో లోపిస్తాయి. మాతృత్వం మహిళకు గొప్పవరం కావచ్చును. దాంపత్యజీవితంలో అసంతృప్తి ఉండవచ్చును. అంతమాత్రంచేత నీతిమార్గం వదలనక్కరలేదు. ఈమె చేసిన తప్పువలన రాకేష పాత్ర కూడా పాఠకుల సానుభూతికి దూరమవుతుంది. ఉద్యోగిని అయిన సుధకి బతుకుతెరువుకి భయం లేదు. తన శిష్యులనే అక్కున చేర్చుకొని, ఆదర్శంగా నిలబడి తన లోటును భర్తీ చేసుకొంటే బావుండేది. భర్త జల్సాజీవితపు నీడలోనే బ్రతకవలెనని ఎవరూ ఆమెని నిర్దేశించరు. గౌరవప్రదమైన వృత్తిలో నున్న సుధ తప్పుదారిన నడవడం ఏమాత్రం సమంజసంగా లేదు.

జమున మార్గం ఆనంద్, మహేశ్‌ల వంటిదే అయినా ఆమె త్రికరణశుద్ధిగా, నిజాయితీగా నమ్మినదాన్ని ఆచరిస్తుంది. పలుమందితో తిరగడంలో చూపించిన నిజాయితీయే రెహమాన్ వంటి అంధుని జీవిత భాగస్వామిని చేసుకోవడంలో కూడా చూపించింది. బాహ్య సౌందర్యాన్ని కాంక్షించే వీరికి, అంతఃసౌందర్యాన్ని ఆస్వాదించే రెహమాన్‌కీ తేడా గుర్తించి జీవితాన్ని మలుపు తిప్పుకొన్నది.

భార్యాభర్తల మధ్య మానసికసాన్నిహిత్యం అవసరం. అదిలేనపుడు వివాహబంధం చులకనవుతుంది. మనసులు కలుపుకొన్నాకే జీవితం ఉత్సాహంగా, ఉత్తేజంగా ఉంటుంది. పురుషార్థములలో "ధర్మము" మొదటచెప్పారు. దాని ద్వారా మిగిలిన "అర్థ, కామ, మోక్షము"లను సాధించమన్నారు ఆ సూక్తిని మనం మరువరాదు.

— తనికెళ్ళ కళ్యాణి, పెదబొండపల్లి.

# చలం బాటలో!

**తృతీయ బహుమతి రూ. 50/- పొందిన సమీక్ష**

'కామయజ్ఞం' నవలా రచయిత చలంబాటలో పయనించారని చెప్పవచ్చు. హిందూధర్మం, వివాహబంధాలకు కట్టుబడి మానసిక యాతన అనుభవిస్తూ కూడా ఆదర్శపత్నిలా కాలంగడిపే స్త్రీకి స్వేచ్ఛను ప్రసాదించడానికి ఆరాటపడ్డాడు చలం. ఈ నవలలో 'సుధ' పాత్ర చలం స్త్రీ పాత్రలకు చాలా దగ్గరగా ఉంది. తృప్తి, మానసిక శాంతిలోపించిన సుధ తన భర్తలోని సెక్స్ బలహీనతను వ్యతిరేకిస్తూ లోలోన కుమిలిపోయింది. ఒక సమయంలో అతనిని హత్యచేయడానికి కూడా నిర్ణయించుకుంది. చివరకు రాకేష్ ద్వారా మాతృత్వాన్ని పొంది, ఆమె భర్త ఆనంద్‌లోని మగ మనస్తత్వానికి సవాలుగా నిలిచి కనువిప్పు కలిగించింది. స్త్రీని ఒక సెక్స్ సింబల్‌గా, అణగదొక్కబడే బానిసలా, మనసులేని యంత్రంలా కాకుండా ఆమెను మనిషిలా గుర్తించాలని ఈ నవల హితవు చెబుతోంది. స్త్రీ మనస్సుకు ప్రాధాన్యత ఇవ్వని భర్తలపై ఒక తిరుగుబాటు బావుటా ఎగురవేసింది. ఈ నవలలో మరో ఎన్నదగిన అంశం 'వెరైటీ'ని కోరుకునే ఆనంద్‌లాంటి వ్యక్తులకు చక్కని గుణపాఠం చెప్పడం. జమున పాత్ర ద్వారా బోలెడంత వైరాగ్యాన్ని అందించారు. కథకోసం వెదుకులాడేవారికి ఈ నవల నిరాశకలిగిస్తుంది. ఈ నవల మనస్తత్వాలను విశ్లేషించే ఒక థీసిస్. ఆడది కనిపిస్తే చాలు అనుభవించాలని చూసే మనస్తత్వంగల ఆనంద్, పైకి కనిపించని మానసిక వ్యభిచారి మహేష్, తృప్తి, మానసిక శాంతి కోసం తపించే సుధ, నిప్పులాంటి వ్యక్తిత్వంగల శీలా, ఆకర్షణీయమైన వ్యక్తిత్వంగల రాకేష్ వీరందరి వ్యక్తిత్వాల విశ్లేషణల మాల ఈ నవల. చివరగా రచయిత చెప్పిన ఉపసంహారం పాఠకుల మనస్సుల్లో పుట్టే అనేక సందేహాలను నివృత్తిచేస్తూ సంతృప్తికలిగించింది.

— జి.యస్.యన్. మూర్తి, ఏలేశ్వరం.

## మన సాంప్రదాయం కాదు

*రూ. 25/- బహుమతి పొందిన సమీక్ష*

నేటి సమాజంలో ఆనంద్‌లాంటి పురుషులు ఎందరో జీవిస్తున్నారనే నగ్నసత్యానికి అద్దంపట్టే నవల 'కామయజ్ఞం'.

తనతో సమాన హోదా కలిగినవ్యక్తి భార్యగా లభించి... ఆమెతో అన్నిసౌఖ్యాలు పొందుతున్నా పరస్త్రీలతో సాంగత్యంచేస్తూ లైంగికానందం కోసం అర్రులుచాచే భర్త ఆనంద్ కామక్రీడలను అవగాహనచేసుకొని అతన్ని అల్లరిపాలుచేయక, నిర్బందించక , మూగబోయిన వీణలా అతని చేష్టలకుమౌనం వహించటం 'సుధ' సహనాన్ని వెల్లడిస్తోంది.

జీవితానికి వివాహబంధం అవసరమే! అయినా దాంపత్య సుఖానికి సెక్స్ ఒక భాగం మాత్రమే కాని... సెక్సే జీవిత పరమార్థం కాకూడదు అని ప్రతి స్త్రీ పురుషులు యోచించటం అవసరం.!

అంటే జీవితం అందరికీ... పురుషుడవని, స్త్రీ అవని జరగవలసినవన్నీ (సమపాళ్ళలో కాకపోయినా) జరిగినపుడే పరిపూర్ణత...! అందులో వివాహబంధం ఒకటి. ఆ వివాహ బంధాన్ని పవిత్రంగా చూసుకోవటమే మనిషి ధర్మం...

స్త్రీకి మాతృత్వం అన్నది మధుర భావనేకావచ్చు... అలానే పురుషునికి కూడా పితృత్వం మధురభావనేకదా!మరి పురుషునికి బాధ స్త్రీకి ఎందుకుండాలి?

సమాజంలో ఆచార సాంప్రదాయాలు, నీతి నియమాలు అని కొన్ని వున్నాయి. అవే సమాజాభ్యుదయానికి ఆరోగ్యకరమైనవి. వాటికి విలువనిచ్చి గౌరవించటం మన బాధ్యత. ఎదురుతిరగవలసిన అగత్యం ఏర్పడినప్పుడు తప్పకుండా ఎదురు తిరుగవచ్చు...

కాని భర్తపై ప్రతీకారానికి... తన తప్పు తాను తెలుసుకోటానికి భర్తను చంపకుండా చచ్చేటట్లుచేయటానికి మంచిని వినియోగించుకోవాలి కాని... అవినీతిని ఆహ్వానించకూడదు.

భర్తకు ఎదురుతిరగటంకోసం... అనవసరంగా పరపురుషునితో సాంగత్యంచేసి తల్లికావటం అనేది మన ఆచార సాంప్రదాయాల్ని వమ్ముచేసుకోవడం వల్ల మన పురోగాభివృద్ధి దిగజారుతుందేకాని డెవలప్ కాదుకదా.

కేవలం ఈ చర్యతోనే భర్తను ఎదురుదెబ్బతియ్యటం గొప్ప అనుకుంటే... సుధ చేసింది ఎంతపొరపాటు పనో ప్రతి స్త్రీ గ్రహిస్తే చాలు. దీనివలన మన అభివృద్ధిని మనమే దిగజార్చుకున్నవాళ్ళమౌతాం.

— వి. నిర్మలా ప్రియదర్శిని, పోరుమామిళ్ళ.

## ఎన్సైక్లోపీడియా

*రూ. 25/- బహుమతి పొందిన సమీక్ష*

'కామయజ్ఞం' నవల మన వ్యవస్థలోని వ్యక్తుల ప్రవర్తనలు, వ్యక్తిత్వాల్ని విశ్లేషించి వివరించడంలో విజయవంతం అయిందనే చెప్పాలి. ముఖ్యంగా పురుషులకో న్యాయం-స్త్రీలకో న్యాయం చెల్లుబాటవుతున్న నేటికాలంలో, భార్యాభర్తల మధ్య భర్తే సాధారణంగా ఎక్కువ అధికారం, హక్కులు చెలాయిస్తున్న మన సమాజంలో 'ఓ మగవాడా... నువ్వు ఇలా వ్యవహరిస్తున్నావ్', 'ఓ స్త్రీ... నీ పరిస్థితి ఇదీ' అని హెచ్చరిస్తోంది ఈ నవల. మనలోనే ఆనంద్ వున్నాడు, మహేష్ వున్నాడు, సుధ వుంది, శీలా వుందీ...

కేవలం సెక్సే జీవితంగా తలచే ఆనంద్ వంటి వ్యక్తులు మనచుట్టూ కోకొల్లలు. మహేష్,శీలాల ప్రవర్తనలు 'లోకోభిన్నరుచి' సామెతను జ్ఞప్తికి తెస్తాయి.

సృష్టిలోకెల్లా అపురూప, అద్వితీయ, అనురాగ బంధంగా వర్ణించబడుతోన్న మన వివాహబంధంలోని కొన్ని లోపాలను, వంకరలను 'కామయజ్ఞం' ప్రస్ఫుటపర్చడమేగాక చర్చించే విధంగా బహిర్గతపర్చింది.

ఒచోట రచయిత చెప్పినట్లు ఆ క్షణంవ

---

ముఖచిత్రం: శివాజీ

రకు అతనెవరో తెలీని ఆమె వివాహంకాగానే అతనికి స్వంతమైపోతుంది. అతనెలాంటివాడో ఆమెకు ఆ తర్వాతగానీ తెలీదు. 'చేతులు కాలాక ఆకులు పట్టుకున్న' చందంలా తీరా తెలిశాక- చూస్తే ఆమె తన జీవితంలో చాలా అమూల్యభాగాన్ని ఆనందాన్ని అనుభవాన్ని కోల్పోవచ్చు.

గయ్యాళి భార్యలవల్ల భర్తలు, భర్తల అత్యాచారాలవల్ల భార్యలు ఎన్నో బాధలకు లోనవుతున్నారు. అయితే ఆయా బంధాల్ని తెంచుకుని స్వేచ్ఛగా విహరించేవాళ్లూ వున్నారు. అలా విహరించాలనుకుని, ఏమీ చేయలేక మౌనంగా జీవితంతో రాజీపడేవాళ్లూ వున్నారు.

ఎదుటివ్యక్తి ఆలోచనలనుబట్టి, నడవడికను బట్టి ఆ వ్యక్తి మంచివ్యక్తా, చెడువ్యక్తా అని మనం నిర్ణయించవచ్చు. కాని ఆ వ్యక్తిలో దాగివున్న మరోవ్యక్తిని సహజంగా మనం గుర్తించలేం. అందుకే అప్పుడప్పుడు మంచివ్యక్తి కాస్తా దారితప్పి, అహంకారంతో మితిమీరి ప్రవర్తించవచ్చు. దుర్మార్గుడు అనుకున్నవ్యక్తి ఓ క్షణాన మంచివ్యక్తిగా మారవచ్చు.

ఏమైనా చివరివరకూ కలిసిమెలిసి జీవించాలనుకుని వివాహబంధం ద్వారా ఒకటయ్యేవాళ్లు- ముందుగానే ఒకరి గురించి మరొకరు తెలుసుకోవడం శ్రేయస్కరం. జీవితంలో రాజీపడటం గాకుండా పొరపాట్లు మరోసారి జరగకుండా చూసుకుంటే ఏ వివాహబంధమైనా చివరివరకు విచ్ఛిన్నం కాదు... కాబోదు. 'కామయజ్ఞం' దాంపత్యబంధాన్ని విశ్లేషించే ఎన్సైక్లోపీడియా అనడంలో అతిశయోక్తి ఏమీలేదని నా అభిప్రాయం. మూలరచయితకు, అనువాదం చేసిన రచయిత్రికీ, ప్రచురించిన 'చతుర'కూ అభినందనలు.

**— జి.జి.పి**, రామవరం.

## సజీవ చిత్రణ

*రూ. 25/- బహుమతి పొందిన సమీక్ష*

పై పేరు చదివినప్పుడు తొలుత ఏదో నెగటివ్‌గా ఊహించుకోవడం జరిగింది. తర్వాత నాలుగు పేజీలవరకు అలానే అనిపించింది. కానీ మెల్లగా చదువుకుంటూ పోతుంటే అప్పుడుగాని రచనలోని రమణీయత అర్థం కాలేదు. 'కామయజ్ఞం' నవల నిజంగా ఒక ఉత్తమ నవల. ఈ నవలలో అతిగొప్పమలుపులు లేవు. నవల చాలా మామూలుగా సాగింది. జీవితం ఒకరోజులో ఆగిపోయినట్టు నవల ఠక్కున ఆగింది. చాలామంది రచయిత(త్రు)లు సమస్యను గురించి పాఠకులే ఆలోచించుకోమని గూడార్థంగా చెప్పి, తన భావాలను స్పష్టీకరించరు. కానీ ఈ రచయిత అలా చేయలేదు. తను రాసిన జీవిత చిత్రణలో తను చెప్పదలచుకున్నది సూటిగా, ఘాటుగా చాలామంది భుజాలు తడుముకునేలా ఉపసంహారంలో చెప్పారు. ఒకవిధంగా ఆ ఉపసంహారమే ఈ రచనను ఉన్నతస్థాయిలో నిలబెట్టింది. ఆ ఉపసంహారం ప్రతి పాఠకుడిని నిలదీస్తుంది. స్త్రీపట్ల మనం ఏమిటి- అన్నది తనకు తానుగా ప్రశ్నించుకునేలా చేస్తుంది.

వ్యభిచారమే ధ్యేయమయిన భర్త, పతివ్రతా ధర్మాలు పాటించాలని చెప్పే సమాజం, చుట్టుపక్కల కనిపించే హిపోక్రసీ బతుకులు... ఈ నవలలో ఓ సజీవ చిత్రణ. రచయిత ఏదో చెప్పాలని తపనపడటమే కాదు, తను చెప్పదలచుకున్న విషయంమీద పూర్తి కమాండింగ్ ఉందన్నది ఈ రచన చదివితే స్పష్టంగా తెలుస్తుంది. ఏదేమయినా ఈ రచనలో రచయిత ఓ సాహసం చేశాడనే చెప్పొచ్చు.

ఆనంద్, సుధ, శీలా, మహేష్, రాకేష్, జమున- అన్నీ సజీవపాత్రలే. ప్రతి మలుపు సజీవ చిత్రణే.

కన్నడంలో కె.టి. గట్టిగారికున్న పేరుప్రఖ్యాతులు తెలియవు. అయితే ఈ రచన చదివితే ఎందుకనో చలం గుర్తుకువచ్చారు. ఇద్దరి అభిప్రాయాలకూ, భావాలకూ చాలా దగ్గరిపోలిక కనిపించింది. ఈ 'కామయజ్ఞం' చదివితే మరో 'మైదానం', 'దేవుడిచ్చిన భార్య' మొదలైన రచనల వరుస చదివినట్టుగా అనిపించింది.

మొత్తంమీద స్త్రీ సమస్యలను, మనోభావాలను, సాంప్రదాయం ముసుగుచాటునపడే వేదనను సమర్థవంతంగా విశ్లేషించిందీ 'కామయజ్ఞం'.

**— కోలపల్లి ప్రియ**, నెల్లూరు.



# చతుర కథలు

## నమ్మలేని నిజం

"ఏమేవ్... నా పర్సు కనిపించడంలేదే?" ఇల్లంతా వెతికి నీరసంగా ఓచోట చతికిలబడి అన్నాడు పరంధామయ్య.

"ఎక్కడ ఉంచారేమిటి?" భార్య అడిగింది.

"ఎక్కడ ఉంచానో తెలిస్తే నిన్నెందుకు అడుగుతాను" అన్నాడు పరంధామయ్య చిరాకుగా."బుజ్జిగాడేమైనా తీశాడా?"అనిఅడిగాడు



"ఆc... బుజ్జిగాడిమీదకు వెళ్ళండి. ప్రతిదీ వాడిమీదనే. నిన్నేమో రూపాయి కనిపించలేదని వాడిమీదకు వెళ్ళారు. చివరకు తేలింది ఆ రూపాయి మీరు విడిచిన ప్యాంటు జేబులోనే ఉందని. ఈరోజేమో పర్సుపోతే వాడిమీదకు వెళ్తున్నారు..." రుసరుసలాడుతూ ఏడవసాగింది పరంధామయ్య భార్య.

హడలిపోయాడు పరంధామయ్య! కొంచెం శాంతించి- "ఏడవకు ఏడవకు, నేనూరికినే అన్నానులే! పోతే పోయిందిలే పర్సు" అన్నాడు.

ఆమె ఏడుపు కొంత తగ్గించింది.

"కూర మాడిపోతున్నట్టుంది. లోపలికి వెళ్ళు" అని భార్యను లోపలికి పంపించి పేపరుతీసి చదువసాగాడు.

మరికాసేపటికి...

"ఏమండీ పరంధామయ్యగారూ" బయట నుంచి ఎవరో పిలిచారు.

"ఎవరూ?" అంటూ బయటకు వచ్చాడు పరంధామయ్య.

అక్కడ ఎవరో అపరిచితవ్యక్తి కనిపించాడు. లావుగా ఆరడుగుల ఎత్తులో భారీగా ఉన్నాడు.

ఆ వ్యక్తిని పరంధామయ్య గతంలో ఎక్కడా చూడలేదు.

"మీరేనా పరంధామయ్య" అన్నాడు ఆ వ్యక్తి

"అవును... నాపేరే పరంధామయ్య"

"మీ పర్సుపోయింది కదండి" అపరిచిత వ్యక్తి పరిశీలనగా చూస్తూ అన్నాడు.

ఆ విషయం అతనికెలా తెలిసిందో అర్థంకాలేదు పరంధామయ్యకు.

కాస్త ఆగి అతనే అన్నాడు...

"నాకీ పర్సు రోడ్డుమీద దొరికింది లెండి. అందులో మీ విజిటింగ్ కార్డు చూసి ఇలా వెతుక్కుంటూ వచ్చాను" అంటూ ఓ పర్సును అందించాడు పరంధామయ్యకు.

పరంధామయ్య అపరిచితవ్యక్తి నిజాయితీకి తృప్తిపడ్డాడు. పర్సులో అన్నీఉన్నాయని చూసుకున్నాక...

"థ్యాంక్స్ లోపలికిరండి" అంటూ ఆహ్వానించాడు ఆ అపరిచితవ్యక్తిని.

"నేవెళ్ళాలి. డ్యూటీ ఉంది. లోపలికిరానందుకు ఏమీ అనుకోకండి" అన్నాడతను వెనుతిరుగుతూ.

"ఫర్వాలేదులెండి. ఇంతకీ మీపేరేమిటో చెప్పలేదు"

"సోమశేఖరమండీ"

"మీరేం చేస్తున్నారు?" సోమశేఖరం గురించి వివరాలు తెలుసుకోవాలని అన్నాడు పరంధామయ్య.

"నేను పోలీసు కానిస్టేబులునండీ!"

అంతే...

ఆమాట విన్న పరంధామయ్య నిల్చున్నపళంగా ధామ్మని పడిపోయాడు. ఆ నిజాన్ని నమ్మలేక.

— పి.వేణుగోపాలరెడ్డి.





# కుంభకోణం

స్కూలు నుంచి వచ్చి పుస్తకాల సంచీ ఓ మూల పడేసిన రాము ఇంట్లో సందడి చూసి ఆశ్చర్యపోయాడు.

ఇల్లంతా నీట్‌గా సర్ది వుంది. 'సీరియల్ సెట్లు' అందంగా పేర్చబడి వున్నాయి. స్టీరియో బాక్సు నుంచి దేశవాళి సంగీతం మంద్రంగా వినిపిస్తోంది. కిచెన్‌లోంచి ముక్కుపుటలు అదిరేటట్టు ఘాటుగా వస్తున్న చికెన్ బిర్యాని వాసన! హుషారుగా రెండు అడుగులు లోపలకు వేశాడు రాము. డైనింగ్ టేబుల్‌మీద నిండుగా సర్ది వున్న రకరకాల పిండివంటలు, పళ్ళు చూసి నోరూరింది వాడికి. అనుమతి లేకుండా వేటినీ ముట్టుకోకూడదన్నది రాము నేర్చుకున్న తొలి పాఠం.

తల్లికోసం సరాసరి కిచెన్‌రూంలోకి దారితీసాడు. "మమ్మీ... ఈవేళ ఏదైనా పండుగా?" అడిగాడు అర్థోక్తిగా.

తల్లికి విషయం బోధపడింది.

"కాదురా రామూ. ఈరోజు మీ జగన్నాథం అంకుల్ ఢిల్లీ నుంచి వచ్చారులే, అందుకు" అని చెప్పింది.

రాము ఆనందం వర్ణణాతీతం.

వాడి దృష్టిలో జగన్నాథం అంకుల్ ఓ పే...ద్ద... మనిషి. ఆయనకు ఎంతోమంది స్నేహితులు, శిష్యులు, అభిమానులు వున్నారు. వారంతా ఆయన్ని ఎన్నోవిధాల పొగుడుతూ వుంటారు. ఆ అంకుల్ ఎప్పుడొచ్చినా తమ ఇల్లు కోలాహలంగానే వుంటుంది. ఆయనెప్పుడూ తమ ఇంట్లోనే దిగుతుంటాడు.

ఇంతలో రాముకు మధ్యాహ్నం టీచర్ చెప్పింది గుర్తుకు వచ్చింది.

క్షణం ఆలస్యం చేయకుండా "మమ్మీ అంకుల్ ఎక్కడా?" అని అడిగాడు.

"మేడ మీద మీ డాడీతో మాట్లాడుతున్నారు" అంది అమ్మ.

మేడ మీదకు పరుగెత్తాడు రాము.

"హాలో అంకుల్" విష్ చేశాడు రాము.

"హాయ్ రాము. రా.. రా..." ముద్దుగా దగ్గరికి తీసుకున్నాడు అంకుల్.

"అంకుల్ మీదగ్గర ఓ డౌట్ తీర్చుకోమని మా టీచర్ చెప్పింది"

"ఏమిట్రోయ్ అది?" విస్మయంగా ప్రశ్నించాడాయన. ఓ పక్కన తన ప్రసిద్ధికి సంతోషిస్తూనే.

"కుంభకోణం అంటే ఏమిటి అంకుల్?"

అవాక్కయిపోయిన అంకుల్- "ఎందుకురా?" అన్నారు.

"ఇవాళ మా టీచరు లంబకోణం గురించీ, లఘుకోణం గురించీ చెప్పింది. నేను కుంభకోణం అన్నమాట చాలాసార్లు విన్నాను. మరి అదేమిటని అడిగాను టీచర్ని. "పోయి మీ



మాధవరావు అంకుల్‌ని అడుగు- ఆయనకి బాగా తెలును" అంది

మాధవరావు కాస్త సందేహించాడు. "కుంభకోణం అంటే ప్రజల్ని మోసంచేసి అక్రమంగా సంపాదించేది. వాటిలో డబ్బు వుండొచ్చు. ధాన్యం వుండొచ్చు, పెట్రోలు వుండొచ్చు... దేనినైనా కుంభకోణం చేయవచ్చు. అది సరే... ఇంత చిన్న అర్థం మీ టీచర్‌కి తెలీదా? తనే చెప్పకుండా నన్నే ఎందుకు అడిగి తెలుసుకోమందని?" అర్థం చెప్పిన పిమ్మట ధర్మసందేహం వెలిబుచ్చాడు మాధవరావు.

"మీరు 'రాజకీయవేత్త' అటగా! మీకు బాగా తెలిసి ఉంటుందని మా మాస్టారు..." తడబడుతూ చెప్పాడు రాము.

మాధవరావు ఫేను పేలవంగా మారిపోయింది.

— కె.అప్పారావు.



# చతుర ప్రపంచం

## లక్షాధికారైనా అతను కూలీయే

31 ఏళ్ళ రాజేంద్రన్ విల్లుపురం బస్టాండులో హమాలి. ఒక రోజు మధ్యాహ్నం విశ్రాంతి తీసుకుంటూ అప్రయత్నంగా జేబు తడుముకున్నాడు. కొన్నాళ్ళక్రితం తను కొని దాచుకున్న లాటరీ టిక్కెట్టొక్కటి తగిలింది. వెంటనే లేచి లాటరీ ఏజంటు దగ్గరికివెళ్ళి టిక్కెట్టు చూపించాడు. దానికి లక్షన్నర రూపాయల బహుమతి వచ్చిందని ఏజెంటు చెప్పాడు.

ప్రైజు డబ్బు చేతికందాక రాజేంద్రన్ తనకున్న కొన్ని అప్పుల్ని తీర్చేశాడు. వ్యవసాయ భూముల్ని కొన్నాడు. ఓ యాభైవేలు ఖర్చుపెట్టి ఇల్లు కట్టించాడు. తన భార్యా, అయిదుగురు కూతుళ్ళూ, కొడుకు పేరున విడివిడిగా బ్యాంకులో కొంత పైకం దాచాడు. తనతోపాటు పనిచేసే కూలీలకి ఒక్కోబనియనూ, షర్టూ కొనిపెట్టాడు.

ఎందరికి ఎన్నిచేసినా రాజేంద్రన్ ముందు తనెలా ఉన్నాడో ఇప్పుడూ అలానే ఉన్నాడు. ముప్పూటలా తిని కాలుమీద కాలేసుకుకూర్చోక ఎప్పట్లానే బస్టాండులో మూటలు మోస్తూనే ఉన్నాడు. సంపాదనతో పొట్టపోసుకుని కుటుంబాన్ని పోషించుకుంటున్నాడు. గెలిచిన డబ్బుతో ఏ ఫ్యాక్టరీయో పెట్టి మరింత డబ్బు సంపాదించవచ్చుగదా, ప్రజాసేవ చేయవచ్చుగదా అని అడిగినపుడు, "డబ్బొచ్చినంతమాత్రాన నా జీవనవిధానంలో మార్పు ప్రవేశపెట్టదలచుకోలేదు. డబ్బు రావచ్చు, పోవచ్చు. కానీ నేనెప్పుడూ కష్టపడే బతుకుతాను. వచ్చిన డబ్బును తెలివిగా జాగ్రత్తచేశాను. నా పిల్లల చదువులకీ, భవిష్యత్తుకీ వారి వారి పేర్న కొంత ఆదా చేశాను. ఫాక్టరీ తెరిస్తే నష్టంవచ్చే ప్రమాదం కూడా ఉందిమరి! లేనిపోని ఆశలు పెట్టుకోను నేను. నాతోటి కూలీలకి కూడా సారాయి తాగొద్దని సలహా ఇస్తుంటాను. తాగితే ఆరోగ్యం, డబ్బూ రెండూ నష్టమేనని నచ్చజెపుతుంటాను. ఒంట్లో శక్తి ఉన్నంత కాలం ఇలా లగేజీలు మోస్తూనే ఉంటాను" అన్నాడు. "కష్టపడి సంపాదించాలనే సిద్ధాంతం కలవాడివి. లాటరీ టిక్కెట్టెందుకు కొన్నావు?" అని అడగ్గా- "ప్రతి విషయమూ స్పష్టంగా చెబుతాను. నా అల్పాదాయం ద్వారా పిల్లలకి మంచి చదువులు చెప్పించలేను. కానీ వారు గొప్పగా చదువుకోవాలని ఆశపడుతుంటాను. అందుకే వారికోసం తరచుగా లాటరీ టికెట్టుకొంటూ ఉండేవాడిని. ఎప్పుడో ఒకప్పుడు భాగ్యభవనపు ద్వారాలు తెరుచుకోక పోతాయా అని ఆశపడేవాడిని, దేవుడు కనికరించాడు. వచ్చిందిచాలు. ఇకముందు ప్రశాంతంగా, తృప్తిగా జీవనం గడపాలనుకుంటున్నాను" అంటాడు లక్షాధికారైన ఓ హమాలి రాజేంద్రన్.



# ముసుగులోనే ముగిసిపోయిన ఖైదీ

1698 సెప్టెంబర్ 18 మధ్యాహ్నం మూడు గంటలకు ఫ్రాన్సులోని బ్రస్సిలీ జైలుకు ముఖానికి ఇనుపతొడుగుతో ఓ ఖైదీ వచ్చాడు. అతను ధరించిన తొడుగుకు కళ్లు, ముక్కు, నోరు స్థానాల్లో చిన్నచిన్నరంధ్రాలున్నాయి. అప్పటి ఫ్రాన్సు చక్రవర్తి లూయిస్ పంపగా వచ్చిన ఆ ఖైదీ పేరుగాని, ఊరుగాని, కనీసం అతను చేసిన నేరంగాని అధికారులెవ్వరికీ తెలియదు. అతని వివరాలు తెల్సుకోడానికి, తొడుగు తొలగించడానికి ప్రయత్నించినవారికి శిరచ్ఛేదమే దండన అని రాజశాసనం. అయినా కుతూహలంతో 15మంది ఆ నిబంధనని అతిక్రమించి ప్రాణాలు కోల్పోవడమూ జరిగింది.

తరువాత ఆ ఖైదీ చర్యలను 24 గంటలూ గమనించడానికిగాను యం.డి.సెయింట్ అనే అధికారి నియమితుడయ్యాడు. కాలకృత్యాలు తీర్చుకునే వేళల్లో సైతం అతన్ని ఆ అధికారి వెన్నంటే ఉండేవాడు. అందువల్ల అతని విషయాలు తెల్సుకోడానికి ఎవ్వరికీ అవకాశంలేకపోయింది. పైగా ఆ ఖైదీ మితభాషి. చాలా హుందాగా నిబంధనల ప్రకారం మౌనంగా నడుచుకుంటూ అధికారుల మన్ననల్ని పొందాడు. ఆ కారణంగా అతనికి మంచిభోజనం, తదితర సౌకర్యాలు ఏర్పాటుచేసింది ప్రభుత్వం.

ఆ వింతఖైదీ గురించి ప్రజల్లో రకరకాలకథలు ప్రచారమయ్యాయి. అతనే అసలు చక్రవర్తి అని, అతన్నలా బంధించి వేరెవరో మోసగాడు దేశాన్ని ఏలుతున్నాడని కొందరి ప్రచారం. మరికొందరైతే అతను లూయిస్ చక్రవర్తి కవల సోదరుడనీ, తన సింహాసనానికి ఎసరు పెడతాడనే భయంతో చక్రవర్తి అతన్నలా నిర్బంధించి ఉంచాడని విశ్వసించారు.

నిజమేదైనా సుమారు ఐదేళ్లపైగా ఆ ఖైదీ అదే జైలులో కాలక్షేపం చేసి తుదకు 1703, డిసెంబర్ 10న మరణించాడు. అంతిమ సంస్కారం జరిగేటపుడు కూడా ముఖానికి ఉన్న తొడుగు తొలగించకపోవడంతో అతనెవరో ఎవరికీ తెలిసే అవకాశంలేకుండాపోయింది. అతని ప్రేరణతోనే ప్రఖ్యాత ఆంగ్ల రచయిత అలెగ్జాండర్ డ్యూమస్ 'దిమాన్ ఇన్ ది ఐరన్ మాస్క్' నవల రచించాడంటారు.



# చతుర

సంపుటి : 13 ఏప్రిల్ : 1990 సంచిక : 3

ఈ ప్రపంచంలోని అన్యాయాలకూ, అక్రమాలకూ ఇంకా అనేక సమస్యలకు మూలకారణం భయం. భయం ఉన్నంతకాలం సమాజంలో మార్పురాదు. వృత్తి ప్రవృత్తుల రీత్యా శ్రమైక జీవనం గడుపుతున్నా, ఉన్న భయాల్ని, రాబోయే కష్టాల్ని లెక్క చెయ్యకుండేనే తృప్తిని పొంది దారిద్ర్యాన్ని అధిగమించగలుగుతారెవరైనా!

'ఆమె'లో రెండు రకాల భావాల సంఘర్షణ జరుగుతూ వుంటుంది. ఏదో భయం అనుక్షణం ఆమెను వెంటాడుతూ ఆమెలోని ప్రశాంతతని హరిస్తూ వుంటుంది. ఆమెకే కాదు! ఆమెలాంటి ఇంకా ఎందరికో... సామాజిక రుగ్మతగా మారిన భయం... ఆమెలో మొదట ఎలా అంకురించింది? అది పెరిగి, చిగురించి... చివరికి వటవృక్షమై పరిసరాలను కూడా ఆక్రమించిన ఫలితంగా ఆ నీలినీడల సమస్యల్లో ఎందరెందరు చిక్కుకున్నారు?

భయంకరమైన ఊడల వటవృక్షంగా మారిన ఆమెలోని భయాన్ని కూకటి వ్రేళ్ళతో పెళ్ళగించడానికి ముందుకు వచ్చిన 'అతని' ప్రయత్నం సఫలమైన తీరు ఎలాంటిది? అంతటితో

# భయం

— అంతరించిందా? లేక అది దానికి విరామం మాత్రమేనా?

## పి.చంద్రశేఖర అజాద్

భయాల వైనాల్ని సమర్ధవంతంగా వివరిస్తూ, విశ్లేషిస్తూ రాసిన "భయం" ఈనెల 'చతుర' సమర్పిస్తున్న సమగ్ర నవల.

రైలు వేగంగా పరిగెడుతోంది.

తలుపుదగ్గర నిలబడి అతను ఏదో మాట్లాడుతున్నాడు.

అతనేదో అన్నాడు.

అతని మిత్రుడు పొట్ట చేత్తో పట్టుకొని నవ్వుతున్నాడు.

అతని దృష్టి మరల్చటానికి 'ఆమె' ప్రయత్నం చేస్తోంది.

ఓసారి అతను ఆమెకేసి చూశాడు.

వచ్చి కూర్చోమని సైగచేసిందామె.

చిన్నగా నవ్వి తన మిత్రుడికేసి తిరిగాడు.

ఎక్స్‌ప్రెస్ వేగంగా పరుగులు తీస్తోంది.

ఆమె ముఖంలో కొద్దిగా కోపం...

అంతకుమించిన ఆందోళన...

ఇంతలో ఒక్కసారిగా పెద్ద కుదుపు.

తలుపు వేగంగా అతని వీపును తాకింది.

కెవ్వున కేక!

అతను బయటికి గాల్లోకి విసిరివేయబడ్డాడు.

"ఏవండీ" ఆమె వెర్రికేక.

ఎవరో చైన్‌లాగారు.

బండి క్రమంగా వేగం తగ్గుతూ ఆగిపోయింది.

అందరూ దిగి పరిగెత్తుతున్నారు.

ఆమె మంత్రించిన వ్యక్తిలా ముందుకు దూకింది.

కంగారుతో, భయంతో పరిగెడుతోంది...

చెప్పులు జారిపోయాయి...

చీర అడ్డంపడి పడబోయి నిలదొక్కుకుంది.

జనం గుంపులుగుంపులుగా చేరిపోతున్నారు.

ఆమె జనాన్ని చీల్చుకుంటూ ముందుకు వెళ్ళింది...

'అయిపోయింది అంతా అయిపోయింది'

ఎవరో అంటున్నారు.

ఆమె అతన్ని చూసి ఆగిపోయింది.





రక్తపు మడుగులో 'అతను'.

అప్పుడామె అరవటం మొదలుపెట్టింది.

బిగ్గరగా...

గుండెలవిసేటట్లు...

భయంతో...

★ ★ ★

నిద్రలో ఆమె అటూ, ఇటూ పొర్లుతోంది.

ఆమె గొంతుచించుకుని బయటపడటానికి శబ్దం చేస్తున్న ప్రయత్నంలో చిన్న మూలుగు మాత్రం బయటకొచ్చింది.

క్రమంగా ఆ కదలిక ఆగిపోయింది.

మెల్లగా ఆమెకళ్ళు తెరుచుకున్నాయి.

గదంతా చీకటి... గడియారం 'టక్ టక్'మంటున్న చప్పుడు.

పక్కకు చూసింది... పిల్లలు గాలిపీలుస్తూ, విడుస్తున్న చిరునవ్వడి.

భయంతో కంపించిపోతోందామె. కళ్ళు తెరవాలన్నా మూయాలన్నా భయంగా ఉంది.

పైన సీలింగ్‌ఫ్యాన్ వేగంగా తిరుగుతూంది.

అయినా శరీరమంతా చెమటలు...

చేతులు కొంకర్లుపోతున్నాయి. కాళ్ళు ఎవరో లాగుతున్నట్లుగా పక్కకు తిరిగింది. ఊహుం లాభంలేదు.

పిల్లలమీద చెయ్యివేసింది. బలవంతంగా నిద్రపోవాలని ప్రయత్నం... సాధ్యపడటంలేదు... లేచి లైట్‌వేస్తే... పిల్లలు లేస్తారు... మరెలా, నిద్రరాదే...

ఆయన ఏంచేస్తుండి ఉంటారు... నిద్రపోతుంటారా?

రేపు వస్తారా? రారా?

రారేమో! రాలేకపోతే...

ఛీ... పాడు ఆలోచనలు... ఆయన తప్పకుండా వస్తారు.

ఇంకా నగం రాత్రి కూడా కాలేదా... ఘూర్కా వచ్చాడా?

మరి తనకు మెలకువ రాలేదెందుకు?

అంటే ఇంకా రాలేదా... ఇంకెప్పుడు తెల్లవారటం...

త్వరగా తెల్లారిపోతే ఎంత బాగుంటుంది!

అసలు ఏ ఆలోచనలూ రాకుండా ఉండా లంటే ఎలా?

తను నిద్రపోవాలి.

ఆమె అటూఇటూ పొర్లుతూంది.

ఆ కల... పీడకల... ఎంత భయానకమైన కల...

తెల్లవారేటప్పుడు వచ్చే కలలు నిజం అవు తాయంట.

అంటే... ఆయన...

అయ్యో ఈ రాత్రి ఇంక కరిగిపోదా?

రేపటి ఉదయమే ఆగిపోతుందా?

ఆమెలో ఆలోచనలు... నిద్రపట్టనివ్వని భయాలు.

"జానకమ్మా" ఎవరో అరుస్తున్నారు.

దుప్పటి పక్కకు విసిరింది జానకి.

"కాఫీపొడి ఉంటే ఇస్తావా?"

"ఉండండి చూస్తాను"

"మీ ఆయన వచ్చాడా?" అందామె.

"రాలేదు"

"ఏమిటలా ఉన్నావ్?"

"ఎలా ఉన్నాను?"

"రాత్రి అసలు నిద్రపోయావా? మీ ఆయన గురించి ఆలోచిస్తున్నావా? నీ మొఖం చూస్తే నిద్రపోయినట్లనిపించటం లేదు"

"రాత్రంతా నిజంగానే నిద్రలేదండీ. చేతు లు నొప్పులు. అప్పటికీ ఓ పక్కకు తిరిగిపడు కున్నా కొద్దిసేపటికే తిమ్మిరెక్కుతున్నాయి"

"ఏమిటో జానకమ్మా డాక్టర్‌కోసారి చూ పించుకో. రానురానూ తగ్గిపోతున్నావు. ఇక్కడ కొచ్చిన కొత్తలో నీకెంత పెద్ద జడ ఉండేదో. చూడు ఇప్పుడెలా ఉన్నావో"

"ఇవి అంత పెద్ద జబ్బులు కావులెండి. ఉండండి. కాఫీపొడి తెస్తాను" అంటూ జానకి లోపలకు నడిచింది.

కాఫీపొడి తెచ్చి ఇచ్చాక మొఖం కడుక్కొని, నీళ్ళబిందె పంపు క్రింద పేశాక కాఫీ తయారు చేసుకొంది. నీళ్ళు పడుతున్నా కాఫీ తాగుతు న్నా ఆమె కళ్ళు రోడ్డుకేసే చూస్తున్నాయి.

ఈ సమయంలో వచ్చే ట్రైన్ ఏమీలేదు. అయితే ఆయన ఎప్పుడూ ట్రైన్‌కే వస్తార నేంలేదు. బస్ దొరికితే బస్‌కీ వస్తారు. ఒక్కో సారి లారీలో కూడా వస్తుంటారు. లారీల్లో ప్రయాణం ఎంత ప్రమాదమో చెబితే వినరు.

తను బస్సులో వెళ్తున్నప్పుడల్లా బోల్తాపడ్డ లారీలనో చెట్లకు గుద్దుకున్న లారీలనో చూడ కుండా ఇంతవరకూ ఉండలేదు. రోడ్డంతా విరజిమ్మినట్లు అద్దాల పెంకులుంటాయి. ఒక్కోసారి మరోలారీతోనో, బస్‌తోనో ఢీకొట్టుకుని ఉంటాయి. అందులో లారీ డ్రైవర్లు తాగి నడుపుతుంటారనీ... అలాగే రెండు మూడు రోజులు నిద్రలేకుండా నడుపుతుంటారనీ, అందువల్లే ప్రమాదాలు జరుగుతుంటాయని తనకు చెప్పారు. అందుకే ఆ ప్రయాణాలు వద్దంటే వినరు. పైగా...

"జీవితంలో చావు ఒకసారే వస్తుంది జానకీ. మనం రోజూ చావకూడదు. ప్రతి విషయానికి భయపడితే మనం ఏమీ సాధించలేం" అంటారు.

జానకి కళ్ళు ఒక్కసారిగా చిన్నవయ్యాయి. ఏదో దృశ్యం గుర్తొచ్చి వణికిపోయింది.

"చావు... చావు జీవితంలో ఒక్కసారి కూడా రావద్దు. చావంటూ వస్తే ఈ ప్రపంచంలో నుండి మొదటగా తనే వెళ్ళిపోవాలి. అప్పుడే మవుతుందో తను చూడదు. తను బతి కుండగా మాత్రం ఆయనకు మరణం రాకూడ దు... రాకూడదు"

జానకి అప్రయత్నంగా బాత్‌రూంలోకి వెళ్ళి మొఖం కడుక్కొంది. అద్దం ముందుకొచ్చి కంకుమ భరిణ తీసుకొంది. నుదుటిమీద నిండుగా బొట్టుపెట్టుకున్నాక జానకి పెదవుల మీద చిరునవ్వు వెలిసింది.

★ ★ ★

"ఏంజానకమ్మా... మీవారు వచ్చినట్లు లేరే" అంటూ వచ్చింది అన్నపూర్ణమ్మగారు.

"ఇంకా లేదండి... ఒంటిగంట బండికి వస్తారేమో"

"పిల్లలు బడికి వెళ్ళారా?"

"వెళ్ళారండి"

"ఏంచేస్తున్నావు?"

"ఏంలేదండి. ఈరోజు బట్టల పనిలేదు. గోధుమలు తీసుకున్నాను. శుభ్రంచేసి పిండిపట్టించాలనుకుంటున్నాను"

"ఏం? రాత్రిపూట భోంచేయవా ఏమిటి?"

"నేను కాదండి. ఆయన రాత్రిపూట చపాతీ తింటా నంటున్నారు. నాక్కూడా అది మంచిదే అనిపిస్తోంది. ఆయనేమో బాగా లావు అవుతున్నారు. వ్యాయామం చేయమంటే చేయరు. అందుకే రాత్రిపూట భోజనం మానితే అయినా తగ్గుతారేమోనని"

"ఆయనకయితే ఫర్వాలేదమ్మాయ్. నువ్వు తింటావేమోననుకున్నా. ఇప్పటికే బాగా తగ్గావు"

"నిజంగా అంత తగ్గానాండీ? పొద్దున పార్వతమ్మగారుకూడా అలానే అన్నారు"

"అవునమ్మాయ్. ఆరోగ్యం బాగుండటంలేదా ఏమిటి? డాక్టర్‌కి చూపించుకోకూడదూ"

"అదేం లేదులెండి... నేనేం తగ్గలేదు" అంది జానకి.

"అది సరేగాని అమ్మాయ్... ఈరోజు పేపర్ చూశావా?"

"ఏమైనా విశేషం ఉందా?" అంది జానకి.

"విశేషం కాదు. దారుణం... కేరళలో ఓ వంతెన మీదనుండి రైలు పడిపోయి వందలాది మంది చచ్చిపోయారంట"

గోధుమల్లో రాళ్లు ఏరుతున్న జానకి టక్కున ఆగిపోయింది. ఒక్కసారిగా భయంతో కళ్ళు కుంచించుకుపోయాయి. అన్నపూర్ణమ్మగారు ఇవేం పట్టించుకోకుండా చెప్పుకుపోతూనే ఉంది.

"క్రింద పెద్ద నదంట. దాన్నిండా నీళ్ళున్నాయి. పావం జనమంతా అందులో కొట్టుకుపోయుంటారు. పేపర్‌నిండా ఫొటోలు వేశారమ్మాయ్. చూస్తుంటే కళ్ళు తిరిగిపోయాయనుకో. పసిబిడ్డల ఫొటోలు. ఏం ప్రయాణాలో ఏమిటో. ఇంట్లోనుండి కాలు బైటపెట్టాలంటే భయంగా ఉంది. రైళ్ళు అంతే, బస్సూలూ అంతే. మొన్నటికిమొన్న ఆ తెనాలి బస్సు కాల్వలోపడిపోతే ఎంతమందిపోయారో... ఆ రోడ్లు బాగు చెయ్యరు. ఏమిటోలే. కలికాలం వచ్చేసింది. ఎప్పుడు బతుకుతామో, ఎప్పుడు ఛస్తామో ఎవరూ చెప్పలేకపోతున్నారు"

నుదుటపట్టిన చెమట చుక్కల్ని కొంగుతో తుడుచుకుంది జానకి. గుండెలో సన్నటి ప్రకంపన మొదలైంది. చేటను పట్టుకున్న చేతులు పట్టుకోల్పోతున్నట్లనిపించింది. చేతులు తిమ్మిరెక్కుతున్నాయి. కాళ్ళలో వణుకు మొదలయింది. శరీరంలో రక్తంవేగంగా ప్రసరిస్తున్న అనుభూతి.

అన్నపూర్ణమ్మగారు మాట్లాడుతోంది వినపడటంలేదు.

రాత్రి కల గుర్తొస్తోంది...

ఎవరిదో వెర్రికేక... ఎవరెవరో పరిగెడుతూ... రక్తపుమడుగు...

అంతా అయిపోయింది. ఆ... యి... పో... యి... ం... ది...

"విమానాలూ అలాగే తయారయ్యాయి. ఈరోజు పేపర్‌నిండా చావువార్తలే. వింటున్నావా అమ్మాయ్"

అప్పుడు ఈ లోకంలోపడింది జానకి.

"వింటున్నాను ఆంటీ. గోధుమలు లోపల పెట్టివస్తాను" అంటూ లేచింది.

లోపలకు వచ్చిందేగాని తిరిగి బయటకు వెళ్ళాలనిపించలేదు. ఒక్కోసారి ఈ అన్నపూర్ణమ్మగారితో ఇంతే. ఆమె ఏ విషయంగురించైనా మాట్లాడటం ఆరంభిస్తే ఇంకదానికి అంతుండదు. ఆవిడ ఎక్కువగా పత్రికలు చదువుతుంటుంది. ఆ వార్తల్ని పదేపదే చెబుతుంటుంది. తనకు రాత్రినుండి ఒకటే భయంగా ఉంది. అలాంటి సమయంలో ఈ చావువార్తలు మరింత ఇబ్బందికరంగా ఉన్నాయి.

అన్నపూర్ణమ్మగారు కొంచెంసేపు చూసింది. జానకి వచ్చేటట్లు కనిపించలేదు. లేచి తనే వద్దామనుకుంటుండగా ఇంకెవరోవచ్చారు. తిరిగి రైలు ప్రమాదం విషయం ఆవిడకు వివరించటం ఆరంభించింది.

"అమ్మయ్య" అంటూ గుండెలమీద చెయ్యివేసుకొంది జానకి.

జానకిది ఓ చిత్రమైన మనస్తత్వం. ఆమె



తనకు చెందిన విషయాలను ఎవరితోనూ చర్చించదు. తన భావాలు ఏమిటో ఎదుటివారికి తెలియకుండా జాగ్రత్తపడుతుంది. మరీ ముఖ్యంగా తను నిరాశకూ, భయానికి గురైన సందర్భంలో వాటిని కప్పిపెట్టటానికి ప్రయత్నం చేస్తుంది. అన్నపూర్ణమ్మగారిని వదిలించుకున్నా ఆమె మాటలు ఇంకా చెవిలో మోగుతూనే ఉన్నాయి.

"రైళ్ళూ అంతే. బస్సులూ అంతే. ఎప్పుడు ఛస్తామో ఎప్పుడు బతుకుతామో ఎవరూ చెప్పలేకపోతున్నారు"

ఇంకా నయం. మరికొంచెంసేపుంటే ఏ సంవత్సరంలో, ఎంతమంది ఇలా ప్రమాదాల్లో మరణించారో లెక్కల్తోసహా చెబుతుంది.

అయినా ఇంతవరకు ఈయనెందుకు రాలేదు? ఇంటికి ఎప్పుడువచ్చేదీ చెబితే ఈ ఆందోళన ఉంటుందా? అయినా ఈ మనిషి తనేదో ధైర్యవంతుడ్ననుకుంటాడు. ఇంటిదగ్గర తన రాకకోసం ఎదురుచూస్తుంటారనే విషయం జ్ఞాపకం ఉండదు. ఒక్కోసారి తనకు భలేచిరాకు వేస్తుంది. రాగానే భయంకరంగా పోట్లాడాలని పిస్తుందికూడా.

"చూడు జానకీ... ఫలానా బండికి వస్తాననో, ఫలానా బస్‌కు రాగలననో చెప్పటం ఎలా వీలవుతుంది? ఓ పనిమీద వెళ్తున్నాను. అది ఎప్పటికి పూర్తవుతుందనే విషయంమీద ఆధారపడి ఉంటుంది తిరిగిరావటం. అయినా మనిషన్నాక వెళ్ళినవాడు తిరిగి రాకుండా ఉంటాడా? నీకంత ఆందోళన ఎందుకు? అసలు దేశంలో ప్రతిరోజూ కొన్ని లక్షలమంది ప్రయాణాలు చేస్తున్నారు. వారందరూ తమ కొంపలకు చేరతామా, ఛస్తామా అంటూ కూర్చుంటే ఇంక ఈ ప్రపంచంలో ఏడుపుతప్ప ఏమీ మిగలదు. ఛో... నువ్వు ఈ విషయం గురించి ఎక్కువగా ఆలోచించుకోవద్దు. నేను ఏ ఊరువెళ్ళినా సాధ్యమైనంత త్వరగా రావటానికి ప్రయత్నంచేస్తాను- సరేనా?" అంటాడాయన.

"జానకీ... మనం జీవితంలో ఏక్షణమూ భయపడకూడదు. మనం ఎన్ని వైఫల్యాలు పొందినా, ఎంతగా ఓడిపోతున్నా గెలవగలం అనే ధీమాతో ఉండాలి. తిరిగి మరలా మరలా ఉత్సాహంతో ముందుకురావాలి. మనకు ధైర్యాన్నిమించిన ఆస్తిలేదు. భయం ఓ రోగం. అది ముదిరితే పిచ్చి అవుతుంది. అందుకే పిచ్చి పిచ్చి భయాలకు ఎప్పుడూ దూరంగా ఉండాలి"

జానకికి భర్త మాటలు గుర్తొస్తున్నాయి.

ఒక్కోసారి తనను చూసుకుంటే తనకే జాలి వేస్తుంది. ఎందుకింత పిరికిదానిగా మారుతోంది తను? ఎందుకిలాంటి ఆలోచనలు తనను పదేపదే పీడిస్తున్నాయి. ఈ ప్రపంచంలో ఎంతమంది ప్రయాణాలు చేయటంలేదు? అందులో సగం మంది స్త్రీలు కదా. వారందరికీ ఇలాంటి ఆలోచనలుంటాయా? తనకు పదేపదే "ఆయన లేకపోతే" అనే భావం ఎందుకు కలుగుతుంది? ఆయన లేకపోతే ఈ లోకం శూన్యమా... చీకటా?

చీకటి అంటే గుర్తొస్తూంది. భయానికీ, చీకటికీ సంబంధం ఉందా? భయం... భయం ఎప్పుడు మొదలవుతుంది? అసలు భయమంటే ఏమిటి?

జానకి మనోపథంలో ఏవేవో దృశ్యాలు...

ఆ స్రవంతిలోకి జారిపోయింది జానకి.

* * *

బడినుండి రాగానే పుస్తకాలు టేబుల్ మీద పెట్టి దొడ్లోకి వెళ్ళింది జానకి. ముఖం కడుక్కు రాగానే అమ్మ స్వీటు అందిస్తూ చెప్పింది.

"నాన్న, నేనూ ఈరోజు అక్క దగ్గరకెళ్తున్నాం."

"నేను కూడా వస్తానమ్మా"

"నువ్వు రావటం కుదరదమ్మా. దగ్గరకాదు కదా. అందులోనూ నీకు బడి ఉంది. పదిరోజుల్లో మేం తిరిగి వచ్చేస్తాం. ఇక్కడ నాయనమ్మ ఉంది కదా. నీకేం భయంలేదు. చక్కగా రోజూ బడికి వెళ్ళు. నీకు ఇష్టమని కారప్పూస, లడ్డు చేసి వెళ్తున్నాను. చూడు. నాయనమ్మను విసిగించకూడదు. ఏంచెబితే అది చెయ్యాలి. మేం లేమని బడి మానకూడదు- సరేనా?"

లడ్డు తింటూ అడిగింది జానకి.

"ఎందుకమ్మా అక్కయ్యగారింటికి?"

"ఏదో పనుంది. వెంటనే రమ్మని అక్క





ఉత్తరం రాసింది. అక్క పెళ్ళి అయ్యాక ఇంతవరకు మేం కూడా అంతదూరం వెళ్ళటం కుదరలేదు. పనిలోపని అన్నీ కలిసివస్తాయని బయలుదేరుతున్నాం. వేసవికాలం శెలవుల్లో ఈసారి నిన్నెక్కడికయినా పంపిస్తాంలే"

"త్వరగా వచ్చెయ్యాలి. మీరిద్దరూ లేకపోతే నాకు దిగులుగా ఉంటుంది" అంటున్న కూతురి మాటలకు ఆమెలో ప్రేమతో కూడిన భావం మెదలి జానకి బుగ్గల్ని మృదువుగా స్పృశించింది.

"నీకే కాదమ్మా... మాకూ అంతే త్వరగా వచ్చేస్తాంగా"

"ఎప్పుడు బయలుదేరుతున్నారు?"

"రాత్రికి"

"నాన్నగారేరి?"

"దొడ్లో మొక్కల దగ్గర ఏదో పనిచేస్తున్నారు చూడలేదా?"

"లేదు" అంటూ అటు పరిగెత్తింది.

దొడ్డినిండా మూడువంతులు కూరగాయల మొక్కలు. ఓ వంతు మాత్రం పూలమొక్కలు. వంకాయలు, బెండలు, చిక్కుడుపాదు... ఇంకా ఆకుకూరలు. ఆయన అక్కడ తదేకంగా పనిచేస్తున్నాడు. తమ గట్టు బారుగా కొబ్బరిచెట్లు, నడుమ సపోటాచెట్టు, జామచెట్టు.

గట్టు క్రింది నుండి పొలం ఆరంభం. ఆ చెక్కంతా కలిపితే పదిహేను నుండి ఇరవై ఎకరాలవుతుంది. తమ గట్టును ఆనుకున్న రెండు ఎకరాలు తమవి. వాటిని కౌలుకిస్తారు. ఆ నడుమే పెళ్ళయిన జంట కౌలుకు తీసుకున్నారు. అక్కడ ఓ దొరువు ఉంది. ఇద్దరూ కలసి దాని పూడిక తీస్తారు. ఆ నీటితో నారు పెంచుతారు. ఆ నారు నాటడం, కలుపు తియ్యటం అన్నీ వారు చేసుకుంటారు. బాగా అవసరమైతేగానీ ఎవరినైనా పెట్టుకోరు.

పొలం వారికిచ్చేసినా జానకి నాన్నగారు ఎప్పుడూ ఏదో ఒక పనిచేస్తుంటారు. ఆ చివర నుండి ఈ చివరి వరకు పొలికట్ట తీసుకొని ఊడవటంతో ఆరంభమౌతుంది ఆయన కార్యక్రమం. దొడ్లోనే ఓ చావిడిలాంటిది నిర్మించారు. ఇదివరకయితే గేదెలు ఉండేవి. ఇప్పుడు లేవు. అక్కడే భోజనాలయ్యాక వచ్చి పడుకోవడం. పంటచేల మీదనుండి వచ్చే చల్లటి గాలి తగులుతుంటే అమ్మ, నాయనమ్మ, నాన్న మాట్లాడుకుంటూనే నిద్రపోతుంటారు.

ఇంకా చావిడి అవతల స్థలం ఉంది. అది పెద్దక్కగారిది. అంత దూరం వెళ్ళి శుభ్రంచేయలేక వదిలేశారు. అక్కడున్న 'చీమతుమ్మ' చెట్లకు కాసే కాయలు తియ్యగానే ఉంటాయి. ఇంకా అక్కడ పొదలున్నాయి. పుట్టలున్నాయి. అక్కడ పాములుంటాయంటారు.

ఒకటి రెండు సందర్భాలలో తనూ పాముల్ని చూసింది. అక్కడకు వెళ్ళేటప్పుడు 'జాగ్రత్త' అని చెబుతారు. చీకటి పడ్డాక మాత్రం అటు వెళ్ళరు. వెళ్ళినా చేతిలో కర్ర ఉంటుంది. అది మోగించుకుంటూ వెళ్ళాల్సిందే. అలా మోగించుకుంటూ వెళ్తే దారిలో ఏ పురుగూ, పుట్రా ఉన్నా ఆ శబ్దానికి అవి తొలగిపోతాయట.

ఆ పొదలమీద రకరకాల పూలుంటాయి. అవి తలమీద పెట్టుకోవటానికి పనికిరావు. దూరం నుండి చూడటానికి బాగానే ఉంటాయి. ఎప్పుడన్నా కోసి వాసన చూస్తే అదోరకంగా ఉంటాయి.

వానలు కురిసినప్పుడు మాత్రం నాన్న అక్కడకు వెళ్తాడు. వాన చినుకులు ఆ పుట్టల మీద పడగానే 'పుట్టకొక్కులు' బయటకొస్తాయి. వాటిని వండుకుంటే మాంసం కూరకూడా ఎందుకూ పనికి రానంత రుచిగా ఉంటాయి.

అసలు అవి దొరకటమే కష్టం.

పట్నంలో అయితే వాటికోసం ఎంతగా తపించి పోతారో! ఈ పుట్టకొక్కుల్లోనూ రెండు రకాలున్నాయి. కొన్ని తింటే చచ్చిపోతారు.

వాన వెలిశాక నాన్న పొదల దగ్గరికి వెళ్తుంటే భయం కలుగుతుంది. పుట్టకొక్కులు తెంచుతున్నప్పుడు "ఏ మూలనుండో ఏ పామో బయటకివచ్చి కాటువేస్తే అనిపిస్తుంది. తన కంటే అమ్మ ఎక్కువగా కంగారు పడుతుంది.

"ఈయనకు ఛాదస్తం కాకపోతే వానరాగానే అటు పరుగులు తియ్యటమెందుకు? పోనీ నాలుగువేసుకొని తృప్తిగా వెనక్కివస్తారంటే అదీలేదు. అక్కడున్నవన్నీ కోసుకురావాలి.



అనలే అక్కడ శుభ్రం చేయక ఇష్టారాజ్యంగా ఉంది- ఏ పురుగులో చేరతాయి"

బుట్టనిండా పుట్టకొక్కులు తెచ్చినప్పుడు నాన్నమొఖం చూస్తే ఎంత సంతోషం కలుగుతుందో!

"ఇవి మనకి వండు... ఈ నాలుగూ కృష్ణవాళ్ళకివ్వు... ఇవేమో ఆ చౌదరిగారికి ఇచ్చివస్తాను. ఇంకొంచెం ఉన్నాయి కదా. అవి అమ్మాయికి ఇచ్చివస్తాను"

అక్కడికి దగ్గరగా ఉన్న చిన్నపట్నంలో తన మూడో అమ్మాయి ఉంటుంది. చౌదరిగారు కుటుంబమిత్రులు. పిల్లల చదువులకోసం వాళ్ళూ అక్కడే ఉంటున్నారు.

మొత్తం జానకితోసహా ఏడుగురు సంతానం ఆయనకి. అందులో ఆడపిల్లలు అయిదుగురు. ఇద్దరు మొగపిల్లలు. జానకి చివరి అమ్మాయి. ముగ్గురి పెళ్ళిళ్ళు అయ్యాయి. నాలుగో అమ్మాయి పెళ్ళికి ఎదిగింది. జానక్కి పదిసంవత్సరాలు దాటుతున్నాయి. మొగపిల్లలు చదువుతున్నారు. పెద్దమ్మాయి దగ్గర ఒకరు. రెండో అమ్మాయిదగ్గర ఇంకొకరు. ఇంట్లో ప్రస్తుతం జానకీ, అక్క. ఆమె చదువు మానేసింది. తను కూడా రెండో అక్క దగ్గరకి వెళ్ళింది. వాళ్ళు ఈ రాష్ట్రం అవతల ఉంటున్నారు. రమ్మని ఎప్పటినుండో గొడవ చేస్తుంటే వెళ్ళింది. పెద్దక్క వాళ్ళు నిజామాబాద్ దగ్గర ఓ పల్లెటూర్లో ఉంటున్నారు.

అందరూ దూరంగానే ఉన్నారు. మూడో అక్క మాత్రమే దగ్గర ఉంది. నాలుగో అక్కకు ఎక్కడ సంబంధం వస్తుందో? ఎంత దూరం వెళ్ళిపోతారో?

జానకి తండ్రికి ఉద్యోగంలేదు. రెండకరాలు మాత్రం తన వాటాకు వచ్చాయి. వాటితోనే పిల్లల్ని సాకటం. పెళ్ళిళ్ళు చేసి పంపించటం జరిగింది. ఆయన నిరంతరం శ్రమిస్తాడు. తనకు చేతనయింది చేయటం. ఇతరులకు ఉపయోగపడటం తనలోని మంచి లక్షణం. ఆయన అలా పనిచేస్తుంటే చూడాలనిపిస్తుంది. ఎప్పుడూ పని... పని... అంతకుమించి మిగతా విషయాల మీద అంత శ్రద్ధ ఉండేదికాదు.

"ఏంటమ్మాయ్ అలా చూస్తున్నావు"

అనేదాకా జానకి ఆలోచిస్తూనే ఉంది.

"వంకాయలు నవనవలాడుతున్నాయి. మరీ పిందెలు కొయ్యకు. అక్కకు ఇద్దాం. బెండకాయలు కూడా కొయ్యి. మేం వచ్చేదాకా బడినుండి రాగానే నీళ్ళు పెడుతుండు. తోటకూర కావాలంటే ఎవరినన్నా కోసుకువెళ్ళమను. నాయనమ్మకు కొబ్బరికాయలు కావాలని పిస్తే మన వీరయ్యకి చెబితే కోస్తాడు. మేం అక్కయ్య దగ్గరకు వెళ్తున్నాం. నువ్వు రోజూ బడికి వెళ్తావుగా" చెప్పుకుపోతున్నాడు.

జానకి తలూపుతూ కాయలు కోయటం ఆరంభించింది. ఎందుకో కళ్ళెత్తి చూడగానే దొడ్డి అవతల పాదలు కనిపించాయి.

నాన్న వెళ్ళగానే వర్షం కురిస్తే అనిపించింది. వర్షం వస్తే ఎంత బాగుంటుందో. నాన్న లేకుండా స్వయంగా వెళ్ళి ఆ పుట్టమీద వచ్చే పుట్టకొక్కుల్ని తెంపుకురావాలి. నాయనమ్మ "ఓసినీదుంపతెగా" అని ఆశ్చర్యపోయి వండిపెట్టాలి. వాటిల్లో కొంచెం కృష్ణగార్కి, మరికొన్ని చౌదరిగార్కి పంపించాలి. అప్పుడు వాళ్ళేమో-

"సీతయ్యగారు లేకపోయినా వాళ్ళమ్మాయి పంపించిందే. వాళ్ళనాన్నను మించిపోయేలా ఉంది" అంటారు.

అమ్మకు తెలిస్తే కోప్పడుతుందేమో!

"మీ నాన్ననే వెళ్ళొద్దంటే, నువ్వా తయారయ్యావా" అని తిడుతుందేమో ఖచ్చితంగా "ఇంకెప్పుడూ అటువెళ్ళను" అనిపించుకుంటుంది. తనలోతాను నవ్వుకొంది...

"అయిపోయిందా" అంటున్నాడు నాన్న.

ఆలోచనల్లోనే కాయలు తెంపుతూంది జానకి.

"అమ్మాయ్" లోపల నుండి అమ్మ పిలుస్తోంది.

"ఏంటో చూడు" అన్నాడు నాన్న.

జానకి లోపలికి నడిచింది.

"అత్తయ్యావాళ్ళకు బాత్‌రూం చూపించు" అంది అమ్మ.

జయమ్మ అత్తతోపాటు వాళ్ళ కూతురు





లలిత కూడా నిలబడి ఉంది. వాళ్ళ ముఖంలో చుట్టాలింటికొచ్చిన సంతోషం కనపడలేదు. వారేదోవిషయంలో ఆందోళన చెందుతున్నట్లున్నారు.

"రా అత్తయ్యా" అంది జానకి.

లలితను కళ్ళతోనే పలుకరించింది.

"ఏయ్ బాగా చదువుతున్నావా?" అంది జయమ్మ అత్త.

"ఆఁ బకెట్‌లో నీళ్ళున్నాయి- స్నానం చేస్తారా?"

"లేదే... ముఖం కడుక్కుంటా"

"టవల్ తెస్తాను" అంటూలోపలికెళ్ళింది జానకి.

ముఖం కడుక్కువచ్చాక అమ్మ ఇచ్చిన కాఫీ తాగింది.

అప్పటికి నాన్న వచ్చి కూర్చున్నాడు.

ఏదో విషయం గురించి సీరియస్‌గా చెబుతోంది జయమ్మ అత్త. తనకా విషయం ఏమిటో అర్థంకావటంలేదు.

పెద్దవాళ్ళు మాట్లాడుకునేటప్పుడు ఎప్పుడూ తను వెళ్ళదు. ఓసారి అమ్మా, నాన్న చెప్పారు. అలా వచ్చి వినకూడదని.

ఓసారి ఏదైనా చెబితే సాధ్యమైనంతవరకు ఆ మాటను గుర్తుంచుకుంటుంది జానకి. దానికి వ్యతిరేకంగా ఏదీ చేయదు.

చూస్తుండగానే కాలం గడిచిపోయింది. మాట్లాడుతూనే బట్టలు సర్దారు. భోజనాలు పూర్తయ్యాయి. అంతకుముందు చెప్పినట్లున్నారు. రిక్షావచ్చి ఇంటిముందు ఆగింది.

"జాగ్రత్తమ్మా... అత్తకూడా నాలుగురోజులుంటుంది" అని జానక్కి చెప్పి "మరి వస్తానమ్మాయ్. నేను వచ్చాక ఆ విషయం గురించి మాట్లాడదాంలే. నాలుగురోజులాగితే దారిలోకొస్తాడేమో చూద్దాం" అని అత్తతో చెప్పి నాన్న రిక్షా ఎక్కాడు.

"వస్తా బుజ్జీ" అంటూ అమ్మకూడా వెనక కూర్చుంది.

చూస్తుండగానే రిక్షా కదిలిపోయింది.

వాళ్ళు వెళ్తుంటే బాధగా ఉంది. ఇంతవరకూ తనెప్పుడూ వారిని విడిచి ఉండలేదు. అమ్మో, నాన్నో ఎవరో ఒకరు ఉంటుంటారు. మొదటిసారిగా ఇద్దరూ కలసి వెళ్తున్నారు.

అలా చూస్తూనే ఉన్న ఆ చిన్నారి మనసులోకి ఓ ఆలోచన వచ్చింది.

అమ్మా, నాన్న పదిరోజులకైనా వస్తారా? అసలొస్తారా?

* * *

ఉదయమే లేచి మొక్కల దగ్గరకెళ్ళింది జానకి.

ఆకులనిండా మంచుబిందువులు. చీవతుమ్మ చెట్లమీద సూర్యకిరణాలు... కొబ్బరి చెట్లమీద కాయలు... గెలలు... ఈ రోజు బడి మానేస్తే అనుకుంది. అమ్మో మానేస్తే ఇంకేమైనా ఉందా? అమ్మకూ, నాన్నకూ కోపం వస్తుంది. కోపంకంటే బాధపడ్తారు. తాము లేకపోతే మరోరకంగా ప్రవర్తించటాన్ని వారు ఊహించలేరు.

బడికి వెళ్ళి వచ్చింది.

అత్తవాళ్ళు లేరు.

నాయనమ్మ ఒక్కర్తే ఉంది.

రాగానే ఓ లడ్డుతోపాటు కారప్పూస ప్లేటులో పోసి ఇచ్చింది.

నాయనమ్మ దగ్గర జానక్కి చనువు. తింటూ అడిగింది -

"నాయనమ్మా నువ్వు ఏమీ అననంటే ఓ విషయం అడుగుతాను - చెబుతావా?"

"ఏమిటే అంత పెద్ద విషయం"

"మరి నువ్వు కోప్పడకూడదు"

"సర్లే చెప్పు"

"అత్తయ్యవాళ్ళు ఎందుకలా ఉన్నారు?"

"అదా" అంటూ నవ్వేసింది.

"మీ అత్తను మీ మామ ఇంట్లోనుండి తరిమేశాడే"

"ఎందుకు నాయనమ్మా"

"ఎందుకంటే వాడికది మామూలే. మీ మామ సంగతి నీకు తెలుసుగా. వాడు బాగా తాగుడికి అలవాటుపడ్డాడు. పంటలొచ్చేటప్పుడు ఏదోరకంగా పొట్లాట పెట్టుకుంటాడు. ఇంట్లోంచి తరిమేస్తాడు. నాలుగురోజులు ఇలానే వస్తారు. ఆ తర్వాత వాడే వస్తాడు.




ఇదంతా ఎప్పుడూ ఉండే భాగోతమే''

''అది సరే నాయనమ్మా అత్తయ్యవాళ్ళకు ఇంకా పిల్లలుండాలిగా మరి వాళ్ళేరి?''

''అందరూ ఒకరి ఇంటికొస్తే భారంగా ఉంటుందని వేరే వెళ్ళారు''

''మరి ఇల్లయితే ఎలా నాయనమ్మా''

''ఏంచేస్తామే... ఎవరి అదృష్టం వారిది. ఎవరికెలాంటి మొగుడు రావాలో నుదుటిమీద రాస్తాడు భగవంతుడు. ఆ రాతను ఎవరూ తప్పించలేరు''

''అత్తయ్యవాళ్ళు ఎక్కడికి వెళ్ళారమ్మా''

''తెలిసినవారుంటే వెళ్ళారులే. నువ్వు స్నానంచేసి చదువుకోవూ'' అంది.

జానకి స్నానాలగదిలోకి నడిచింది. స్నానం చేస్తుంటే ఒకటే ఆలోచన ''మామయ్యకు ఇది మామూలేనా! ఇలా ఇంటినుండి వెళ్ళగొడుతుంటే ఎలా? ఎవరూ రానియ్యకపోతే ఎక్కడికెళ్తారు. అసలు ఆ చిన్నపిల్లను వెళ్ళగొట్టడానికి మామయ్యకు చేతులెలా వచ్చాయి? ఇదంతా కర్మ అంటుందేమిటి నాయనమ్మ? కర్మంటే ఏమిటి? ఇలా చేసేవారు ఇంకా చాలామంది ఉంటారా?''

చదువుకుంటున్నా ఇదే ఆలోచన.

బయటకువెళ్ళిన జయమ్మ అత్తవచ్చింది. అందరూ భోజనాలు అయ్యాక ముందుగదిలో మంచాలు వేసుకున్నారు.

బయట చందమామ వెన్నెల విరజిమ్ముతోంది.

జానక్కి చాలాసేపు అమ్మా, నాన్న గుర్తొచ్చారు. ఆ తర్వాత నిద్రపోయేంతవరకూ జయమ్మ అత్తగురించిన ఆలోచనలే. అసలు మావయ్య లేకపోతే వాళ్ళు బతకలేరా? బతకాలంటే ఏమైనా పనిచేయాలిగా. ఏం పనిచేస్తారు? అత్త అంతగా చదువుకోలేదు. అయినా బయటకెళ్ళి పనిచేస్తే ఇంకేమైనా ఉందా? మరెలా? పిల్లలు పెద్దవారుకావాలి. ఎలా అవుతారు? ఎలా చదువుకుంటారు? ఎలా? ఎలా?''

కంటిమీదకు నిద్రముంచుకొచ్చేంతవరకూ ఇదే ఆలోచన.

* * *

అత్తయ్య కూర్చుని వింటోంది నాయనమ్మ చెబుతుంటే.

''ఏమిటోనే దేశం రానురానూ ఇలా తయారౌతోంది. మా కాలంలో ఎప్పుడన్నా ఇలాంటి వార్తలు వినేవాళ్ళమా? అయినా మన కులాల్లో ఆ తాగుడు ఎక్కడుండే. అలగా జనం తాగి పెళ్ళాల్ని కొట్టిచస్తారు. అసలిప్పుడు తాగటం ఫ్యాషన్ అయిందటకదా. ఏం చోద్యమో ఏమిటో. ఇక్కడా ఈ వార్తలే. పట్నాలెళ్ళివెధవ్వేషాలు నేర్చుకుంటున్నారు. వెధవతిళ్ళూ, వెధవ తిరుగుళ్ళు. రూపాయలు అలా ఆ హొటళ్ళకు తగలెయ్యకపోతే ఇంట్లో చేయించుకుంటే నలుగురూ తినొచ్చుకదా. అది సరే వీడికిదేంపొయ్యేకాలం. పెళ్ళాన్ని తరిమేయటం, నాలుగురోజులు తాగటం, మరలా తీసుకువెళ్ళటం. ఉన్నదంతా ఇలా తాగేస్తుంటే రేపు వీళ్ళ భవిష్యత్తు ఏమిటి? ఆ సీతయ్య చూడు. వాడికింకా ఇద్దరున్నారు. కాలం మారిపోతూంది. ఏదోవాడి అదృష్టం బాగుండి పెళ్ళిళ్ళు చేశాడు. ఇప్పుడు వాళ్ళిద్దరినీ ఎలా బయటకు పంపిస్తాడా అని తలుచుకుంటేనే భయంతో గుండె చెరువవుతుంది. ఇంక నీ సంసారం ఎప్పుడు బాగుపడేను?''

జయమ్మ అత్త కళ్ళనీళ్ళు పెట్టుకొంది.

ఆ కళ్ళలో భయంకన్నా దిగులు కనిపిస్తోంది.

జానకికి ఆ వయసులో అప్పుడే ఓ ఊహ ప్రవేశించింది.

ఇంకా పెళ్ళికి ఇద్దరున్నారు. అక్కపెళ్ళి చేస్తే మిగిలేది తనే...

తనకెలాంటి భర్తవస్తాడు?

మావయ్యలాంటి వాడొచ్చి ఎప్పటికప్పుడు తరిమేస్తుంటే తనూ పిల్లల్ని వేసుకుని ఇలానే...

ఆకాశంకేసి చూసింది.

ఉదయంనుండి వాతావరణంలో మార్పు వచ్చింది. మబ్బులు పట్టాయి. చల్లటిగాలి మొదలయింది.

వానంటే తనకెంత ప్రేమో... ఆ చల్లని చినుకుల నడుమ గిర్రున తిరుగుతుంటే ఎంత ఆనందమో... ఆ వాన చుక్కలకోసం నోరంతా తెరిచి, నాలికచాస్తే టపటపమంటు



ఒక్కో చుక్క పడుతుంటే ఎంత అనుభూతో... పెద్ద వర్షం కురుస్తుంటే అలానే నిలబడిపోవాలనిపిస్తుంది. అమ్మా, నాన్నల, జలుబూ, జ్వరాల భయం లేకపోతే వాన కురుస్తున్నంత సేపూ అలానే ఉండిపోవాలనిపిస్తుంది.

అమ్మావాళ్ళు అటు వెళ్ళగానే మేఘాలు పట్టడం ఏమిటి? మరి కొద్దిసేపట్లో వర్షం వస్తుందా? రాత్రంతా వానకురుస్తూనే ఉంటుందేమో! కొబ్బరిచెట్లమీద, కూరగాయల మొక్కలమీద వాన... వాన... అంతేనా...!

చీపతుమ్మ చెట్లనుండి వాననీళ్ళు జారి పుట్టలమీద పడతాయి. ఉదయం వాన ఆగిపోతుంది. పుట్టకొక్కులు మొలుచుకొస్తాయి. తను వెళ్ళి ఆ పుట్టలన్నీ జాగ్రత్తగా గాలించి వాటిని తెంపుకొస్తుంది.

ఇంత త్వరగా తనకోరిక తీరబోవటం ఎంత అదృష్టమో! చూస్తుండగానే చీకట్లు ముసిరాయి.

లలిత భోంచేసి పడుకొని నిద్రపోయింది. అందరూ ముందుహాల్లోకి చేరారు. గోడకు వాలుగా చెక్కలుకొట్టి వాటిమీద రేకులువేశారు. వానకురుస్తున్నపుడు రేకులమీద అదో రకం సంగీతం. ఒక్కోసారి కరెంట్‌పోతుంది. గదంతా చీకటి.

బుడ్డి వెలిగించినా గాలికి రెపరెపలాడుతుంటుంది. రోడ్లమీద లైట్లుండవు. ఎప్పుడో స్తంభాలు పాతారు. ఇంతవరకూ వాటికి లైట్లు వేయలేదు.

ఆ చీకట్లో వానచినుకులు...

అప్పుడప్పుడు మెరుపులు...

అమ్మదగ్గరో, నాయనమ్మ పక్కనో పడుకొని చూస్తుంటే ఎంతహాయిగా ఉంటుందో...

అక్కకు మెరుపులన్నా ఉరుములన్నా భయం.

చెవిలో దూది పెట్టుకుంటుంది.

మెల్లగా మంచాలుచేర్చి, దుప్పట్లు పరుస్తున్నప్పుడు మొదలైంది శబ్దం... చినుకులు ఒక్కసారిగా విరుచుకుపడ్డాయి- తర్వాత కొద్ది సేపు నిశ్శబ్దం... తర్వాత విరామంలేదు. జోరుగా వర్షం.

జానకి కిటికీ తలుపు తెరిచింది. చల్లగాలి తాకింది. వరిచేల మీద వర్షం... దొరువులో వర్షం... బుగ్గలమీద చేతులు పెనుకొని అలానే చూడాలనిపిస్తోంది.

గుమ్మంకేసి చూసిందెందుకో... గుమ్మం తలుపులు తెరిచింది అత్త... గుమ్మానికి ఆనుకొని బయట కురుస్తున్న వర్షాన్ని చూస్తోంది. బయట తారురోడ్డు మీద వానచినుకులు ముత్యాల్లా రాలుతున్నాయి.

ఎందుకో అత్త నిలబడ్డ తీరు జానక్కి నచ్చలేదు. ఆమెను అలా చూడటం ఎంతమాత్రం ఆహ్లాదకరంగాలేదు. ఎక్కడో ఓ మెరుపు... దాంతోపాటు ఉరుము.

ఆ చీకటిలో... ఆ వానలో.

ఏ పలుకూలేకుండా ఆమె నిలబడింది.

ఏంచూస్తోంది? ఏంఆలోచిస్తోంది?

ఆమెకు రేపటిమీద భయం కలుగుతుందా?

భయం కలుగుతుందా?

అప్పటిదాకా భయానికి చెందిన అనుభూతులు జానకిలో అరుదు. ఆ లేత మనసులో... ఆ క్షణం...

ఒక్కసారిగా పెద్దమెరుపు...

ఆకాశం, భూమి ఏకమయ్యాయా అనేంత భయంకర శబ్దం...

జానకి కళ్ళు చెదిరిపోయాయి.

నిప్పురవ్వలు కురుస్తున్న అనుభూతి.

"అదిగో... అదేనే పిడుగంటే" ఏడుపులాంటి కంఠస్వరంతో చెబుతోంది అత్త.

వాన కురుస్తూనే ఉంది.

చాలాసేపు మాట్లాడలేదు జానకి.

చీకట్లో అత్త ఓ అనాథలా... ఓ పీడకలలా... భయంకరమైన రోగిలా కనబడుతోంది.

"ఆ పిడుగు మామీదేపడితే బాగుండేది" గొణుగుతోందామె.

"ఏమిటే ఆ మాటలు" అంది కోపంగా నాయనమ్మ.

"ఇంకచాలుగాని తలుపు మూసి పడుకోండి" అంది అంతలోనే. జీవితంలో అప్పటివరకూ ఒంటరిగా, స్వేచ్ఛగా పడుకున్న జానకి మొదటిసారిగా నాయనమ్మను కరుచుకొని




వడుకొంది...

జానకిని ప్రేమగా హత్తుకుంటూ అనుకుందామె.

"పిచ్చితల్లీ... భయం లేదమ్మా. మీ అత్తను చూసి భయపడకు. నువ్వు అదృష్టవంతురాలివి. అందరి జీవితాలూ అలా ఉండవ్"

★ ★ ★

వానంటే అభిమానం, వానంటే అనుభూతి చచ్చిపోయిందారోజే.

ఉదయంలేచి చూస్తే రాత్రి కురిసిన వానకు మొక్కలు తెగిపడి ఉన్నాయి. తోటంతా బీభత్సంగా ఉంది.

చేవతుమ్మ చెట్టుకేసి చూసింది. అక్కడ పుట్టలమీద పుట్టకొక్కులు మొలిచే ఉంటాయి. ఎందుకో వెళ్ళాలనిపించటంలేదు.

ఆ పొదల మాటున ఏ కాలనాగో పొంచి ఉంటుంది.

రాత్రంతా కురిసిన వానకు కోపంతో బుసలు కొడుతూ ఉంటుంది.

ఇప్పుడు తను అటువెళ్తే...

ఇంతెత్తున లేచి కాటందుకుంటే...

వద్దు.. తనటు వెళ్ళదు.

తను బతకాలి... చాలా సంవత్సరాలు...

వంద సంవత్సరాలు...

జానకి అలానే నిలబడిపోయింది చాలా సేపు.

★ ★ ★

## 2

"నాకేమైనా ఉత్తరాలొచ్చాయా?"

ఉలిక్కిపడింది జానకి.

ఎప్పుడు వచ్చాడో చొక్కా హేంగర్‌కి తగిలిస్తూ అంటున్నాడు మధు.

ఒక్కసారిగా కోపం ముంచుకొచ్చింది.

"ఏమిటో ఈ మనిషి ఎప్పుడూ ఇంతే. తనకోసం ఎంత ఆరాటంతో ఎదురు చూస్తున్నామో చస్తే గమనించడు. రాగానే లెటర్స్ వచ్చాయా అంట... ఇప్పటివరకూ దేశం మీదేగా తిరిగి రావటం. ఇక్కడకు రాగానే మళ్ళీ మొదలు"

"ఏమిటి మాట్లాడవే"

"ఏమీ రాలేదు"

"చిన్నాని ఆఫీస్‌కి పంపించావా?"

ఓ రోజు వెళ్ళాడు. ఏమీ రాలేదని తిరిగొచ్చాడు. ఏమైనావస్తే మేమే తెచ్చి ఇస్తాం అని చెప్పారంట" వినుగును కప్పిపుచ్చుకుంటూ చెప్పింది.

"ఎందుకు రాలేదు... ఒక్క ఉత్తరం కూడా రాలేదా... సర్లే ఏమిటి విశేషాలు?"

"అమ్మయ్య ఇప్పటికి మేం గుర్తొచ్చావన్న మాట"

"అదేంట్రా అలా మాట్లాడతావు. పిల్లలు బడికి వెళ్ళారా. రాత్రే రావాలనుకున్నాను. అంత త్వరగా పనులు అయిచస్తేగా... అయినా తమరు మాకోసం ఆలోచిస్తుంటారని నాకు తెలుసు. ఏం చేస్తాం. ముందు వెళ్ళిన పని పూర్తికావాలి కదా. ముందు స్నానంచేసి వస్తాను. ఈ లోగా తమరు వడ్డిస్తే ఆఫీస్‌కు వెళ్తాం" అన్నాడు మధు.

"రాత్రంతా నిద్రలేదండి. చేతులు తిమ్మిర్లెక్కుతున్నాయి. ఓ పక్కకు పడుకుందామన్నా కుదరటంలేదు" అంది జానకి.

"చూడు జానకీ. నీకు చాలాసార్లు చెప్పాను. నాకు చెబుతున్న ఈ విషయాలు డాక్టర్ దగ్గర చెబితే దానికి మందులిస్తారు. నువ్వేమో డాక్టర్ దగ్గరకు రావు. మందులు వాడటం నీకసలు ఇష్టం ఉండదు. మందులు వాడకపోతే అసలు రోగాలెలా తగ్గుతాయి? నువ్వు కేవలం సానుభూతి కోసమే నాకీ విషయాలు చెబుతుంటే ఐయామ్‌సారీ. నేను అయ్యో పాపం అనలేను. నువ్వే కాదు ఎవరికి ఒంట్లో బాగుండకపోయినా ఒకటే మార్గం. డాక్టర్ దగ్గరకు వెళ్ళటమే. సో... నీకంతగా బాగుండకపోతే, నిద్రపట్టకపోతే ఎవరో ఒకర్ని తీసుకొని డాక్టర్ దగ్గరకు వెళ్ళు. రెండుమూడు వందలు ఖర్చయినా బాధలేదు సరేనా?" అని టవల్ అందుకుని వెళ్ళిపోయాడు.

చివుక్కుమంది జానకి మనసు.

"ఇంతే ఈ మనిషింతే. ఏ విషయంలోనూ సీరియస్‌నెస్ ఉండదు. ఏం,తనే స్వయంగా హాస్పిటల్‌కు తీసుకువెళ్ళవచ్చుగదా. తనకు కావలసినవన్నీ అమర్చటంలా... ఆఖరకు స్నానికి ఓ బకెట్ నీళ్ళు పట్టుకోవటానికి బద్ధకం. రోగం గురించి చెబితే చాలు. ఇంతెత్తున ఎగురుతాడు. డాక్టర్ దగ్గరికి వెళ్ళాలంట... డాక్టర్ దగ్గరికి" అనుకొంది కోపంగా.

అంతలోనే అనిపించింది.

ఆయనన్నట్లు తనేమైనా సానుభూతితో కూడిన మాటలకోసం ఎదురుచూస్తోందా?

తమ బంధువుల్లో కొందరున్నారు. వారిని ఎప్పుడు కదిలించినా ఒకటే విషయం. వాళ్ళ పర్సుల్లో, హాండ్ బ్యాగ్‌ల్లో అమృతాంజనం సీసా ఉంటుంది. అది నుదుటికి రాసుకుంటూ అనారోగ్యం గురించి, తమ కొస్తున్న ఆయాసం గురించి వివరిస్తుంటే ఒక్కోసారి విసుగు కలుగుతుంది కూడా. తను కూడా అలా విసిగిస్తోందా?

"ఇప్పటికి తమ పెళ్ళి జరిగి పదిహేను సంవత్సరాలు కావస్తూంది. ఇంతవరకు వెనక్కి తిరిగి చూసుకుంటే ఒక్క వారంరోజులు మాత్రం టైఫాయిడ్‌తో మంచం మీద ఉండిపోయింది. అప్పుడు కూడా ఓపిక తెచ్చుకొని అన్నిపనులూ చేసింది- వద్దని పిల్లలూ, ఆయనా వారించినాకూడా. అంతకుమించి తనకెప్పుడూ చెప్పుకోదగ్గ రోగాలు రాలేదు. కనీసం తలనొప్పిలాంటివి కూడా అరుదు. ఆయనకేమైనా వస్తే ఇంట్లో ఎవరినీ బతకనివ్వడు. కాళ్ళనొప్పులొచ్చినా తన్తోపాటు పిల్లలందరూ పక్కన కూర్చోవాలి. మందు బిళ్ళలూ, ఇంజెక్షన్లూ ఒకటేమిటి... మనిషికి ఎంత కంగారో... ముందు ఆకలికి ఉండలేరు. ఓసారి వారం రోజుల పాటు ఫ్లూ జ్వరం వస్తే - ఏమీ పెట్టలేదు. ఒళ్ళన్నీ నెప్పులు పుడుతున్నాయంటూ ఎంత గొడవ. జ్వరం వంద దాటితే చాలు. పక్కనుండి కదలటానికి లేదు. అలాంటి పెద్ద మనిషి రాత్రిపూట నిద్రపట్టడం లేదయ్యా అంటే ఎందుకు పట్టడంలేదని కనీసం సానుభూతిగా కూడా మాట్లాడడు. ఏమిటో రోగాల విషయంలో ఎప్పుడూ ఇలానే ప్రవర్తిస్తారు" అనుకొంది జానకి.

స్నానంచేసి వచ్చి బట్టలు వేసుకున్నాడు. టేబుల్ ముందు కూర్చుంటూ - "కానీండి మేడమ్" అన్నాడు.

భోజనం చేస్తున్నంతసేపూ ఊరికి వెళ్ళివచ్చిన విశేషాలు చెప్పసాగాడు. వింటుండిపో




యింది జానకి.

"సర్లే... నేను వస్తాను" అన్నాడు బయలుదేరుతూ.

"సాయంకాలం త్వరగా రండి"

"ఈరోజు కుదరదేమో జానకీ"

"ఏం... ఈ రోజు కూడా కూర్చుంటున్నారా?"

"ఛఛ... అదేంలేదు. నాలుగురోజులనుండి ఊళ్ళో లేంకదా. మిత్రులంతా ఎదురుచూస్తుంటారు. వారిని పలకరించిరావాలని–అంతే"

జానకి మాట్లాడలేదు.

మధుకు ఈ ఊరు రాకముందు పేకల గురించి తెలియదు. జానకి ఇంతకుముందు పేక నేర్చుకోమని పోరింది-ఇంట్లో ఏమీ తోచనప్పుడు ఆడుకుందామని. తను ఓ మోస్తరుగా ఆడుతుంది. అప్పట్లో మధు ఎందుకో ఆ విషయంలో ఉత్సాహం చూపించలేదు.

ఇప్పుడు ఆడితే తనే ఓడిపోతూంది. అంతే కాదు ఆఫీస్‌లో పనిచేసేవారంతా ఆఫీస్‌కాగానే ఈ కార్యక్రమంలో కూర్చుంటారుట! ఒక్కోసారి రాత్రంతా అలా ఆడుతూనే ఉంటారు.

"నాలుగురోజలనుండి ఊర్లోలేరు కాబట్టి ఈరోజు ఖచ్చితంగా కూర్చుంటారు. అందుకే త్వరగా రానని చెప్పటం" అనుకొంది జానకి.

ఆమె అంచనా పొరపాటు.

వెళ్ళిన అరగంటకల్లా వచ్చేశాడు మధు.

అతని మొఖంలో ఆందోళన... అయినా ప్రశాంతంగా ఉండటానికే ప్రయత్నంచేస్తున్నాడు.

"ఏమిటీ అప్పుడే వచ్చేశారు?" అంది జానకి.

"మనం వెంటనే బయలుదేరాలి. పెదనాన్నను హాస్పటల్లో చేర్పించారట" మామూలుగా చెప్పటానికి తీవ్ర ప్రయత్నంచేశాడు.

"ఏమైంది... ఎందుకు?" కంగారుపడింది జానకి.

మధు పెదనాన్న కూతుర్ని జానకి అన్నకే ఇచ్చారు.

"పూర్తి వివరాలు తెలియవు. నాతోపాటు నువ్వుకూడా బయలుదేరు– పిల్లల విషయం ఏంచేద్దాం?"

"మనం ఎన్నిరోజులు ఉండాల్సి ఉంటుంది?"

"ఏమో రేపే రావచ్చు ... లేదా నాలుగురోజులుండవచ్చు"

"నేను మామ్మగార్కి చెప్పి వస్తాను. పిల్లలు వండుకుతింటారు. అంతగా అయితే కూరల వరకూ ఆవిణ్ని ఇవ్వమని చెబుతాను"

"సర్లే" అన్నాడు మధు.

జానకి కంగారుగా పక్కింటికి వెళ్ళింది.




బస్ వేగంగా పరుగులుతీస్తోంది.

కిటికీ పక్కన కూర్చుంది జానకి. ఆమె భుజానికి తల ఆనించి నిద్రపోతున్నాడు మధు.

అదృష్టవంతుడు!

ప్రతి చిన్నవిషయానికి ఎంత ఆందోళన చెందుతాడో. ఎంత బీభత్సం చేస్తాడో. క్షణాల్లో మరిచిపోతాడు. రాత్రిపూటా అంతే. పక్కమీద పడుకున్న మరుక్షణం హాయిగా నిద్రపోతాడు- ఒక్కోసారి మాటలు వింటూనే.

కానీ ప్రతి చిన్న సంఘటనకూ వెంటనే చలించిపోతాడు. అయితే వాటిగురించి అంత సీరియస్‌గా ఆలోచించడు. సరిగ్గా రెండు సంవత్సరాల క్రితం ఇలానే ఆఫీస్‌నుండి హడావిడిగా వచ్చి, సైకిల్ లోపల పెట్టి స్టాండ్‌వేశాడు. ఆ మొఖం చూసి తను అడిగింది- "ఏమిటండీ" అంటూ.

"రాజా ఫోన్ చేశాడు. బావను హాస్పిటల్లో చేర్పించారంట. బతకడంటున్నారు" కంఠంలో స్పష్టంగా ఏడుపు.

"నేను వెళ్తున్నా... బట్టలు సర్దుకొని పిల్లల్తో వచ్చెయ్" అనేసి వెళ్ళిపోయాడు.

తనకేం- తను వెళ్ళిపోయాడు. తనెంత ఆందోళన చెందిందో... ఆ బాధ తట్టుకోలేక ఎక్కడైనా పడిపోతే... అయినా అంత నిబ్బరంగా కనిపించే మనిషి అంత ఇదయిపోతాడేమిటి?

ఒకటిమాత్రం నిజం. మధు ఇంట్లో చాలా కాలం తర్వాత భయాన్ని బాధను కలిగించిన సంఘటన అది.

గుంటూరులో ఓ ప్రైవేట్ హాస్పటల్లో చేర్పించారు.

తాము వెళ్ళేటప్పటికే 'కోమా'లోకి జారిపోయాడాయన.

అంతకుముందు చాలారోజులనుండి ఉద్యోగం మానేసి తన వ్యాపారంలోకి వచ్చేయమంటున్నాడాయన.

ఆయనదో చిత్రమైన జీవితం...

ఇరవైసంవత్సరాలక్రితం ఆయన ఓ అద్భుతమైన వ్యక్తి.

కనీసం చీదిఎరగడు. సిగరెట్ సైతం తాగడు.

అలాంటిమనిషి వ్యాపారంలోకి దిగాడు.

ఈ ఇరవైసంవత్సరాల్లోనూ ఓ పాతిక లక్షలు సంపాదించాడు...

ఈ ఇరవైసంవత్సరాల్లోనూ ఓ పాతిక సంవత్సరాల జీవితాన్ని కోల్పోయాడు...

ఆక్సిజన్ సిలెండర్నుండి గాలిని పీల్చుకుంటున్న ఆ శరీరం నాలుగురోజులపాటు అలానే ఉంది. ఎప్పటికప్పుడు స్పృహ వస్తుందని అందరూ చూసేవారు. లక్షలాది రూపాయల ఆస్తిని ఎవరికీ రాయలేదు.

కోమానుండి బయటపడితే కనీసం స్పృహ వస్తే ఏంమాట్లాడేవాడో... ఇంటెన్సివ్ కేర్నుండి ఓ వార్త. మరో అరగంటలో స్పృహలోకి రాబోతున్నాడని... అంతలోనే మరోవార్త... అయిపోయాడని...!

ఇలాంటి అంచనాల నడుమ అయిదోరోజు ఆయన ఈ ప్రపంచాన్ని వదిలివెళ్ళిపోయాడు.





మధు భోరున ఏడ్చాడు. జీవితంలో చాలారోజుల తర్వాత ఆయన్ని చూస్తుంటే తనకీ ఏడుపొచ్చింది. అక్కడినుండి తిరిగివచ్చేటప్పుడు స్పష్టంగా చెప్పింది తను.

"ఇంకెప్పుడూ అలాంటివార్తల్ని అంత హడావుడిగా చెప్పకండి. మీరేమో ఏడుస్తూ వెళ్ళిపోయారు. మీరువెళ్ళాక నాకాళ్ళూ, చేతులూ ఆడితేనా... ఈసారి ఇట్లా చెబితే ముందు నా గుండె ఆగటం ఖాయం"

అందుకే కాబోలు ఈసారి కొంచెం తమాయించుకున్నారు. అయినా ఎంత ఆందోళన చెందుతారో అంత నిబ్బరంగా ఉంటారు. మరి తనే ఎందుకింతగా బేల అయిపోతూంది. తనకే ఇలాంటి ఆలోచనలు వస్తున్నాయా? ఎందుకు తనలో ఇన్ని భయాలు? తన భయాలన్నీ ఎవరికైనా చెప్పుకుంటే బాగుంటుంది. ఎవరికి చెప్పుకోవాలి?

ఆయన వినడు. ఒక్కముక్కలో కొట్టేస్తాడు. లేకపోతే ఏవేవో జోకులు వేస్తాడు. మరి ఎవరికి చెప్పుకోవాలి? ఎవరికో ఒకరికి.

ఆ వ్యక్తి బాగా తెలివి కలిగివుండాలి. తన భయాలన్నింటికీ కారణాలు చెప్పగలగాలి. అప్పుడుగాని తను ఈ భయంనుండి బయటపడదు.

ఆలోచనల్లోనే బస్ గమ్యం చేరింది. రిక్షా ఎక్కి ఇద్దరూ హాస్పిటల్దగ్గర దిగారు. లోపలకు వెళ్తున్నప్పుడు అన్నాడు మధు.

"జానకీ.. రెండుసంవత్సరాలక్రితం ఇదే ఆసుపత్రికి మనం వచ్చాం. అయిదు రోజులు బావ చిత్రవధ అనుభవించాడు"

"ఎందుకవన్నీ ఇప్పుడు గుర్తుచేయటం" అంది జానకి.

తనకు అప్పటికే ఆ మెట్లు ఎక్కుతుంటే ఆనాటి సంఘటనలు గుర్తొస్తున్నాయి.

"ఏంలేదు... ఆ జ్ఞాపకాలు మనసులోకి వచ్చాయి" అనేసి ఎవరినో అడిగి వచ్చాడు.

"మొదటి అంతస్థులోనే ఉన్నారు"

జానకి మధు వెనక నడుస్తున్నా ఎలాంటి దృశ్యం చూడాల్సివస్తుందోననే భయం పీడిస్తూనే ఉంది.

ఇదే హాస్పిటల్లో... మరలా అదే సంఘటన పునరావృతంకాదుకదా... మామయ్య కూడా

మృత్యువు కబంధహస్తాల్లో నలిగిపోదుకదా!

మధు తలుపుతట్టాడు.

ఎవరో వస్తున్న చప్పుడు...

జానకి అప్పటికి శేఖర్‌వెనక్కి చేరింది.

తలుపు తెరుచుకొంది.

ఎదురుగా పెద్దమ్మనుచూసి నవ్వు మొఖంమీదకు తెచ్చుకున్నాడు మధు.

"రండి" అంది.

ఆమె కంఠస్వరంలో ఎలాంటిభావం ధ్వనించలేదు.

జానకి మెల్లగా లోపలకు అడుగుపెట్టింది. మంచంమీద పడుకున్న మామయ్య జానకికేసే చూస్తున్నాడు నిశ్శబ్దంగా!

* * *

మధుకు రంగారావు పెదనాన్న. అమ్మతరపు చుట్టరికం అది.

మధు అమ్మమ్మ, జానకి నాయనమ్మ అక్కచెల్లెళ్ళు. ఆ రకంగా వారిద్దరిది వేలువిడిచిన మేనరికం.

రంగారావుగారిది పెద్దకుటుంబం. ఆయనకు నలుగురు కూతుర్లు. అందరికీ పెళ్ళిళ్ళు చేసి పంపించాడు. నలుగురు కొడుకులు కూడా ఉన్నారు. అందులో ఒకతనికి మాత్రం పెళ్ళయింది. అతను ఓ గుమస్తాగా పనిచేస్తున్నాడు. తమ గ్రామానికి దగ్గర్లోనే ఉద్యోగం కావటంతో రోజూ బస్‌మీద వెళ్ళి వస్తుంటాడు.

రెండోవాడు, మూడోవాడు ఇంకా చదువుతున్నారు. నాలుగో పిల్లవాడికి చిన్నతనంలోనే 'పోలియో' రావటంవల్ల ఓ కాలు సన్నగా ఉంటుంది. తనూ చదువుతున్నాడు. ఆ ఊర్లో వారికి పెద్దఇల్లు ఉంది. వాళ్ళకు ఎంత పొలం ఉందో మధుకిగాని, జానకికిగాని తెలియదు. మొత్తంమీద వారికి ఎలాంటి ఇబ్బందులు లేవనే భావించేవారు.

"ఏంజబ్బో తెలియటంలేదురా. నీకు తెలుసుగా. అప్పటినుండి ఇదే పరిస్థితి. ఏంతిన్నా అరగదు. ఎప్పుడూ ఏదో ఆలోచిస్తుంటారు. డాక్టర్లు ఇంతవరకూ ఏ జబ్బో చెప్పలేకపోతున్నారు. మన డాక్టర్‌గారి సలహామీద "షాక్" ఇప్పిస్తే బాగుంటుందని తీసుకొచ్చాం" చెబుతోంది పెద్దమ్మ మధుకి.

వింటున్న జానకి ఉలిక్కిపడింది.

షాక్... షాక్... ఎలక్ట్రిక్ షాక్... ఎంతసేపు ఇస్తారు? అసలు షాక్‌ను శరీరమే భరించలేదు కదా... మెదడు ఎలా భరించగలుగుతుంది? ఎన్నిసార్లు ఇవ్వాలి? షాక్ మానసికరోగికి కదా ఇవ్వాలి? మరి మావయ్యకూడా మానసికరోగేనా?

మరి తనూ ప్రతినిముషం ఆలోచిస్తోంది కదా! తనకూ ఇలాంటి వ్యాధులేమైనా రాబోతున్నాయా? వస్తే ఇంకేమైనా ఉందా? వేలాది రూపాయలు ఆయన ఎక్కడనుండి తెస్తారు?

అంటే తిరిగి రోడ్డుమీదకు రాక తప్పదా? ఈ అప్పుల్తో తిరిగి పిల్లల భవిష్యత్ ఏమిటి? వాళ్ళు చదువులు మానేస్తారు. ఏ షాపులోనో చేరతారు. వారు సంపాదించే డబ్బంతా తన కోసమే ఖర్చుపెడతారనుకుంటా... అయినా ఖర్చుపెడతారా? పిచ్చిదే కదాని ఏ హాస్పిటల్ కయినా తోల్తారేమో!

పిచ్చిదంటే గుర్తొస్తోంది. ఆయన ఓసారి ఓ పిచ్చి అమ్మాయిని చూపించారు. ఎంత అందంగా ఉందో.... వంటిమీద సరిగ్గా బట్టలు లేవు. తన చిన్నప్పుడు ఇంకో పిచ్చిది తెలుసు. ఒక్కోసారి పిల్లల చేతుల్లో నుండి లాక్కుని వెళ్తుండేది తినే వస్తువుల్ని. ఎటునుండి వస్తుందో అని భయపడుతుండేవారు.

ఎవరుకన్నారో తెలియదు. వీళ్ళిద్దరూ బాగానే చదువుకున్నారంట. ఎవరు మోసం చేశారో... తాము అనుకున్నది జరగలేదనో అలా అయిపోయారు. కొంతకాలం చూసి కన్నవారు దేశం మీదికి వదిలేశారు. తనూ అంతేనా? ఛీ... ఇలాంటి ఆలోచనలు వస్తున్నాయేమిటి? ఈ నడుమే తనలో మార్పు వచ్చింది. ప్రతి నిముషమూ ఆలోచనల్లోకి జారిపోతోంది. అందుకు కారణం ఆ సంఘటనేనా?

అదేనా?

అది జరిగింది వాస్తవమే. అయితే మాత్రం తనెందుకు అంత కంగారు పడుతుండాలి. లోకంలో ఎన్ని సంఘటనలు జరగటంలేదు. అవన్నీ తనకు అన్వయించుకుంటే ఎట్లా? అన్వయించుకోకుండా ఎలా? సరిగ్గా అలానే జరుగుతుందేమో? జరిగితే ఏంచెయ్యాలి?

ఏం చెయ్యాలి?

"అమ్మాయి" పిలిచాడు.

"ఏంటి మామయ్యా" అంటూ దగ్గరకు వెళ్ళింది జానకి. జానకి రెండుచేతులు పట్టుకొని, తల ఆనించి భోరున ఏడుస్తున్నాడాయన.

"మామయ్యా... ఊరుకో" అనునయించబోయింది. ఆయన అలా ఏడుస్తూనే ఉన్నాడు.

కళ్ళలో నీళ్ళు తిరుగుతుండగా గమనిస్తున్నాడు మధు. "...అదిరా పరిస్థితి. తెలిసినవారు కనబడితేచాలు. ఇలానే కళ్ళనీళ్ళు పెట్టుకుంటారు. అంతేకాదు. ఇంకా చాలాచాలా మాటలంటున్నారు. ఏం చేస్తాం... అది ఆయన రోగమయిపోయింది- భరిస్తున్నాను" అంది పెద్దమ్మ.

పెద్దమ్మ అంటే మధుకు ఎంతో గౌరవం ఉంది. ఆమె జీవితంలో అత్యంత సంక్షోభం వర్షించిన సంఘటనలెన్నో ఉన్నాయి. తనకు ఊహ వచ్చిన నాటి నుండి ఆమె ఏ విషయానికీ తీవ్రంగా కదిలిపోవటం తాను గమనించనేలేదు.

తను ఇంకా పుట్టకముందు...

ఆడుకుంటున్న తమ బిడ్డ మీద ఓ పెళ్ళివారి బండి వెళ్ళి అతను మరణించినప్పుడు గానీ... తన రెండో అమ్మాయి ఓ రకమైన ఉన్మాదంతో బాధపడుతున్నప్పుడు గానీ... తన కళ్ళముందే తన మనవరాలు చనిపోయినప్పుడు గానీ... తన రెండో అమ్మాయి ఇద్దరు పిల్లల్ని వదిలి తాను చచ్చిపోయినప్పుడూ... చిన్న కొడుకు కాలు పోలియోవల్ల సన్నబడినప్పుడూ... ఆమె గంభీరంగానే ఉంది.

అన్నింటినీ ఆమె గుండెల్లో దాచుకొంది. ఏ సందర్భంలో ఆమె గుండెలు పగిలేలా ఏడ్చినా... అవే గుర్తు చేసుకుంటూ స్తబ్దతలోకి నెట్టబడినా ఆ కుటుంబం పరిస్థితి మరోరకంగా ఉండేది.

పెద్దమ్మ ఆ కుటుంబానికి వెలకట్టలేని సంపద. ఈరోజు పెదనాన్నను ఈ పరిస్థితుల్లో చూస్తూ కూడా అదే గంభీరత్వాన్ని ప్రదర్శిస్తోంది. ఎంత అద్భుతమైన విషయం!

మధుకు పెదనాన్నతో అనుభవం భిన్నంగా ఉంది. రంగారావు గురించి చాలా కథలు చెబుతారు. చిన్నప్పుడు ఆయనకు గుర్రపు బండి ఉండేదట. గుర్రపుస్వారీ అంటే ఆయనకు చాలా ఇష్టం. ఆయన పేరు ఏమైనా ఊర్లో అందరూ "చిన్నబ్బాయి" అంటారు.

ఈనాటికీ ఆ ఊర్లోని పాతతరంవారు చిన్నబ్బాయిగారు గుర్రాన్ని ఎలా తోలుతారో... ఆ బండిని ఎంత అందంగా ఉంచేవారో వర్ణించి చెబుతారు. సాయంకాలం పూట ఆ బండి మీద మైళ్ళకొలదీ ప్రయాణం చేస్తుండేవాడాయన. ఆ సరదాలన్నీ తన ఊహతెలిసేనాటికే జ్ఞాపకాలుగా మిగిలిపోయాయి.

ఒక్కో ఆడపిల్ల పెళ్ళిచేస్తూ వచ్చేసరికి సమాజంలో చాలా మార్పులొచ్చాయి. ఆ ఇంట్లో ఓ సమాజమే ఉన్నట్లుండేది. ముగ్గురు అమ్మాయిలకు పుట్టినవారంతా పెద్దమ్మ దగ్గర ఉండటంతో ఎప్పుడూ పిల్లల్తో, పనివారితో సందడిగా ఉండేది. మధు ఎప్పుడన్నా శెలవులకు అక్కడకు వెళ్తుండేవాడు. ముందుగా అక్కడే కనిపించే దృశ్యం పెద్ద గిన్నెలో అన్నం.... మరో పెద్ద గిన్నెలో చారు.... ఇంకో పెద్ద కుండలో మజ్జిగ.

ఎవరికి ఆకలివేస్తే వారు పెట్టుకు తినటం. అందరికీ ఆయన్ని చూస్తే భయం. మధు ఓ వారంరోజులు అక్కడ ఉంటే, ఆ వారం రోజుల్లోనూ గంభీరంగా అటూ, ఇటూ తిరిగే పెదనాన్న ఇప్పటికీ గుర్తే. వెళ్ళిన మొదటి రోజున మాత్రం 'ఎప్పుడొచ్చావురా' అనేవాడు. ఆ తర్వాత 'బాగా చదువుతున్నావా?' అని మాత్రం అడిగేవాడు. ఆ తర్వాత ఇంక మాట్లాడేవాడుకాదు.

ఆయన లుంగీ బాగా పైకి కట్టుకునేవారు. బీడి ఇచ్చి వెలిగించుకు రమ్మని చెప్పేవారు.

అప్పుడుకూడా ఏవో మందులు వాడినట్లు గుర్తు. ఆ ఇంట్లో సంప్రదాయం మధుకు భలే చిత్రంగా ఉండేది.

మొదటి ఇద్దరి గురించి తనకు తెలియదు. మూడో అమ్మాయి నుండి తెలును. మొత్తం ఇంటితాళాలు అక్కదగ్గరుండేవి. పిల్లలంతా ఆమె చుట్టూ తిరుగుతుండేవారు. ఇంట్లో వంటుగలకి ఏమైనా వండితే వాటిని 'అల్మారా'లో దాచి తాళం వేస్తుండేవారు.




**అక్కలతకు**

అబ్బా, ఎన్నాళ్ళకీ అవకాశం వచ్చింది. ఈ రోజు పూర్ణమి. వెన్నెల ఎంతబా గుంది. నీకీలేఖ వ్రాయడానికి ఎన్నాళ్ళనుంచో ప్రయత్నం. వారానికి ఏవో కొన్ని గంటలు ఆటవిడుపు. ఆ కొద్దికాలం ఏదో కాలక్షేపం. ఆనందం, సరదా అంటే ఏమిటో ఎప్పుడో మర్చిపోయాం. ఎప్పుడూ ఏదో ఒకటి కంఠతాపట్టడం, వ్రాయటం, లేకపోతే తిట్లు, జరిమానాలు, బెదిరింపులు, అమ్మానాన్న ఏమనుకుంటారోనని భయం. ప్రతిక్షణం భయంతో, బరువుతో కాలం గడిచిపోతోంది. ఇదంతా క్రమశిక్షణ అనే పేరుతో చలామణి అవుతోంది. వ్యక్తి వికాసానికిగాని, సృజనాత్మకతను పెంపు చేసేదిగాని, మాశక్తి సామర్థ్యాలను పెంపొందించేదికాదు. **M.P., Bi.P** గ్రూపులని, ప్రతివారు ఇంజినీరో, డాక్టరో కావాలనే పగటికల వల్ల కొని తెచ్చుకున్న బాధ. ఇంజినీర్లు, డాక్టర్లు గాక వేరుగా బ్రతకలేమా? నాకనిపిస్తోంది, డాక్టర్లు, ఇంజినీర్లు, పోలీసులు లేని ప్రపంచం ఎంత అందంగా, ఆరోగ్యంగా, ఆనందంగా ఉంటుందో ఒకసారి ఊహించుకో.

తెలవారుతోందంటే భయం. మాస్టారొస్తారు, ఏవో బోర్డు మీద వ్రాస్తుంటారు. ఏ సబ్జెక్టులో ఎందుకవసరమో, ఎందుకుపయోగపడుతుందో నిజజీవితంలో దాని అవస రమేమిటో, చెప్పేవారికిగాని, వినేవారికిగాని తెలియదు. ఎవరూ, ఎవరిని అడిగే ప్రశ్న లేదు. ఇదీ మాకు నేర్పుతున్న శాస్త్ర విజ్ఞానం. యవ్వనంలో రెండేండ్ల ఈరకమైన జైళ్ళలో గడిపిన తరువాత మా మనస్తత్వం ఎలా మారుతుందో, మేము ఏ పోటీలో నెగ్గుతామో ఊహించండి. అందుకే చదువంటే విరక్తి, విసుగు ఏర్పడుతున్నాయి. మొన్న సెలవులకు మన ఊరొచ్చినప్పుడు శరత్ కలిసాడు. వాడెంత ఉత్సాహంగా ఉన్నాడో గమనించారుగా, ఏవేవో కోర్సుల గురించి చెప్తుంటే ఆశ్చర్యం వేసింది. వాడి విద్యాలయానికి, మా దానికి ఎంత తేడా ఉందో గమనించగలను. వాడిలాగా నేనూ గుంటూరు బ్రాడీపేటలో గల రవికళాశాలలో చేరివుంటే ఎంత బాగుండేది? విద్యాలయాలు అందరూ నడపవచ్చుగాని, నడిపే వ్యక్తి యొక్క లక్ష్యాలు, ఆశయాలు ముఖ్యం. 34 సంవత్సరాలచరిత్ర గల ఆ కళాశాల సాధించిన విజయాలు వింటుంటే ఎంతో ఆనందం వేసింది. దానిక్కారణం, మనస్తత్వవేత్త అయిన సి.వి.ఎన్. ధన్ డైరక్టరట. అలా ఉండాలి రెసిడెన్షియల్ కాలేజి అంటే అనిపించింది. చాలా పొద్దుపోయింది. అమ్మకు, నాన్నకు నమస్కారములని చెప్పు. సదా నీ ప్రేమానురాగా లు కోరుకునే

నీ తమ్ముడు

సత్యం

అంతేకాదు బడి ఫీజు కట్టాలన్నా పుస్తకాలు కావాలన్నా బట్టలు కావాలన్నా సినిమా చూడాలన్నా ఎవరూ స్వయంగా వెళ్ళి అడగరు–అన్నీ అక్కద్వారానే. ఆయన విని అరుస్తుంటే చాటునుండి వినేవారు. వారందరూ గమనించిన అంశం మరొకటుంది. అక్క చెబితే నాన్న వింటాడు. అందుకే అందరూ అక్కను కాకాపట్టేవారు.

కాకా పట్టినవారిలో నాలుగోది అయిన రాజీ కూడా ఉంది. అక్క పెళ్ళి అయ్యాక రాజీ మేనేజ్‌మెంట్ క్రిందే చాలాకాలం ఆ కుటుంబం నడిచింది.

ఆడపిల్లల్తో తప్పించి మొగపిల్లల్తో ఎక్కువ మాట్లాడేవాడుకాదాయన. ఆడపిల్లల్తోకూడా క్లుప్తంగా మాట్లాడేవాడు. ఆయన ధారాళంగా మాట్లాడుతుంటే చూడాలనిపించేంది మధుకి. ఆఖరుకు అల్లుళ్ళతోకూడా ఆయన గంభీరంగా మాట్లాడుతుండేవాడు.

అలాంటి వ్యక్తిలో ఒక్కసారిగా ఇలాంటి మార్పు! ఇంతవరకు ఎవరూ రోగాన్ని గుర్తించలేకపోతున్నారు.

మధు కొంచెం పెద్దయ్యాక పెదనాన్నను జాగ్రత్తగా గమనించటం ఆరంభించాడు. 'రాజీ' పెళ్ళి విషయంలో ఆయన మొత్తంమీద బాగా ఆందోళన చెందాడు. ముఖ్యంగా రెండో కూతురు మరణం ఆయన్ను కదిలించి ఉంటుంది. చివరివాడికి కాలుపోవటం... దాన్ని బాగుచేయించటానికి పడిన ఇబ్బందులు ఇవన్నీ ఆయనమీద బాగా ప్రభావం చూపించి ఉండాలి. ఓసారి తనను కూర్చోబెట్టుకొని చెప్పారు–

"ఏమోరా ఈ కుటుంబం గురించి తలుచుకుంటే భయంవేస్తుంది. ఏదో ఆడపిల్లలకు పెళ్ళిళ్ళు చేసి పంపించగలిగాను. మొగపిల్లలకు మంచి భవిష్యత్ ఇవ్వలేకపోయాను. వాళ్ళిద్దరూ చదువుతున్నారు. పెద్దాడికి క్లర్క్ ఉద్యోగమైనా వచ్చింది. మరి వీళ్ళకు ఉద్యోగాలొస్తాయా? ఆ చివరివాడి గురించే నా దిగులంతా. వాడికి ఆ లోపం ఉందని గారాబం చేశాం. వాడు చదవటంలేదు. చదువుకున్నవారికే దిక్కులేదు. మరి వాడెలా బతుకుతాడో"

రెండోవాడు ఎం.కాం. చదువుతున్నాడు. మూడోవాడు పాలిటెక్నిక్ చదువుతున్నాడు. చదువు అయిపోగానే ఎక్కడో ఉద్యోగాలు వస్తాయి. పని చేయించుకోగల స్తోమతు ఉంది.

చివరి వాడి విషయం వాస్తవమే. వాడు కొద్దిగా నిర్లక్ష్యాన్ని పెంచుకున్నాడు. అయినా అంత ఆందోళన చెందాల్సిన అవసరం మధుకు కన్పించలేదు.

మధు తనని గురించి ఆలోచించుకున్నాడు. తన ఎనిమిది సంవత్సరాల వయసులో నాన్న చనిపోయాడు. అతికష్టంమీద ఇంటర్‌వరకూ చదవగలిగాడు. తన తమ్ముడికి అదీలేదు. వెనకాల ఏవిధమైన ఆస్తి లేదు. మరి తామేం చెయ్యాలి?

"మీ విషయం వేరురా" అనే వాడాయన.

మధుకు ఆ మాటలకు కోపం వచ్చేది.

లంకంత ఇల్లూ, కొద్దో గొప్పో పొలమూ, ఇతరత్రా ఆదాయం వస్తూ. ఆడ పిల్లల పెళ్ళిళ్ళు చేశాక, అందరూ మొగపిల్లలు ఉన్నాక జీవితం గురించి ఆలోచించే వ్యక్తిపట్ల ఆశ్చర్యంతో కూడిన భావం మెదిలేది. తమకేం లేదు కాబట్టి. తమను లెక్కలోకి తీసుకోనవసరంలేదన్నమాట అనుకునేవాడు. ఏదోమూల బాధనిపించినా తన మనసులో ఓ ఉద్వేగపూరిత భావన.

"నేను డబ్బు సంపాదించాలి. సంపాదిస్తాను. సంపాదించగలనని రుజువు చేస్తాను"

అలాంటి పెదనాన్న... ఎవరితోనూ ఎక్కువగా మాట్లాడని... ఇల్లంతా గంభీరంగా తిరిగే ఆయనే ఈరోజు ఇలా మారిపోయాడు. ఎన్ని మందులు వాడినా ఫలితం లేదు. చివరి ప్రయత్నంగా షాక్స్ ఇప్పిస్తున్నారు. ఇంతటితో ఆయనలో మార్పు వస్తుందా?

ఏమో...!?

పెద్దమ్మ లేచి వెళ్ళింది. "ఎందుకలా బాధ పడతారు. ఊరుకోండి పిల్లల దగ్గర అలా ఉంటే వాళ్ళూ అధైర్య పడతారు" అంది.

మెల్లగా ఆయన జానకి చేతులు వదిలేశాడు.

"లేవండి మొఖం కడుక్కుందురుగానీ" అంటూ మెల్లగా బాత్‌రూంకు నడిపించుకు వెళ్ళింది పెద్దమ్మ.

జానకి మధుకేసి చూసింది. మరికొద్దిసేపట్లోనే కబురు. ట్రీట్‌మెంట్‌కు ఎరేంజ్‌మెంట్స్ పూర్తయ్యాయని.

"థియేటర్ ఫీజ్ నూటఏభై రూపాయలు. స్పెషలిస్ట్ బయటనుండి వస్తాడు. నాలుగు వందలు మాత్రం తీసుకుంటాడు. రోజుకు అయిదారు షాకులిచ్చేసి ఆయన వెళ్ళిపోతాడు" చెబుతున్నాడు మధు.

"ఎంతసేపట్లో అవుతుంది"

"అంతా ఎరేంజ్‌చేస్తే క్షణాల్లో"

"బాధగా ఉండదా?"

"ఎందుకుంటుంది? సంతోషంతో కేరింతలు కొడతారు"

"ఏమిటండీ"

"లేకపోతే ఏంప్రశ్నలవి. పెద్దమ్మ నన్ను తిట్టింది తెల్సా. ఏమిట్రా అది రోజురోజుకు అలా తయారవుతోందని. నిజమే. ఒకప్పుడు డాక్టర్‌కు పది రూపాయలు ఇవ్వటానికి ఇబ్బందివడ్డాం. ఎంతో అవసరం అయితేగానీ డాక్టర్ దగ్గరకు వెళ్ళేవాళ్ళంకాదు. ఇప్పుడు కొంచెం ఫర్వాలేదుగదా. మనకు అప్పులు లేకపోయినా అప్పులు లేవుకదా. మరెందుకని నువ్వు డాక్టర్ దగ్గరకెళ్ళవు? చూడు జానకీ నేను ఈ విషయం పదేపదే చెప్పను. నీకేమైనా సమస్య ఉంటే దయచేసి డాక్టర్‌కు చూపించుకో. కుటుంబంకోసం నువ్వు చాలా కోర్కెలు మనసులో దాచుకున్నావు. నేను అంగీకరిస్తా. ఇంక కుటుంబంకోసం అంత త్యాగం చేయొద్దు"

"ఇక్కడేమిటండీ గొడవ... త్యాగం ఏమిటి?"

"మరి చూసేవారికి ఎలా ఉంది? నేనేమో రోజురోజుకూ లావు అవుతున్నాను. నువ్వేమో సన్నబడుతున్నావు. చూస్తుంటే మా అందరికీ పెట్టి నువ్వు పస్తులున్నట్లు కనపడుతూంది. ఎంతడబ్బయినా ఫర్వాలేదు. అంతగా అయితే మరో నాలుగ్గంటలు కష్టపడతాను. పార్ట్‌టైం ఉద్యోగంచేస్తాను. నువ్వు మందులు వాడు జానకీ"

"నాకేమైందండీ? ఏమిటీ రోజు ఇలా మాట్లాడుతున్నారు?"

"అయితే ఓపనిచెయ్యి. రెండు నెలలలోగా నాఅంత అవ్వాలి. లేకపోతే సాంతం భోజనం మానేసి నేను నీలా తయారవుతాను. మనిషికి బుద్ధుండాలి. అయినా నీకు ఏంతక్కువ చేశాను. దేన్నిగురించి అంత ఆలోచన. నీతల చూసి అందరూ అడిగారు. తలకు నూనెకూడా రాసుకోవు. ఎంతో తీవ్రంగా ఆలోచిస్తుండబట్టి ఆ వేడికి అవన్నీ రాలిపోతున్నాయి... నన్ను అల్లరి చేయాలనేగా... కానీ" అన్నాడు మధు కోపంగా.

జానకి ఇంకేం మాట్లాడదలుచుకోలేదు.

ఆమెకు జీవితం నేర్పిన పాఠం ఒకటుంది.

అకస్మాత్తుగా మధుకు కోపం వస్తుంది. ఆ సమయంలో ఏంమాట్లాడినా తప్పుగా కనిపిస్తుందతనికి. అయిదు నిముషాల తర్వాత మామూలు ప్రపంచంలో పడతాడు.

షాక్ ఇవ్వటం అయ్యాక తీసుకొచ్చి పడుకోబెట్టారు.

మరునటిరోజు బయలుదేరారు.

ఇంతవరకూ సరిగ్గా మాట్లాడలేదు మధు.

ఆయనన్నట్లు డాక్టర్‌కు చూపించుకుంటే బాగుంటుంది. కానీ డాక్టర్‌కు ఏం చెప్పాలి? నాకిలాంటి ఆలోచనలు వస్తున్నాయంటే నవ్వరూ... అయినా తనకు రాత్రిపూట కొద్దిగా కాళ్ళూ, చేతులూ తిమ్మిరెక్కుతున్నాయి. తను బాగానే భోజనం చేస్తోంది. అయినా తను తగ్గిపోతున్నానంటున్నారు. ఇందుకు తనేం చేస్తుంది? మందులు వాడమంటారు. ఆ వాసన అంటేనే తనకు గిట్టదు. హాస్పిటల్‌కు కూడా వెళ్లాలనిపించదు. ఇవన్నీ చెబితే నమ్మరు. అయినా అటుచూస్తూ కూర్చుంటాడేమిటి? మాట్లాడడే" అనుకుంది.

"ఏమండీ" అంటూ పిల్చింది జానకి.

సీరియస్‌గా మొఖంపెట్టి అన్నాడు-

"చూడు జానకీ... నేను సీరియస్‌గా చెబుతున్నాను. నువ్విలా చేయటంవల్ల ఏమవుతుందో తెలుసా? నీరోగం ముదురుతుంది. అప్పుడు ఏ ఆపరేషనో చేయాలంటారు. లేదంటే ఆయనకు పెట్టినట్లు షాక్‌లు పెడతారు. నాదగ్గర అంత ఓపికలేదు తల్లీ... నన్నెందుకు ఇబ్బందులు పెడతావ్... ఆ డాక్టర్‌కు చూపించుకో"

"మీ ధోరణి మీదేగాని ఎదుటివారి మాటవినరు. ఎవరో ఏదో అన్నారని నన్ను ఏదిబడితే అది అంటారా? దేనికయినా అర్థం ఉండాలి. అయినా నాకంతగా రోగంవస్తే రోడ్డుమీదికి ద్యండి. మిమ్మల్నేం నయంచేయమని నేను ప్రాధేయపడటం లేదుకదా" అంది జానకి కోపంగా.

మధు కోపంగాచూసి పక్కకు తిరిగాడు.

ఇద్దరి నడుమా నిశ్శబ్దం.

జానకి కదిలిపోతున్న దృశ్యాల్ని చూస్తోంది.

మావయ్య మాటలు గుర్తొస్తున్నాయి.

ఇప్పుడు నాదేం లేదమ్మాయి. ఇంట్లో పెత్తనం అంతా మీ అత్తదే. నాకు ఏం చేస్తున్నారో చెప్పరు. వాళ్ళే నిర్ణయాలన్నీ చేస్తారు. నేనేం మాట్లాడను. మీఅత్త లేకపోతే నేనేం చేయలేను. ఆమె నాపక్కనుండాలి. ఇప్పుడు నన్నెవరూ లక్ష్యపెట్టడంలేదు. ఎవరిష్టంవారిది. వాళ్ళుచూడు. నాకోసం ఎంతడబ్బులు ఖర్చు పెడుతున్నారో. ఇన్నివేలుపోస్తున్నా నాకేమైనా నయం అవుతుందా... ఛస్తుందా? ఎందుకమ్మా డబ్బులు వృధాచేయటం. నేను కొంచెంలేచి తిరిగితే ఆ హైదరాబాద్ వెళ్ళి మన మినిస్టర్ గార్ని అడిగేవాణ్ని. వాళ్ళకింక ఉద్యోగాలు రావు. నాతోనే ఆ ఇంటికళ పోయింది. ఇంకేం చిన్నబ్బాయిగారిల్లు. ఎవడిదోవ వాడిది. ఇంక ఈ సంసారాన్ని భగవంతుడే రక్షించాలి. చూడమ్మాయ్. నువ్వేం అనుకోకు. అప్పుడప్పుడు నన్ను చూడటానికి మీరు రండి. వాడొచ్చినా, రాకపోయినా నువ్వు తప్పకుండా రావాలి. నీకు తెలియదు ఇప్పుడు మీ అత్తయ్యకూడా మారిపోయింది" కళ్ళనీళ్ళు పెట్టుకుంటూ చెప్పాడు.

అత్తయ్య చెప్పలేదుగానీ అక్కడకు వచ్చిన వారందరూ మాట్లాడుకుంది ఆమె గురించే. ఆమె ఓపిక గురించి ఎంతగానో చెప్పుకున్నారు. ఆయన ఎన్నిమాటలన్నా కసురుకున్నా ఏమీ అనకుండా ఏంకావాలో కనుక్కొని చేస్తుంది. ఒక్కోసారి మందులు వద్దని విసిరి




కొడతాడు. ఫ్యాన్ గాలి ఎక్కువైందనీ, తక్కువైందనీ, కిటికీ తలుపులు మూసున్నాయనీ, తీసున్నాయనీ అరుస్తాడు. పది నిముషాలు బయటకు వెళ్తే "నువ్వు నాదగ్గరుండకుండా వెళ్ళిపోయావు. నాతో ఉండటానికి బాధగా ఉందిలే" అంటాడు.

రాత్రీ, పగలూ ఆయనకేం కావాలో అని మేలుకొని ఉండాలి. కంటినిండా నిద్రపోయి ఎంతకాలమైందో... ఆవిడ కాబట్టి చేస్తోంది. ఈ కాలం పిల్లలయితేనా అని చాలామంది అన్నారు.

అయినా మావయ్యకు తృప్తిలేదు. ఆయనకు తృప్తిలేదనుకునేకంటే ఆయన రోగలక్షణాలనుకోవాలి. లేకపోతే పసిబిడ్డలా చూసుకుంటున్న అత్తను ఇలా అనటం ఏమిటి? మరి ఇలానే ఉంటే రేపు తనూ ఇలా ప్రవర్తిస్తుందా? ప్రవర్తిస్తే ఎవరైనా ఊరుకుంటారా? పిల్లలైనా తనను చూస్తారా?

మామయ్య మగవాడు. పైగా ఆస్తి ఉంది.

తనకేం ఉన్నాయి? పైగా తను స్త్రీ.

ఛీ... ఛీ... ఎంత దారుణమైన ఆలోచనలు...

'ఆయన నాకోసం ప్రాణం ఇస్తారు' అనుకొంది జానకి.

అలాంటి భావం కలగగానే మెల్లగా భుజం మీద వాలిపోయింది. విసురుగా జానకికేసి తిరిగిన మధు ఏమనుకున్నాడో మెల్లగా తన తలను ఆమెకు ఆనించాడు.

బస్సు ప్రయాణం చేస్తూనే ఉంది.

★ ★ ★

"ఏమిటి మిత్రమా ఏదో దిగుల్లో ఉన్నట్లున్నావు. ఎప్పుడూ సరదాగా ఉండేవాడివి" అంటూ పలకరించాడు సారథి.

"చిన్న సమస్య" అన్నాడు మధు.

"మీ ఆఫీస్ కెళ్ళాను. ఈ నడుమ వరసగా శెలవులు పెట్టావంటున్నారు. ఏమిటి విశేషం?"

"ఏంలేదు... అంతకు ముందు వేరే పనుల మీద వెళ్ళాను. మొన్న మా పెదనాన్నను హాస్పిటల్లో చేర్పించి 'షాక్' ఇప్పిస్తుంటే వెళ్ళాను"

"మెంటల్ కేసా ఏమిటి?"

"అదేంకాదు... మొత్తంమీద ఆయనకేం రోగమో డాక్టర్లు తేల్చి చెప్పలేక పోతున్నారు. నాకయితే ఒకటే అనిపిస్తోంది. ఆయన ఒకప్పుడు బాగా బతికాడు. నలుగురితోనూ తన గురించి గొప్పగా చెప్పుకోవాలని ఆయనకుండేది. అప్పట్లో అది నడిచింది. మొత్తం ఎనిమిది మంది పిల్లలు. ఆడపిల్లల పెళ్ళిళ్ళూ, పురుళ్ళూ అయ్యాక చాలా మార్పులొచ్చాయి. ఆయనకంటే ఏంలేనివారు లక్షలు సంపాదించారు. తనకంటే పెద్ద సంసారాలు కృంగిపోయాయి. అప్పుడే 'ఇన్ఫీరియారిటీ కాంప్లెక్స్'కు గురయ్యాడు. సరే ఆయన కుటుంబంలో ఆయనకు బాధ కలిగించే సంఘటనలు ఎన్నో జరిగాయనుకో. ఓ సాయంకాలం ఒంటరిగా కూర్చుని ఆలోచిస్తూ ఒక్కసారిగా ఎందుకో భయపడిపోయాడంట. అప్పటినుండి కోలుకోలేదు. ఎన్ని మందులు వాడినా ఉపయోగం ఉండటంలేదు" - అన్నాడు మధు.

"బహుశా ఇది 'యాంగ్జయిట్ న్యూరోసిస్' లక్షణంగానీ లేదా 'అబ్సెసివ్ న్యూరోసిస్' వ్యాధి లక్షణంగానీ అయివుంటుంది. 'యాంగ్జయిటీ'లో ముందు జరగబోయే విషయాల గురించి ఆందోళన ఎక్కువగా ఉంటుంది. ఇది వంశపారంపర్యంగా కూడా ఉండొచ్చు. నేననుకోవడం ఏమిటంటే ఇలాంటి వ్యాధులన్నింటికి పైకి కనిపించే కారణాలకంటే మానసికంగా ఏదో ఉంటుంది. చిత్రమైన విషయం ఏమిటంటే రోగికి కూడా తెలియని భావాలు మెదడులో ఉంటాయి" అన్నాడు సారథి.

"కొంచెం అర్థమయ్యేటట్లు చెప్పకూడదూ" అన్నాడు మధు.

"ప్రయత్నించేస్తా. మనం మన బాల్యం గురించి మాట్లాడుకుందాం. పసిబిడ్డకు భయం గురించి తెలియదు. పిల్లల్ని ఒంటరిగా వదిలి వెళ్ళిపోతామనుకో. ఆకలయినప్పుడు ఏడుస్తారు. అంతేగా.... ప్రాకుతుంటారు. మొదట్లో వారికి నిప్పులంటే భయం ఉండదు. ఎర్రగా ఉండి వారిని ఆకర్షిస్తుంది. అటువైపు పాక్కుంటూ వెళ్తారు. ఎవరూ చూడకపోతే పట్టుకుంటారు కూడా. అప్పుడు కాలుతుంది.




మొదటిసారిగా భయం అంటే తెలుస్తుందను కుంటాను. ఆ తర్వాత నిప్పును పట్టుకోమన్నా పట్టుకోరు. అలాగే ఇతర భయాల గురించి-

మన గోడల మీద బల్లులు తిరుగు తుంటాయి. వాటిని చూస్తే మనకు ఎలాంటి భయం కలగదు. ఒకసారి చందమామలాంటి పుస్తకాలు గుర్తుచేసుకో. వాటిల్లో పెద్దపెద్ద రంగుల బొమ్మలు వేస్తారు. పెద్ద పెద్ద బల్లులు. రాక్షస తొండలు. నోటి నుండి రక్తం కారుతూ ఉంటుంది. భయంకరంగా ఉన్నాయ్ అనిపిస్తుంది. అసలు ఒరకంగా మనమే భయాన్ని పిల్లల్లో చిన్నతనం నుండి ఇంజెక్ట్ చేస్తాం.

ఆ విషయం మనకు తెలియదు. మెలికల పాము మనముందే తిరుగుతుంటుంది. పట్టించుకోం. అదే రూపం కలిగిన పాము వెళ్తుంటే భయంతో బిగుసుకుపోతాం. ఇవన్నీ శారీరకపరంగా కనిపిస్తుంటాయి. కానీ వాటి వెనకాల ఏదో కారణం ఉంటుంది. అసలు భయం అంటే ఏమిటో చెప్పమను. ఎవరూ సరిగ్గా చెప్పలేరనే అనుకుంటున్నాను. చెప్పటం ఆరంభిస్తే అది భయానికి చెందిన ఏదో ఓ కోణం మాత్రమే అవుతుంది. అసలు భయంగురించి మాట్లాడుకోవటమంటే అదో పెద్ద గ్రంథం... అదో ఫిలాసఫీ... ఎవడి భయాలు వాడికున్నాయి. టు బీ ఫ్రాంక్ ఇంతవరకూ ఈ మానవుల్లో దేవుణ్నీ దెయ్యాన్నీ చూసినవారెవరూ లేరు. కానీ వాటి గురించిన భావాలు, భయాలు మాత్రం విస్తృతంగా ప్రచారంలో ఉన్నాయి'

మధు మధ్యలో అడ్డుతగులుతూ అన్నాడు.

"దేవుణ్నీ చూశామనే వ్యక్తుల్ని అప్పుడప్పుడు మనం చూస్తుంటాంకదా. అలాగే దెయ్యాల్ని అనుభూతి చెందేవారు సైతం దేశంలో ఉన్నారు. మనం అంగీకరించకపోయినా"

"నిజమే... ఈ విషయంలో నమ్మకమే ప్రధానం. ఇవి సైన్స్‌కూ, పరీక్షకు నిలబడవు. తాను దేవుణ్ని చూశాననే, తానే దేవుణ్ననో నమ్మేవారిని, అలాగే దెయ్యాలున్నాయి చూశామనేవారిని రెండురకాలుగా విభజించారు. మొదటిది ఓ ప్రయోజనంకోసం ఇలా ప్రవర్తించటం. రెండోది ఇవన్నీ మానసికపరమైన వ్యాధులు. వీటికి చికిత్సచేయాలి. కానీ దురదృష్టం ఏమిటో మనప్రజలంతా ఈ మానసిక రోగులదగ్గరికే చేరుతుంటారు. దీనికి ఒకటే కారణం"

"ఏమిటది?"

"భయం... అవును. భయమే. చిన్ననాటి నుండి మనతోపాటు ఎదుగుతూ వచ్చే భయం. మనల్ని అదృశ్యంగా కంట్రోల్ చేసేది భయం. చాలా సందర్భాలలో మనం దేనికీ భయపడకుండా స్వేచ్ఛగా ప్రవర్తిస్తున్నామనుకుంటాం. వరుసగా ఓ వందహత్యలు చేసినవ్యక్తి మనను లోతుల్లోకి వెళ్తే మనం భయం తాలూకు కోణాల్ని చూడవచ్చు. చిన్నచిన్న విషయాలు చెప్పుకొందాం. భయానికి కారణం స్పృహ... స్పృహ పెరుగుతున్నకొద్దీ భయమూ, ధైర్యమూ పెరుగుతుంటాయి. ప్రతి మనిషిలోనూ ఈ రెండు లక్షణాలుంటాయి. ఇవి ఎప్పటికప్పుడు త్రాసులో అటూ, ఇటూ ఊగిసలాడుతుంటాయి. ఒక్కోవ్యక్తిలో ఏలక్షణం మొగ్గుచూపిందనే దాన్నిబట్టి ఆ వ్యక్తి ప్రవర్తన ఉంటుంది.

చిత్రమేమిటంటే ఈ లక్షణాలు అకస్మాత్తుగా మారిపోతుంటాయి. ఒక్కోసారి గొప్ప ధైర్యవంతుడనుకునేవ్యక్తి సడన్‌గా డిప్రెషన్‌లోకి జారిపోవచ్చు. అదే సమయంలో పిరికివారుగా ఉండేవారు గొప్ప ధైర్యాన్నికూడా ప్రదర్శించవచ్చు"

"అలాంటి ప్రవర్తనలకు కారణం ఏమిటి?"

"జీవితానుభవం. జీవితానుభవాలు ఎప్పుడూ ఒకే రకంగా ఉండవు. నా వరకు నాకు చీకట్లో వంటరిగా ఉండాలంటే భయం. నేను భగవంతుడి అస్తిత్వాన్ని అంగీకరించను. దెయ్యాలు, భూతాల సమస్యలేదు. అయినా నేను ఎందుకు భయపడతాను? ఆలోచించుకుంటే ఆశ్చర్యం కలుగుతుంది. చిన్నతనంనుండి ఇంట్లో చీకటంటే ఓ రకమైన భయాన్ని కలగచేశారు. 'బూచాడు' వస్తాడని, 'దొంగలు' వస్తారని, 'అల్లరిచేస్తే' పట్టుకుపోతారనీ, చీకట్లో రాక్షసిలా కనిపించేట్లు చూపించి 'అదుగో దయ్యం' 'అదిగో భూతం' అనిచెప్పి దడిపించటం... ఇవన్నీ లేత మనసుల్లో చెరగని ముద్రలుగా ఉండిపోతాయి.

మనం తర్వాతకాలంలో ఎంతగానైనా ఎదగొచ్చుగాక... మన మెదడుపొరల్లో నిక్షిప్తమైన ఆ దృశ్యాలు మాత్రం జీవితాంతం వెంటాడుతుంటాయి. సరే... వాటిని అధిగమించటం వేరే విషయమనుకో. కాగా భయానికి చెందిన అదృశ్యరూపాల్ని మనసులోకి తమకు తెలియకుండానే ప్రవేశపెట్టేది కుటుంబజీవితంనుండే ప్రారంభం. మనం ఇలా ఆలోచించగలుగుతున్నాంకదా. మనం సైతం మనకు తెలియకుండా మన పిల్లల్లో ఎన్నోరకాల భయాల్ని ప్రేరేపిస్తుండవచ్చు" అన్నాడు సారధి.

"బాగానే ఉంది" అన్నాడు మధు.

"బాగుండటంకాదు. ఈ నడుమ కొన్నికేసులు చూశాను. దాంతో నాకీవిషయాలు కొద్దికొద్దిగా తెలుస్తున్నాయి. మరో తమాషా ఏమిటంటే మనవైద్యంకూడా కేవలం వ్యాపారంగా మారిపోయింది. చాలామంది వ్యాధి మూలం కనుక్కునే ప్రయత్నం సిన్సియర్‌గా చేయటంలేదు. జ్వరం వచ్చిందనుకో ఆ టెంపరేచర్ తగ్గటానికి ఏ ఇంజెక్షన్లో, టాబ్లెట్లో వాడతారు. అసలు జ్వరం అనేది ఓ రోగంకాదని నాకు ఓ డాక్టర్ చెప్పాడు"

"జ్వరం రోగంకాక మరేమిటి?" ఆశ్చర్యంగా అడిగాడు మధు.

"జ్వరం రోగలక్షణం. జ్వరం ఎందుకైనా రావచ్చు. గాయాలవల్ల రావచ్చు. ఇంకా శరీరం లోపలి భాగాల్లో ఏదైనా లోపం ఉండటంవల్ల రావచ్చు. అది గుర్తించగలగాలి.

డయాగ్నైజ్ చేయటం అంటే అదే. జ్వరం అనేది రోగలక్షణం అయినప్పుడు ఆ రోగానికి మందు ఇస్తే రోగమూ, జ్వరమూ రెండూ తగ్గుతాయి. అలాకాక జ్వరానికి మాత్రమే మందిస్తే రోగి శరీరంలో ఆ రోగం ఉంటూనే ఉంటుంది. అంతేకాదు. ఒక్కోసారి జ్వరమే రోగంగా రావచ్చు. అంటే జ్వరానికి మరే ఇతర కారణమూ లేకపోవచ్చు. అంటే దీనిప్రకారం జ్వరం ఓ రోగం కాదు. జ్వరం ఓ రోగం కూడా...

ఇప్పుడు మన హాస్పిటల్స్ చూద్దాం. పేషెంట్స్ వందలకొద్దీ ఉంటారు. డాక్టర్లు ఒక్కో రోగికి ఎంత సమయం కేటాయించగలరు? మహా అయితే అయిదు నిమిషాలు లేదా పది నిముషాలు. ఈ సమయంలో వారు చేసేదేమిటి? రోగానికి చెందిన లక్షణాల్ని రోగిద్వారా వింటారు. అది తగ్గటానికి మందులు వాడతారు. రోగాలు అంతంకానిదిక్కడే.

అసలు మందులకంటే ముఖ్యమైన ట్రీట్‌మెంట్ ఒకటుంది. అది మానసిక పరమైంది. ముందు రోగి యొక్క అలవాట్లు, అభిరుచులు తెలుసుకోవాలి. రోగితో డాక్టర్ చనువుగా, స్వేచ్ఛగా మాట్లాడగలగాలి. అప్పుడు మాత్రమే తన మనసులో ఉన్నవన్నీ రోగి చెప్పుకోగలుగుతాడు. రోగి గతం గురించి తెలుసుకోకుండా, రోగి మానసిక పరిస్థితిని అర్థంచేసుకోకుండా చేసే వైద్యం అప్పటికప్పుడు ఫలితాన్ని చూపిస్తుంది. భవిష్యత్‌లో అది మరో భయంకరమైన రూపంలో బయటపడటానికి అవకాశం ఉంది" అన్నాడు.

"నీకు చాలా విషయాలు తెలుసునే!" అన్నాడు మధు.

"ఈ విషయాలు నీకుమాత్రం తెలియవా... కాకపోతే నేను కొంచెం వివరించానంతే. అది సరే ఇదంతా మీ పెదనాన్న గురించేనా?"

"కాదు... నా భార్య గురించి

జానకి భయపడుతోంది. ఆమెలో భయాల్ని పోగొట్టాలి" అన్నాడు మధులేస్తూ.




మధు పడుకొని ఆలోచిస్తున్నాడు. సారధి మాటలే గుర్తొస్తున్నాయ్.

"రోగి మానసిక పరిస్థితి తెలుసుకోకుండా చేసే వైద్యం అప్పటికప్పుడు ఫలితాన్ని చూపిస్తుంది. భవిష్యత్‌లో అది మరో భయంకరమైన రూపంలో బయటపడటానికి అవకాశం ఉంది"




అంటే...

జానకిని తను అర్థంచేసుకోలేకపోతున్నాడు. జాగ్రత్తగా ఆలోచిస్తే ఆమెలో ఈ భావాలు ఈ నడుమే వస్తున్నాయి. ఓ రకంగా అది విచిత్రమే. వాస్తవానికి ఇప్పుడు కనీస జీవితం ఉంది. ఇప్పుడే... ఇలాంటి సమయంలో ఎందుకిలాంటి స్థితి వస్తోంది? మరీ అయిదారునెలలుగా... ఎందుకని? తన ప్రవర్తనలో ఏమైనా మార్పు వచ్చిందా? లేదే! ఎప్పటిలాగానే తను ప్రవర్తిస్తున్నాడు. తన కోపంలోగానీ, తన ప్రేమలోగానీ ఎలాంటి మార్పులేదు. ఈ నడుమ తన కుటుంబంలో ఎలాంటి సంక్షోభం రాలేదు. మరి ఎందుకీ మార్పు జానకిలో...

ఆలోచిస్తున్న మధు మనసులోకి ఒక్కసారిగా "మనోహర్" ప్రవేశించాడు.

"మనోహర్"! తన ప్రాణ స్నేహితుడు!

మధు 'మనోహర్' జ్ఞాపకాల్లోకి జారిపోయాడు.

మధు, మనోహర్ చిన్ననాటి స్నేహితులు. వారిస్నేహం దశాబ్దాలు గడుస్తున్నకొద్దీ ఎదుగుతూ వచ్చింది. మనోహర్‌కూడా ప్రభుత్వోద్యోగం చేస్తున్నాడు. అయితే అతనికిస్వంత ఇల్లుంది. ఇద్దరు తమ్ముళ్ళున్నారు. పది ఎకరాల భూమి ఉంది. పొలం పనులన్నీ వాళ్ళే చూసుకుంటున్నారు. తన స్వంత ఇల్లు వదిలి వేరేచోట కాపురం ఉండటం అతనికి ఇష్టంలేదు. అందుకే రోజూ ట్రైన్‌లో వస్తుండేవాడు. దాదాపు అయిదారు గంటల సమయం ఈ ప్రయాణంలోనే గడిచిపోయేది. మధుకు తన మిత్రుడి విషయంలో నచ్చనిదదే.

"రోజూ ప్రయాణాలేమిట్రా బాబు... నెలకొక్కసారి ఎక్కడికైనా వెళ్ళిరావాలంటే నా తల ప్రాణం తోకకొస్తుంది. అయిదారు గంటలపాటు రైల్లో కూర్చోవటమంటే మాటలా... నీకు ఓపిక ఉంది. ప్రయాణం చేస్తున్నావు. ఆ తర్వాత కష్టమౌతుంది" అనేవాడు.

"నేను ఒక్కడ్నే కాదురా ప్రయాణం చేస్తున్నది. ఎంతెంత దూరాలనుండి ప్రయాణాలు చేస్తున్నారో తెలుసా... అయినా అలవాటయిపోయిందిరా. ఇక్కడకొచ్చామనుకో ఎన్నో సమస్యలు. మా డిపార్ట్‌మెంటులో డ్యూటీలు ఓ పద్ధతిలో ఉండవు. ఎవరు రాకపోయినా పిలుస్తారు. అర్ధరాత్రి నిద్రపోతున్నా లాక్కెళ్తారు. ఇదయితే బాధలేదు. అంతగా అయితే ట్రావెలింగ్‌లోనే ఆ కష్టం భరించొచ్చు. రెండోదేమిటంటే ఇక్కడికొస్తే మూడువందలు లేనిదే కొంప దొరకదు. దొరికినా గేదెలు పెట్టుకోవడానికి అంగీకరించరు. రెండు గేదెలు పెట్టుకున్నాం. పాలకిపాలు. ఏదో ఆధారంగా ఉంది. ఇంక పొలం పనులంటావా... తమ్ముళ్ళు చూస్తున్నా నేనూ వెళ్తుంటాను. ఇక్కడికొస్తే అదే కుదరదు. రకరకాల ఇబ్బందులు బాబూ" అంటుండేవాడు.

మధుసైతం ఎక్కువ ప్రయాణాలు చేస్తుంటాడు.

అలాంటిసమయంలో మనోహర్ దగ్గరికి వెళ్తుండేవాడు. మనోహర్ పనిచేసే ఊరు తను వెళ్ళే దారిలోనే ఉంటుంది. కనీసం పదిహేను రోజులకొకసారైనా ఎవరో ఒకరు కలుసుకుంటారు.

మనోహర్ వస్తేచాలు భోంచేసి డాబా మీదకు వెళ్ళటమో, లేదా రైలుస్టేషన్‌కి వెళ్ళటమో, లేదా ఓ సినిమాకు వెళ్ళటమో చేస్తుండేవారు. మనోహర్ బాగా సిగరెట్లు తాగుతాడు. మధుకు అలవాటులేకపోయినా తన్తోపాటు కాల్చేవాడు.

ఓ పెట్టె సిగరెట్లు తెచ్చిపెట్టుకుంటే రాత్రంతా కబుర్లతోనే గడిచిపోయేది. వారి కబుర్లలో చిన్ననాటి విషయాల నుండి దేశదేశాల విషయాల వరకూ ఉండేవి. ఇద్దరికీ రాజకీయాలంటే ఇష్టం. ఈ ఉద్యోగాల్లోకి రాకముందు వారిద్దరూ కొన్ని సంఘాల్లో పనిచేశారు.

మనోహర్ కొంచెం ఆవేశపరుడు. అది అతని నిర్ణయాల్లోనూ, ఆచరణలోనూ కనిపిస్తుండేది. అతని కోపం భరించలేక చాలా మంది అతని స్నేహాన్ని వదులుకున్నారు. ఒక్క మధుతోనే అతని స్నేహం గాఢంగా కొనసాగింది. అయితే ఇరువురికీ అనేక విషయాల్లో అభిప్రాయభేదాలుండేవి. ఇద్దరూ భిన్నమైన పార్టీల్ని అభిమానిస్తారు. వారి చర్చల్లో ఆయా పార్టీలమీద విమర్శలుండేవి. అవి చాలా తీవ్రంగా, వాడిగా, వేడిగా ఉండేవి.

అయినా వారి స్నేహం అభివృద్ధి చెందుతూనే వచ్చింది. వారు తరచుగా కలునుకోవటానికి కారణం అదే.

వారు కలునుకున్నప్పుడు ఒకరి అనుభవాలు ఒకరికి చెప్పుకునేవారు. వారిలో మంచి లక్షణం ఒకటుంది. వారు నేర్చుకోవటం కోసం తమ గది తలుపులు తెరిచి ఉంచేవారు. అంతేకాదు. వారిద్దరికీ మరో అభిరుచి ఉంది. వారిద్దరూ సాహిత్యం బాగా చదువుతుండేవారు.

సరిగ్గా ఆరునెలల క్రితం మనోహర్ వచ్చాడు.

తనెందుకో ఆందోళన చెందినట్లు కనిపించాడు. స్నానం చేశాక. భోంచేసి మేడమీదకు వెళ్ళారు.

"ఏమి(రా ఈరోజు అలా ఉన్నావ్" అన్నాడు మధు.

"ఈ ఉద్యోగం చేయటం చాలా కష్టంగా ఉందిరా" అన్నాడు మనోహర్.

"అదేమి(రా మినిస్టర్‌లా రావటం పోవటం మీ ఇష్టంకదా. ఉదయం పన్నెండుగంటలకు రావటం. మూడున్నరకు వెనక్కివెళ్ళటం ఇంత సుఖం ఎవరికుంది బాబూ"

"నీకు కనిపించేవదే. పనిలేకపోతే త్వరగానే వెళ్తామనుకో. ఒక్కోసారి రెండు మూడు రోజులదాకా ఇక్కడే ఉండిపోతాం. పైగా ఆ డ్యూటీలన్నీ ఓ ఎత్తు. నేను తిరిగితిరిగి అలసిపోయానురా. ఇక్కడకు రావటానికి ఆమె అంగీకరించదు. సరే నాకుంటే ఇబ్బందులు నాకున్నాయనుకో. ఇది ఎంతకాలం. నీకంటే ఇబ్బంది లేదు"

"అవునుమరి... మాకు స్వంత కొంపంటూ ఏడిస్తేగా... మీలా పొలాలూ, గ(రా ఉన్నాయా... ఎక్కడికి పంపిస్తే అక్కడికి నాలుగ్గిన్నెలు సర్దుకొని పొలోమంటూ కాందిశీకుల్లా తరలిపోవటమే కదరా"

"ఛ.. నా ఉద్దేశ్యం అదికాదురా, ఇంటిదగ్గర రకరకాల సమస్యలు. వాళ్ళు పొలంపనులు చూస్తున్నారు. వేరే ఆదాయం లేదు. ఆడవాళ్ళకి మాకిలా రెండు రకాల ఆదాయం రావటం బాధాకరంగా ఉంటుంది. నేను ఇటు వస్తాను. అక్కడ రకరకాల తలనొప్పి... ఈ ఆస్తి ఉంటే ఓ బాధ... లేకపోతే ఇంకోబాధ"

"దానికీ ఉద్యోగం చేయటానికి కష్టంగా ఉండటమేమిటో నాకర్థం కావటంలేదు" అన్నాడు మధు.

"లేదురా... ఇంటిదగ్గర విషయాలు జనరల్ అనుకో. నాకు ఈ ట్రైన్ ట్రావెలింగ్ తప్పటంలేదు. రెండురోజులకోసారి ఇంటికి వెళ్తున్నా. మరీ మా ఆఫీసులో బాసిజం ఎక్కువ. ఒక్కడికీ పొట్టకోస్తే అక్షరంముక్కరాదు. ఎంత ఘోరంగా ప్రవర్తిస్తారో. ఒక్కోసారని పిస్తుంది. ఈ బోడి ఉద్యోగానికి అర్థమైన వెధవల్తో మాటలు అనిపించుకోవటం ఏమిటని? ఈ ఘర్షణ భరించలేక పోతున్నా"

"ఈ సమస్యలు అన్నిచోట్ల ఉన్నవేగా?"

"మిగతాచోట్ల సంగతివేరు. మా డిపార్ట్‌మెంట్‌లో వేరు. ఇంకో విషయం మొఖంమీద ఊసినా మా వాళ్ళు మెల్లగా తుడిచేసుకుంటారు. నాకది గిట్టదు. అందుకే మావాళ్ళందరికీ నేనంటే పీకలదాకా కోపం. వెధవ ఆఫీసూ... వెధవ రాజకీయాలు"

"మరి మన ఊరిదగ్గరికి ట్రాన్స్ఫర్ చేయించుకోలేకపోయావా?"

"మనకా? చేసేదెవ(రా బాబూ... చేశారా ఈ చుట్టుపక్కల ఎక్కడా వేయరు. ఇవేరా గొడవలు. ఇలాంటివెన్నో చూపించి భయపెట్టిస్తుంటారు. చాలామందికి ఎదిరించాలనుంటుంది. పనిష్‌మెంట్ ఏరియాలకి పారేస్తారని ఎవరూ నోరు మెదవరు"

"మరి ఇప్పుడేం చేస్తావ్?"

"ఏంచేయమంటావ్?"

"ఉద్యోగం మానెయ్యి"

"ఏడ్చావులే" అనేసి అంతలోనే అన్నాడు.

"నాకూ అనిపిస్తుంది. నాలుగురోజులు బాధపడతాం. తిరిగి రాజీ పడతాం. ఈ ఉద్యోగం మానేశామనుకో. పొలంపనులు ఎంతకాలం ఉంటాయి. నాలుగునెలలు. మహా అయితే ఆరునెలలు. ఆ తర్వాత ఏం చెయ్యాలి. ఖాళీగా ఉంటే పిచ్చెక్కుతున్నట్లుంటుంది. అందుకే ఇది తప్పటంలేదు"

"ఏం చేస్తాం... ఈ ఉద్యోగాలే మనకు గతి"





"మనం చిన్నతనంనుండి ఇంగ్లీష్‌ను అశ్రద్ధచేశాం. ఇప్పుడు బాధ కలుగుతుంది. మనం చక్కగా ఇంగ్లీష్ నేర్చుకొని ఉంటే శుభ్రంగా జర్నలిస్టులం అయి ఉండేవాళ్ళం. నాకయితే ఎప్పుడూ ఏదో ఒక థ్రిల్లింగ్ అనుభవం కావాలి. అది జర్నలిజంలోనే సాధ్యం అవుతుంది"

"ఇప్పుడేమైంది- వెళ్ళు" అన్నాడు మధు.

"గ్రాడ్యుయేషన్‌లో ఇంకా కొన్ని పార్టులున్నాయి. సీరియస్‌గా ఆలోచిస్తే అదే మేలనిపిస్తోంది. కాకపోతే కొంచెం కష్టంగా ఉంటుంది. ట్రాన్స్‌లేషన్ నేర్చుకొని మనం ఏదో పత్రికకు వెళ్దాం" అన్నాడు మనోహర్.

"నీకు మాత్రం ఈ ఉద్యోగం హాయిగా ఉందా?" అన్నాడు తిరిగి.

"లేదనుకో... మెల్లగా మాట్లాడు. ఈ మాటలు జానకి వింటే విరుచుకు పడుతుంది"

"ఓహో తమర్తో ఆవిడకి చాలా అనుభవాలున్నాయిగా" అన్నాడు గతం గుర్తుచేసుకుంటూ.

"జర్నలిజంలో మాత్రం సమస్యలు లేవా?" అన్నాడు మధు.

"ఉండకుండా ఎలా ఉంటాయి. అయితే మనకు అభిరుచి ఉన్న రంగం అది. ఈ ఉద్యోగం గతిలేక చేస్తున్నాం. మనకిష్టమైన రంగంలో ఎన్ని ఇబ్బందులొచ్చినా, వాటిని ఎదుర్కోవటంలోనూ, మరో విషయంలోనూ తృప్తి ఉంటుంది. ముందు ఈ ఉద్యోగస్వభావ విషయంలోనే మనం రాజీపడటంలేదుకదా"

"నిజమే... మరి నువ్వు రోజులో ఎక్కువ భాగం ప్రయాణం చేస్తున్నావుకదా... ఎలా చదువుతావ్?"

"కష్టమే అనుకో తప్పదుకదా" అన్నాడు మనోహర్.

"నిద్రవస్తోంది. ఇంక పడుకొందామా? నరే... రేపు నీతోపాటు నేనుకూడా వస్తున్నా" అన్నాడు మధు.

"ఏమిటి విశేషం?"

"మా వాళ్ళదేనభ జరుగుతూంది. నాకూ కొన్ని పనులున్నాయి. అన్నీ కలిసివస్తాయని వెళ్తున్నా"

"ఎన్ని రోజులు ఉంటావేమిటి?"

"నాలుగు రోజులు"

"నర్లే... గుడ్‌నైట్..."

"గుడ్‌నైట్"

★ ★ ★

ఉదయమే బయలుదేరారు మధు, మనోహర్.

"నేను వెళ్తున్నానమ్మా" అన్నాడు మనోహర్. నవ్వుతూ తలూపింది జానకి. తన బ్యాగ్ తీసుకోవటానికి వెళ్ళాడు మనోహర్

"త్వరగా రండి" అంది జానకి మధుతో.

"అలాగే"

"జాగ్రత్త. రైలెక్కగానే సీట్లోకూర్చోండి"

"అలాగే"

"మీదంతా ఎగతాళి"

"అలాగే"

జానకి కోపంగా చూసింది.

"లేకపోతే ఏమిటోయ్... ఎక్కడికన్నా వెళ్తున్నాం అంటే మొదలుపెడతావ్. నూక్తి ముక్తావళి పిల్లలకు చెబుతున్నావంటే అర్థముంది- నాక్కూడానా?"

"పిల్లలకంటే మీకే చెప్పాలిబాబూ, తమరికి వెళ్ళు తెలీదు. మీ ఇద్దరూ మాట్లాడుకుంటుంటే ఈ ప్రపంచమే మరిచిపోతారు"

"అంతేగా?"

"అంతేగాకాదు. మీరు తలుపు దగ్గర నిలబడి కబుర్లు చెబుతారు. అదంతమంచిది కాదని!"

"తిరిగి... నూక్తి..."

"మీ ఫ్రెండ్ అయితే ఇంకా ఘోరం. రైలు బయలుదేరాక పరిగెత్తుకొస్తాడు. కాలుజారితే ఇంకేమైనా ఉందా?"

"ఒరేయ్ మనోహర్! నీ గురించే మీ వెల్లాయి ఆరోపణ"

"ఏమిట్రా?" అన్నాడు నవ్వుతూ.

"తమరు రైలు ప్రయాణ విషయంలో ఏ మాత్రం జాగ్రత్త పడటంలేదట"

"అదా" నవ్వేశాడు.

"వస్తానమ్మా"

"ఈసారి వచ్చేటప్పుడు వదిన్ని తీసుకు రండి"

"తప్పకుండానమ్మా"

"ఇలాగే చెబుతున్నారు- ఇంతవరకూ తీసు కురాలేదు"

"లేదమ్మా ఈసారి వస్తే మీ వదినతోనే.. సరేనా"

జానకి నవ్వుతూ తలూపింది.

రైలెక్కగానే ముందు వారిద్దరూ చేసినపని సీట్లో కూర్చోవటం.

"ఈరోజు సీట్లు దొరికాయి. జానకి అను కుంటుంది మనకు తలుపుదగ్గర నిలబడి మాట్లాడుకోవటం సరదాఅని. ఇవన్నీ ఆసక్తులని గుర్తించదు. చిన్నప్పుడు కిటికీపక్కన కూర్చుని చూడాలని సరదాగా ఉండేది. ఆ తర్వాత నడుస్తున్న రైళ్ళలోకి ఎక్కాలని. ఇప్పు డు అలాంటి సరదాలు లేవుగా. అయినా మన రైళ్ళలో ఉండేది రెండు చిన్న కంపార్ట్‌మెంట్‌లు. వాటిలో సీటు దొరకటం సామాన్య అంశం కాదుగదా. అయినా జానక్కి చిత్రమైన భయా లు వస్తుంటాయి" అన్నాడు మధు.

"మనిషికి ఆ మాత్రం భయాలు కూడా ఉండాలిరా" అన్నాడు మనోహర్.

"దేనికట"

"చిత్రమైన భయాలులేనిదే భవిష్యత్ ఉండదు. అసలు మనిషన్నాక భయాలు లేకుండా ఎలా ఉంటాయి? చాలామంది తమ కేం భయాలు లేవన్నట్లుగా నటిస్తుంటారు. అదంతా చెత్త. భయం ఉన్నప్పుడే దానికి వ్యతిరేకంగా పోరాటం ఉంటుంది. జానకిది భయం అనేకంటే జాగ్రత్త అంటే బావుంటుందేమో"

"నిజమేననుకో" అంటూ ఏదో చెప్పబోయా డు మధు.

"నిజంరా... ఈ ఉద్యోగంలో చేరటానికి నేను ఎన్ని సంవత్సరాలు స్ట్రగుల్ అయ్యానో తెలుసు కదా. భవిష్యత్ గురించి ఆలోచిస్తుంటే కలిగిన భయంవల్ల నేనీ ఉద్యోగంలోకి రాగలిగాను. ఈ ఉద్యోగంలో చేరాక నాకు మరికొన్ని కొత్తభయా లు వస్తున్నాయి. అంటే నాలో మరింత ఆలో చన పెరుగుతూంది దాంతో మరికొన్ని కొత్తభ యాలు. ఒక్కోసారనిపిస్తోంది. మనం ఈ ప్ర పంచంలోకి ఎందుకొచ్చాం. మన బాధ్యతే మిటి? రోజూ ఉద్యోగానికి వెళ్ళిరావటం, భోజనం చేయటం, పడుకోవటం ఇవేనా? ఇంతకంటే మన జీవితానికి వేరేగమ్యం లేదా అనేబాధ కలుగుతుంది.

ఓ రకంగా నాకు బాల్యమే బాగుందని పిస్తుంది. అప్పుడు ఏ భయాలూలేవు. ఆందో ళనలు లేవు. ఇంట్లో పెట్టింది తినటం, చదువు కోవటం. మరి ఇప్పుడు మనకు జ్ఞానం పెరుగు తూంది. ఈ నడుమ ఓ మిత్రుడన్నాడు. జ్ఞానం పెరుగుతున్నకొద్దీ భయాలు పెరుగుతా యంట. నిజమే. ఏమీ తెలియని అమాయక త్వంలోఉన్నా బాగుండేది. చక్కగా మన సంసారం, మనపిల్లలు, మన బ్యాంక్‌బాలన్స్ అనే చట్రంలో ఉండేవాళ్ళం. ఇప్పుడేం చేయా లన్నా ఏదో సందిగ్ధం. జీవితం మరీ నిస్సా రంగా ఉంది. ఏ కొత్తదనమూ లేదు. ఏ వినోదమూలేదు. ఏ గమ్యమూ లేదు"

"ఏమిట్రా ఈసారి చాలా చిత్రంగా మాట్లా డుతున్నావు" అన్నాడు మధు.

"చిత్రంకాదురా... భోరున ఏడవాలని పిస్తోంది. నిజం. మనం ఈ సమాజానికి ఏంచే స్తున్నాం? మనలాంటివాళ్ళంకూడాఅన్నిబాధ్య తలనుండి దూరం కావటానికే ప్రయత్నిస్తు న్నాం. తెగింపు చూపలేకపోతున్నాం. నిజమైన మేధావులు నిర్లిప్తంగా ఉండబట్టిగదా ఈరోజు నవాలక్షరకాల జనం రంగంమీదున్నారు. ఇదంతా ఏమిటి చెప్పు? మనం జీవితాన్ని గురించి ఎంత భయపడి, ఎంత ఆరాటపడబ ట్టి ఇంత దారుణంగా బతుకుతున్నాం. మనం ఈ జీవితాన్ని ఇంతగా ప్రేమిస్తున్నాంకదా... ఏ అమెరికావాడో ఎక్షణమైనా ఓ మీట నొక్కాడను కో... ఏమైపోతాం! ఇప్పటివరకూ నిర్మించుకు న్నవన్నీ నాశనంకావూ...! నీకు గుర్తుందా... ఆ నడుమ ఉప్పెన విరుచుకుపడింది. ఏ మిగి ల్చింది? ఓ భూకంపమో, మరేదో వచ్చిందను కో ఏం మిగులుతుంది? ఇవన్నీ మనం గుర్తుపె ట్టుకోం. మనకు ఈ పూట గడవటం కావాలి. ఈరోజు భయాలకు పరిష్కారంకావాలి. మనం, మన పిల్లలు బాగుపడితేచాలు. ఈ ప్రపంచం





ఏమైనా ఫర్వాలేదు'' మనోహర్ ఆవేదనతో చెప్పుకుపోతున్నాడు.

అప్పటికే కొందరు వారిద్దరివైపు దృష్టి సారించారు.

మధు అది గమనించాడు.

''నువ్వేంటి మరీ వర్రీ అవుతున్నావ్- ఏమైనా గొడవలు జరిగాయా?'' అన్నాడు మధు.

''గొడవలు లేనిదెక్కడరా? తెల్లారి లేచిన దగ్గర్నుండి, పడుకోబోయేదాకా అన్నీ గొడవలూ, భీభత్సాలేగా! ఒక్కసారి ఎందుకోనన్ను నేను సమీక్షించుకోవాలని అనిపించింది. ఈ నడుమ నాఅంతరాత్మనూ... మరోటనూ నన్ను తినేస్తోంది. నాకు దాదాపు ముప్పైఅయిదు దాటుతున్నాయి. అంటే జీవితంలో మూడు వంతులు గడిచిపోయింది. ఏంసాధించాం? ఇంటా, బయటా తగాదాలు. ఇప్పటికీ ఈ ఉద్యోగం కాపాడుకోవటం ఎలా? ఇంకోచోటికి ట్రాన్స్‌ఫర్ కాకుండా ఎలా ఉండాలి? వచ్చే ఆఫీసర్లను ఎలా కాకాపట్టాలి? ఇంకా ఎంతపాలంకొనాలి. ఇవేగా ఆలోచనలు. ఇంతకు మించి ఏం సాధించాం? ఈ ప్రపంచంలోకి మనం వచ్చినందుకు ఈ ప్రపంచంకోసం ఒక్క మంచిపనైనా చేయాలికదా''

''ఎందుకురా అంత బాధపడ్తావ్. అంతిదిగా ఉన్నప్పుడు రాజీనామా ఇచ్చి నీ కిష్టమైన రంగంలో పనిచెయ్యి''

''అది చేతయితే ఇంత గగ్గోలెందుకురా? నా బలహీనత ఇది. నన్ను ఏవో సంకెళ్ళు కట్టిపడేస్తున్నాయి. వాటి నడుమ నేను గిలగిలలాడుతున్నాను. కొద్దోగొప్పో ఆధారమున్న నాలాంటివారే ఇంత గింజుకుంటుంటే ఏ ఆధారంలేనివాడి పరిస్థితి ఏమిటి? మనం ఏ గమ్యంలేకుండా బతుకుతున్నాంరా... బతుకుతున్నాం'' తలవంచుకున్నాడు మనోహర్.

''చూడు మనూ... నువ్వు ఆవేదన చెందటం సరయిన విషయమే. అయితే నేను ఓ విషయం చెప్పదలచుకున్నాను. కుటుంబ జీవితాన్ని సామాజిక జీవితంనుండి విడగొట్టకూడదు. మనం వ్యక్తిగతంగా మంచి భవిష్యత్ కోసం పోరాడటమనేది మనకు మాత్రమే చెందిన విషయంగా చూడగూడదు. అది సమాజానికి చెందిందికూడా. వ్యక్తులు తమకంటూ ఓ జీవితాన్ని నిర్మించుకునే క్రమంలోనే సామాజిక మార్పుకు తమకు తెలియకుండానే దోహదంచేసినవారవుతారు. నీకు నా సలహా ఏమిటంటే నీలో ఇంత సంఘర్షణ ఉన్నప్పుడు ఓ పనిచెయ్యి. కొద్దికాలంపాటు ఆలోచించు. ఏదో ఒక నిర్ణయం తీసుకో. నీలో నువ్వు మధనపడటంవలన ప్రయోజనంలేదు. అది శారీరకంగానూ, మానసికంగానూ మరింత స్తబ్దతలోకి, అనారోగ్యంలోకి నెట్టవచ్చు. అందుకే త్వరగా ఓ నిర్ణయానికి రా. అది పొరపాటు నిర్ణయమైనా సరే ఆచరణలో పెట్టు. అప్పుడు నీలో ఈ ఘర్షణ ఉండదు'' అన్నాడు మధు.

''నిజమేరా... నేను ఆలోచిస్తాను. ఇప్పటివరకూ నువ్వు నా జీవితంలో బలహీనతల్నే చూశావు. నాలో గూడుకట్టుకున్న భయాల్ని ఆందోళనల్ని చూశావ్. ఈ బంధనాలన్నింటిని తెంచుకొని బయటపడతాను. అత్యంత త్వరలోనే నాకుచెందిన ఓ సంచలనవార్త వింటావు. అప్పుడు నన్ను హృదయానికి హత్తుకుంటావు. నాభుజం తట్టి ముందుకు వెళ్ళమంటావు.

ఈ దేశంలో పుట్టినందుకు
నేనుసైతం అశ్రువొక్కటి
ధారపోస్తాను నేస్తం''

కళ్ళలో నీరు చిమ్ముతుండగా అన్నాడు మనోహర్.

''అంతకంటేనా'' అన్నాడు మధు కదిలిపోతూ.

రైలు వేగంగా పరుగులు తీస్తూ ఉంది.

★ ★ ★

రైలు పరిగెడుతూనే ఉంది.

నాలుగురోజుల క్రితం ఇదే రైలులో తనూ, మనోహర్ ప్రయాణం చేశారు. బహుశా ముందుకి... ఇప్పుడు తను వెనక్కి ప్రయాణం చేస్తున్నాడా? ముందూ వెనకల్ని ఎలా కొలవటం? తన ఇంటినుండి చూసుకున్నప్పుడు ఈ కొలబద్ద సమంజసం కాదేమో! ముందు అనుకున్నది వెనక కావచ్చు... వెనక అనుకున్నది ముందు కావచ్చు లేక ఈ రెండు దూరాలు అటూ ఇటూ మారుతుండవచ్చు.

తనకు మాత్రం ఒకటే వాస్తవం అనిపిస్తుంది- అది ప్రయాణం. ప్రయాణం వాస్తవం. అది ఎటు అనేది మనం మన స్వంత అంచనాలకు వచ్చినా రాకున్నా ప్రయాణమే వాస్తవం. జీవితంలో చాలాకాలం మనం ప్రయాణంలో ఉన్నామనే విషయాన్ని గుర్తించలేం. గుర్తించటం ఆరంభించాక సందిగ్ధం... మన ప్రయాణం సరయిందేనా అని. సరయిందని చెప్పుకున్నా... సరయింది కాదని చెప్పుకున్నా... రెండూ తప్పే! మన ఈ ప్రయాణంలో అడుగడుగునా లోపాలు ఉన్నాయి. అదే వాస్తవం.

వీటన్నిటినుండి మనం ఓ విశాలమైన గమ్యం దిశకు పయనించాలనుకుంటున్నాం. గమ్యం చేరగలమో లేదో తెలియదు. మొత్తం మానవ ప్రపంచమంతా అన్నిదారులనుండీ తన ప్రయాణాన్ని సాగిస్తూనే ఉంది. ఏ క్షణం ఈ దారుల్లో సంఘర్షణలు సంభవిస్తాయో, ఏ క్షణం అద్భుతాలు జరుగుతాయో ఊహించరున్నా ఒకటిమాత్రం వాస్తవం.

మానవుడు ముందుకో వెనక్కో పయనిస్తూనే ఉన్నాడు. రెండు అడుగులు వెనక్కివేయడం తప్పటంలేదు. అంతలోనే మరో అడుగు ముందుకు వేయకుండా ఆగటంలేదు.

మధుకు ఈ నాలుగురోజులు 'మనూ' మదిలో మెదులుతున్నాడు.

తను ఏదో విషయంలో గాయపడి ఉంటాడు. ఏదో ఒక విషయం మాత్రమే అయి ఉండదు. హృదయమున్న ప్రతివ్యక్తీ ప్రతి చిన్న విషయానికి వాడిలానే బాధపడతాడు. అలా అనేకానేక సంఘటనల నడుమనుండీ రాజీపడుతూ... పడుతూ లేస్తూ ప్రయాణం కొనసాగిస్తారు. ఏదో ఒకరోజు మాత్రం వారింకేరకంగానూ రాజీపడలేరు. వారి ఆవేశాలూ, ఆరాటాలు ఉప్పెనలా విరుచుకుపడతాయి.

వాడికి స్పృహ అనేది కలిగి... ప్రపంచం గురించి తెలుసుకోవటం ఆరంభించిననాడు మొట్టమొదటి ఆలోచనాతరంగం ఆ మెదడులో ప్రయాణం ఆరంభించింది.

ఇప్పుడది మనో ప్రవాహంలా మారింది.

ఆలోచనకూ- ఆచరణకూ నడుమ ఉన్న ఖాళీలు వాణ్ణి ఇబ్బందిపెడుతున్నాయి. అందుకే అంతగా బయటపడింది. ఇప్పుడు మనూ జీవితం ఓ నూతనదశలోకి ప్రవేశిస్తోంది.

చాలాకాలం ఈ కొత్త మార్గంలో పయనిస్తాడు. తిరిగి ఎప్పుడైనా ఈ దశను గురించిన ఆలోచనలూ, ఆచరణ వాణ్ణి నిలదీస్తాయి. ఇంతకంటే మంచి దిశకు మనూ వెళ్ళవచ్చు.

ఏది మంచి మార్గం? ఏది మంచి దిశ? ఎవరు చెప్పగలరు? జీవితానుభవం ఎప్పటికప్పుడు నిర్ణయిస్తుంటుంది. ఎప్పటికప్పుడు దిశల్ని మారుస్తుంటుంది.

ఒకటి వాస్తవం...

ప్రయాణం వాస్తవం!

మానవుడు నిరంతరం పయనిస్తూనే ఉన్నాడు.

మధు పెదవులమీద చిరునవ్వు.

ప్రతి మనిషికీ ఇలాంటి ఆలోచనలొస్తుంటాయి.

అంతగా పట్టించుకోరు. రోజువారీ జీవితానికి చెందిన ప్రేరణలూ, అవసరాలే ప్రధానంగా ఉంటాయి. అవే తమని నడిపిస్తుంటాయి.

చూస్తుండగానే 'మనూ' ఊరుదాటిపోయింది.

ఆఫీసులో ఉన్నాడో... లేడో... ఆవేశపరుడు... అందులోనూ సంచలనం కలిగించే నిర్ణయాలు తీసుకుంటానని మొన్న చెప్పాడు.

తీసుకున్నా ఆశ్చర్యంలేదు.

ఇంటికి వెళ్ళగానే... వాకిట్లోనే నవ్వుతూ ఎదురవుతాడేమో!

పరిగెత్తుకొచ్చి, అమాంతం కౌగలించుకొని-

"వచ్చేశా... నేస్తం... గత జీవితపు సంకెళ్ళు తెంచుకొని వచ్చేశా" అంటాడేమో!

మధుకు నవ్వొచ్చింది. ఎంతగా కలల్లో బతకటం ఇది. జీవితంలో అత్యంత వాస్తవికంగా ఆలోచించగలమనుకునేవారు... జీవితంలో జరుగుతున్న విషయాల్ని ఓ క్రమంతో అర్థంచేసుకోగలమనుకునేవారు...

ఎలాంటి ఊహల్లో ఉంటారు!

అందుకే కాబోలు జానకి తరచుగా అంటూ ఉంటుంది-





''ఏమో బాబూ నువ్వు నాకు అర్థం కావు''

ఎలా అర్థమౌతుంది? ఏ సంతోషకరమైన వార్తనో విన్నప్పుడు అమాంతం ఇంటికి దూసుకొచ్చి... జానకి ముందు నిలబడి... మొఖం నిండా సంతోషం నింపుకొని...

''ఈ ప్రపంచం మారిపోతుంది జానకీ''

అనే గొప్ప నినాదం ఇస్తే, వెర్రి ముఖం పెట్టుకోక ఏంచేస్తుంది.

''ఇంతే ఈ సమాజం బాగుపడదు'' అని రాత్రులన్నింటిని ఆలోచనల్తో కరిగిస్తున్నప్పుడు చూసి...

''అది సంతోషం... ఇది మరో భావం'' అని సరిపెట్టుకోగలదు జానకి... లేదా అదే మాట...

''మీరు అర్థంకారు''

ఇప్పుడు సమస్య జానకిది కాదు. 'మనూ' భార్యది.

'మనూ' సృష్టించనున్న సంచలనం అర్థం చేసుకోవటం ఓ జీవితకాలంపాటు ఆమెకు సాధ్యం కాదేమో!

ఓవేళ అర్థంచేసుకున్నా ఆమోదించదేమో?!

ఎవరేమనుకున్నా 'మనూ' ఓ సంచలనం సృష్టించబోతున్నాడు.

ఏమిటా సంచలనం?

* * *

రిక్షా దిగి ఇంట్లోకి నడవబోతుండగా వాకిట్లోనే ఎదురైంది జానకి. మనిషిని చూస్తే అయిదారు రోజులుగా జ్వరంతో మంచం మీద ఉన్నట్లుగా ఉంది.

''ఏమిటలా ఉన్నావ్? ఆరోగ్యం బాగుండలేదా?'' అన్నాడు ఇంట్లోకి నడుస్తూ. జానకి వెనగ్గా లోపలకు నడిచింది.

''ఏమిటంటే మాట్లాడవే'' అన్నాడు మధు తిరిగి.

''మీకీ విషయం తెలియదా?''

''ఏ విషయం?''

''మనోహర్ అన్నయ్య గురించి''

''ఏమైంది? వాడు మళ్ళీ వచ్చాడా?''

''రావటం కాదు- రైల్లోంచి క్రిందపడ్డారట''

''క్రింద పడటం ఏమిటి? చిత్రంగా ఉందే నువ్వు చెప్పే విషయం''

జానకి విస్మయంగా చూస్తూ టెలిగ్రాం అందించింది.

''మనోహర్ ఎక్స్‌పైర్డ్... స్టార్ట్ ఇమ్మిడియట్లీ''

కళ్ళు బైర్లు కమ్ముతుండగా మరోసారి చదివాడు.

నిజమే...!

'మనూ' చచ్చిపోయాడు.

చ.. చ్చి.. పో.. యా.. డు!

మధు చేతిలో నుండి కాయితం జారిపోయింది.

తను అమాంతం క్రింద పడిపోతుకదా అనిపించింది. మెల్లగా మంచం మీద కూర్చున్నాడు.

ఏమిటిదంతా? నిన్నగాక మొన్న కలసి మాట్లాడిన వ్యక్తి ఈ రోజు లేడు. ఇదేనా జీవితమంటే? ఇంత అకస్మాతుగా ఇలాంటి దారుణమైన విషయాలు జరుగుతుంటాయా?

ఆరోజు ఎంతగా ఆరాటపడ్డాడు...

త్వరలో ఓ సంచలనం కలిగించి తీరుతానన్నాడు.

ఇదేనా ఆ సంచలనం?!

ఇందుకోసమే వాడు అంతగా ఆరాటపడింది?

అసలేం జరిగింది?

''మీరు వెళ్ళిన రెండోరోజునే ఈ టెలిగ్రాం వచ్చింది. మీరు ఎక్కడున్నారో తెలియదు. అయినా మీకు తెలుస్తుందనుకున్నాను. మొదట్లో అయితే రైల్లోంచి పడిందెవరో అర్థం కాలేదు. టెలిగ్రాం అనగానే కాళ్ళూ, చేతులూ వణికాయి. నాదంతా ఛాదస్తంగా కొట్టేస్తారు. మొన్న వెళ్ళేటప్పుడు కూడా మీకు చెప్పాను. ముఖ్యంగా అన్నయ్య విషయం నాకు తెలుసు. నా భయాలన్నీ ఏదోరోజు నిజం అవుతాయి'' అంటూనే ఏడ్చింది జానకి.

''ఊరుకో...'' అంటూనే గొంతు గాద్గదికం

కాగా కర్చీఫ్ అడ్డంపెట్టుకున్నాడు మధు.

ఎలా చచ్చిపోయుంటాడు? రైలు క్రింద పడటం ఏమిటి? ఈ నరికి అంతా అయిపోయి ఉంటుంది. తనకు చివరి చూపుకూడా దక్కలేదు. ఆ రోజు 'మనూ' మాట్లాడిన ప్రతి ముక్క తనకు గుర్తుంటుంది. ఈ దేశంలో సగటు మనిషి ఆవేదనకు రూపం అది. ఈ దేశపు మధ్యతరగతి మేధావి అంతరంగిక ఘోష అది. జీవితాన్ని ప్రేమించటం, అనుభూతి చెందటం తెలిసిన వ్యక్తిలోని కోణాలివి.

తాను జీవిస్తున్న ప్రపంచాన్ని మార్చుకోవటానికి పెనుగులాడే ఈ దేశపు బిడ్డ కడపటి ఆర్తనాదం అది.

జీవితంలోనూ, సమాజంలోనూ, వికృతంగా నాట్యం చేస్తున్న ద్వంద ప్రవృత్తిని 'మనూ' ప్రతిబింబించాడు.

బహుశా ఆలోచనల్తో పయనిస్తుండి ఉంటాడు.

ఆ ఆలోచనల్లోనే కాలుజారి ఉంటుంది.

ఎంతటి దారుణమైన, విషాదభరితమైన ముగింపు!

"మీ గురించి నేనెంతగానో ఆరాటపడ్డానండి. మీ మిత్రుడ్ని కనీసం చివరిసారయినా చూసుకుంటారనుకున్నాను. కానీ మీరు ఎక్కడ ఉంటారని రాయను. ఆయన చాలాసేపు బతికే ఉన్నారట. హాస్పిటల్‌కు తీసుకెళ్తున్నప్పుడు మరణించారట" జానకి చెబుతూంది.

వాడి తుదిప్రయాణంలో తనులేడు. అయినా ఎందరో మిత్రులు శోకవదనంతో వాడి వెంట నడిచి ఉంటారు. అశ్రు నయనాల్తో సాగనంపి ఉంటారు. వాడి ప్రయాణంలో పెద్ద మార్పు. ఇంకవాడు ఉండడు. 'మనూ' తో ఇంతకాలం ఉన్నవారంతా ఆ జ్ఞాపకాల్తో తిరిగి ప్రయాణంలో పాల్గొంటారు. మానవుడికి మరణం అత్యంత సహజమైన విషయం.

ఇలాంటి సందర్భాలలోనే 'మృత్యువు' పట్ల భీతికలిగేది.

మధుకు మొదటిసారి-చాలాకాలం తర్వాత కలిగిందదే!

'మనూ' మరణం అత్యంత బాధాకరం. మిగతా విషయాలు వదిలేస్తే వాడి మరణంవల్ల తమ కళ్ళముందు లేడనే కఠోరమైన వాస్తవం వారిని బాధపెడుతోంది. ముఖ్యంగా ఆర్థికపరమైన సమస్యలు వారిని అంతగా పీడించవు. 'మనూ'కు వచ్చే డబ్బులు, అతని వాటాకు వచ్చే ఆస్తి, అతని భార్య సాధారణ జీవితం గడపటానికి సరిపోతాయి.

మరి అలాంటిదే తనకు జరిగి ఉంటే?

ఆలోచించటానికి భయం వేసింది. అవును... ఇప్పుడు తను మరణిస్తే ఏమౌతుంది... ఆఫీస్‌వారు ఓ పదివేలు ఇస్తారేమో. పి.ఎఫ్ క్రింద మూడువేలు రాగలదేమో... వీటితో ఏమవుతుంది? వాటిలో సగందాకా దినాలకే ఖర్చవుతాయి. ఆ తర్వాత ఇద్దరు పిల్లల్తో జానకిని ఊహించుకుంటే... నో! అలా జరగకూడదు... తన పిల్లలు ఆ అవమానాల్ని భరిస్తూ జీవించకూడదు...

'మనోహర్' దినానికి వెళ్ళివచ్చాక వెంటనే లైఫ్ ఇన్స్యూర్ చేయాలనే నిర్ణయానికి వచ్చాడు. అప్పటివరకూ ఎల్.ఐ.సి. ఏజంట్లపట్ల విముఖత ఉండేది. వారెప్పుడూ మరణాన్ని గుర్తు చేస్తుంటారని, తమ ఆదాయంకోసం జనాన్ని పీడిస్తుంటారని నమ్మేవాడు. అలాంటిది వెంటనే ఓ ఏజెంట్‌ను కలవాలని ఆరాటపడ్డాడు.

రెండురోజులదాకా ఎవరూ దొరకలేదు. మామూలు రోజుల్లో అయితే రెండు ఇన్‌స్టాల్‌మెంట్స్ మేమే కడతాం అంటూ వచ్చేవారిని చూసి నవ్వుకునేవాడు. అలాంటిది ఆ రెండురోజులూ ఓ రకంగా నరకం అనుభవించాడు. ఈలోపు తనకేమైనా జరిగితే తన కుటుంబం ఏమైపోతుంది? వారి భవిష్యత్ ఏమిటి?

అప్పుడే ఎవరో దొరికారు... అతనో ఆపద్బాంధవుడులా కనిపించాడు. ఇరవైవేలరూపాయలకు ఇన్స్యూర్ చేసి, మొదటి ప్రీమియం చెల్లించి రశీదు తీసుకున్నాకగాని తృప్తికలగలేదు.

ఆ తర్వాత మరికొన్నిరోజులకుగాని మామూలు ప్రపంచంలో పడలేదు. ఆ తర్వాత 'మనూ' మరణం బాధాకర స్మృతిగా మిగిలిపోయింది. దైనందిన జీవితంలో కొత్త కొత్త మిత్రులు... భావాలు... ప్రయాణం... మామూలే.

మరి జానకి ఎందుకు తిరిగి మామూలు





మనిషి కాలేకపోయింది? ఆ సంఘటన ఇంకా ఆమెను వెంటాడుతూనే ఉందా? ఎందుకంతగా ఆమె కదిలిపోయింది? తను ఎక్కువగా ప్రయాణాలు చేస్తున్నమాట వాస్తవమే. అయినా తను జాగ్రత్తగానే ఉంటున్నాడు. మరి జానకి ఎందుకు మామూలు మనిషి కాలేకపోతోంది?

ఎందుకు?

★ ★ ★

జానకి ఆలోచనల్లోకి భరద్వాజగారొచ్చారు. ఆయన రంగారావుగారి అల్లుడు. జానకిక్కి అన్న అవుతారు. ఎక్కువగా అందరూ వివాహ సందర్భాల్లోనో, ఎవరైనా మరణించినప్పుడో, మరో సందర్భంలోనో కలుసుకుంటుంటారు. రెండు రోజులు, సరదాగా గడిచిపోతాయి. ఆ తర్వాత ఎవరిగూటికి వారే ఇంటికి తిరిగి వచ్చినా గుర్తుండే వ్యక్తుల్లో భరద్వాజ ఒకరు.

జానకి తన భావాలు చెప్పుకోవటానికి ఆయనే సరయిన వ్యక్తిలా అనిపించారు. అయితే ఆయన్తో ఓ ఇబ్బంది ఉంది. ఆయన చెప్పేది ఎవరికీ అర్థమయ్యేది కాదు. కానీ అందరికీ అర్థమైన విషయం ఒకటే-

"ఆయన గొప్ప తాత్వికుడు. ఎంతగానో ఎదిగాడు"

ఒకసారి ఆయన దగ్గరికి వెళ్ళివస్తే బాగుండుననిపించింది జానకికి. మొన్న గుంటూరు వెళ్ళినప్పుడు ఎందుకో ఆయన కలవలేదు. బహుశా తాము వచ్చాక వెళ్ళే ఉంటారు. తను కూడా ప్రభుత్వ ఉద్యోగం చేస్తున్నారు. ఆయన ఇంటినిండా కొన్ని వేల రూపాయల విలువ చేసే పుస్తకాలున్నాయి. ఆయన 'మదర్'ను విశ్వశిస్తారు.

'మదర్' ప్రవచించిన తత్వాన్ని వెలుగులోకి తేవటం తన ఆశయం అంటాడాయన.

ఆయన చెప్పే విషయాలు అర్థమైనా కాక పోయినా ఆయన్తోపాటు 'మదర్' ఆశ్రమంలోకి తాము కూడా వస్తామంటారు అత్తలందరూ. ఆయన అందరితో చిరునవ్వుతో మాట్లాడతాడు. ఈ ప్రపంచమంతా 'మదర్' ప్రతిబింబమంటాడాయన. కోపం, భయం, భక్తి, మోక్షం ఇలా ఏ విషయంవల్లనయినా అనర్గళంగా మాట్లాడగలడు.

ఎవరిదైనా పెళ్ళి వస్తే బాగుండును అనుకొంది జానకి. అలాంటి సమయాల్లో అందరూ కలుస్తారు కాబట్టి. ప్రత్యేకంగా వెళ్ళాలని ఉన్నా ఇంకా ఆలోచించే స్థితిలోనే ఉన్నారు.

ఆలోచిస్తూ పనిచేసుకొంటున్న జానకి ఆశ్చర్యపోయింది.

భరద్వాజ తాపీగా నడుచుకుంటూ వస్తున్నారు.

అంతులేని సంతోషం కలిగిందాక్షణం.

"వంద సంవత్సరాలు నువ్వు జీవిస్తావన్నయ్యా... ఇప్పుడే నీ గురించి అనుకుంటున్నాను. ఓ రకంగా నిన్ను పిలిచాననుకుంటున్నాను" అంది నీళ్ళు అందిస్తూ.

నవ్వుతూ అన్నాడాయన:

"పిలిచేదెవరు పిలిపించేదెవరు... అంతా ఆ 'మదర్'" టవల్‌తో తుడుచుకుంటూ లోనికొచ్చాడు.

కాఫీ తాగుతూ చెప్పాడు:

"ఈ ఊర్లో ఆఫీస్‌పనొకటి తగిలిందమ్మా. ఇక్కడికెటూ వచ్చాం కాబట్టి ఓ సారి చూసిపోవాలని వచ్చాను."

"మావయ్యగారికెలా ఉందన్నయ్యా?"

"మామూలేనమ్మా... ఆయన ఇదివరకు మావయ్య కాదు. ఇప్పుడాయన చాలా మారిపోయారు. ఆయన్ని తిరిగి మన ప్రపంచంలోకి తేవటం ఆ పాక్స్‌వల్ల అవుతుందని భావిస్తున్నారు. వారి ప్రయత్నం వారు చేయటంలో తప్పు లేదనుకో"

"అంటే వాటివల్ల ఉపయోగం ఉండదా అన్నయ్యా?"

"ఏం చెప్పమంటావ్ జానకీ... మావయ్యకు జబ్బు చేసింది శరీరానికి కాదమ్మా... మనసుకి. మనసుకు పట్టిన రోగాల్ని మందులు బాగుచేయలేవు తల్లీ"

"మరేం చేయాలంటారు?"

ఆయన ప్రశాంతంగా నవ్వి చెప్పారు:

"ఈ ప్రపంచంలో ప్రతి సమస్యకూ సమాధానం 'మదర్' మాత్రమే. 'మదర్' గురించి తెలుసుకోవటం అంటే ఈ ప్రపంచాన్ని గురించి తెలుసుకోవటం. 'మదర్'ను ఆరా

ధించటం అంటే ఈ ప్రపంచాన్ని ఆరాధించటం. 'మదర్'ను ప్రేమించటం అంటే ఈ ప్రపంచాన్ని ప్రేమించటం. మావయ్య తన మానసిక ప్రపంచంలో తన కుటుంబాన్నే నింపుకున్నాడు.

అందుకే ఆయనకన్ని బాధలు. తన పిల్లలు ఏమైపోతారో... వారికి మంచి హోదా లభించదేమో... ఇలాంటివే లౌకికపరమైన సమస్యలు. ఇవన్నీ ఆయన్ను పీడిస్తున్నాయి. ఆ ఆలోచనలు ఆ మెదడును తాకిన మరుక్షణం ఆయన ఓ రకమైన పిరికితనంలోకి జారిపోతారు. దీన్ని వాళ్ళు 'డిప్రెషన్' అంటారు. అందుకే షాక్స్ ఇస్తుంటారు. అందువల్ల కొద్దిగా ఫలితం ఉంటుందేమో... కానీ జానకీ! వాళ్ళు ఓ పని చెయ్యగలరా?''

ఏమిటన్నట్లు చూసింది జానకి.

''ఆలోచనను ఆపటంవారివల్ల అవుతుందా? మనం ఈ లౌకిక ప్రపంచపు అనుభవాలనుండి, అనుభూతులనుండి క్రమంగా దూరమౌతూ 'మదర్'లో ఐక్యం కానిదే ఈ ప్రపంచం ఎదుర్కొంటున్న సమస్యలకు పరిష్కారం అంటూ లభించగలదా?'' అన్నాడు కప్పు కిందపెడుతూ.

జానక్కి ఆయన చెబుతున్నదేదో అర్థమౌతున్నట్లుగానే ఉంది. అంతలోనే ఏదో అస్పష్టంగా ఉన్నట్లు అనిపిస్తుంది. ఇంకా బాగా, ఇంకా సరళంగా అర్థమయ్యేటట్లు చెప్పగలిగితే బాగుండుననిపిస్తుంది. అయితే ఒకటిమాత్రం జానకి భావించింది. ఆయన చెప్పేదాంట్లో తనకు కావలసిందేదో ఉంది!

జానక్కి అర్థంకానిది 'భరద్వాజ'గారి భాష మాత్రమే కాదు. 'మధు'ది కూడా. వీళ్ళంతా ఓ ప్రత్యేకతరహా భాషలో మాట్లాడుతారు. వారేం చెబుతున్నారో ముందు అర్థమయితే తర్వాత అంగీకరించటమా లేదా అనేది.

ఈరోజు అలాకాదు. తను తన సర్వశక్తులూ ధారపోసయినా అర్థం చేసుకోవటానికి ప్రయత్నం చేస్తోంది. తనకు అర్థంకాని విషయాల్ని ప్రశ్నిస్తోంది కూడా!

''అన్నయ్యా... భయం అంటే ఏమిటి?'' అంది జానకి.

''నువ్వు వేసిన ప్రశ్న మీద కొన్నివేల పేజీలు రాయవచ్చునమ్మా. అంతటి పెద్ద ప్రశ్నకు నీకు అర్థమయ్యేలా, నచ్చేలా జవాబు చెప్పటం సామాన్య అంశంకాదు. అయినా చెబుతాను. ఎందుకో తెలుసా? నీలో తెలుసుకోవాలనే జిజ్ఞాస ఏర్పడింది కాబట్టి. అయినా నీలో ఈ గొప్ప మార్పు రావటం ఏమిటి? నాకు ఇక్కడ ఈ క్షణం పనిబడటం ఏమిటి? ఇదంతా ఏమహత్తరమైన కార్యక్రమానికో నాంది కాబోతూంది. నాకు చాలా సంతోషంగా ఉందమ్మా'' అన్నాడాయన సర్దుకుంటూ.

''సరే... భయం అంటే ఏమిటని నీసందేహం. ఈ విషయంలో ఇదీ అంటూ నిర్వచనం లేదమ్మా... మానవ జీవితంలో అనేక రకాల భయాలున్నాయి. అంతవరకు వాస్తవం. నా వరకు నేననుకోవటం. వాస్తవాన్ని దాచటం వల్ల కలిగేది భయం. ఇదోరకం. మామూలుగా భయం అంటే శారీరకమైన భయాలగురించే మనం మాట్లాడుకుంటాం. భయానికీ, చీకటికి అవినాభావ సంబంధం ఉంది. చీకటి అంటే అజ్ఞానం కూడా. అజ్ఞానం కొన్ని భయాల్ని తెస్తుంది.

మనం కొన్ని విషయాలగురించి తెలుసుకోకుండానే భయపడుతుంటాం. ఆ విషయం లోతులకు వెళ్తున్నకొద్దీ మనకున్న భయాలు అంతం కావచ్చు. పాముల్నిచూసి, క్రూర జంతువుల్ని చూసి ఇంకా ఇలాంటి భయాల్ని ప్రతిమనిషీ కలిగి ఉంటాడు. కొంత మంది ఇందుకు భిన్నంగా ఉండవచ్చు. అయితే ఇలాంటి భయాలవల్ల పెద్దనష్టం ఉండదు. ఎందుకంటే ఇవి రోజువారి జీవితంలో మనల్ని బాధించవు. కానీ శారీరక భయాలకు వ్యతిరేకమైన మానసిక భయాలున్నాయి. అవి మనల్ని భయపెట్టడమేకాదు ఎందుకూ పనికిరాకుండా చేస్తాయి. మనం జాగ్రత్త వహించాల్సింది ఆ భయాలగురించే

ఇంకా జాగ్రత్తగా ఆలోచించిచూడు. మన స్వార్థమే మన భయం. మన స్వార్థంకోసం మనం రకరకాల పనులు చేస్తుంటాం. వాస్తవాల్ని దాస్తుంటాం. మొఖానికి చిరునవ్వులు పులుముకుంటాం. అయితే మనలో మరో మనిషి ఉంటాడు. మనం చేస్తున్న ప్రతి ఒక్క






# ఆ తీవ్రమైన తలనొప్పికి కావాలి అమృతాంజన్ స్ట్రాంగ్

పగిలిపోయే తలనొప్పులకి, తట్టుకోలేని వెన్ను నొప్పులకి మరియు బెణుకులకి కావాలి అమృతాంజన్ స్ట్రాంగ్ — విశ్వసనీయమైన అమృతాంజన్ సంస్థ నుంచి తెల్లని బామ్. దీని వెనుక నొప్పులకి సురక్షితంగానూ, త్వరగానూ ఉపశమనం కలుగచేసే సుమారు నూరు సంవత్సరాల అనుభవం వుంది.






**అమృతాంజన్**
**స్ట్రాంగ్**

భరించలేని నొప్పులకు, బాధలకు

అమృతాంజన్ లిమిటెడ్ 

O&M 1736 TEL

పనినీ ఆ మనిషి సమీక్షచేస్తాడు. తీవ్రంగా విమర్శిస్తాడు. ఆ విషయం తనకు తెలుసు. అందుకే ఏ మనిషయినా వేరెవ్వరికంటే తనకే ఎక్కువ భయపడతాడు. అంతేకాదు భయానికి మరో రూపం పిరికితనం కూడా- ఏమంటావ్?'' అన్నారు భరద్వాజ.

జానకికి ఇప్పుడేదో అర్థమౌతున్నట్లే ఉంది. ఇదివరకటి అయోమయం లేదు.

''చెప్పండన్నయ్యా'' అంది.

''భయం అనేది మనజీవితానికి చెందిన ఓ కఠినమైన సమస్య. మనమందరం భయభారంతో కృంగిపోతున్నాం. భయం ఒక పెనుభూతం. అది మనకు రకరకాల లక్షణాల్ని ఆపాదిస్తుంది. భయంవల్లనే దౌర్జన్యం ప్రబలుతుంది. అలాగే కుటిలత్వం కూడా. ఇలాంటివే మరో మరో లక్షణాల్ని తెస్తాయి. మన మనసులో పాతుకుపోయిన భయాన్ని, భీభత్సాన్ని అర్థంచేసుకుంటే శారీరకసంబంధమైన భయాలు మనల్ని ఇబ్బంది పెట్టలేవు. స్పష్టంగా చెప్పాలంటే భయం విడిగా ఉండదు. అది దేనితో ఒకదాంతో ముడిపెట్టబడి ఉంటుంది. ఉదాహరణకు నీగురించే తీసుకో. నీకేం భయాలు లేవా... తప్పకుండా ఉంటాయి. మీకు చాలాకాలం ఉద్యోగం దొరకలేదు. అసలు ఉద్యోగమంటూ దొరుకుతుందా అని ఓ భయం. దొరికిందనుకో అది నిలుస్తుందా అని భయం. అలాగే మరికొంతకాలం గడిస్తే పిల్లలగురించి భయం... వారి భవిష్యత్ ఏమిటని.... పిల్లల పెళ్ళిళ్ళు అవుతాయి. తర్వాత వారు మనని చూస్తారా లేదా అనే భయం. ఇలా మనం పుట్టినదగ్గర్నుండి మరణించేదాకా ఎన్నెన్నో భయాలు. అసలు మరణమే ఓ భయం. ఇవన్నీ ఓ ఎత్తు... అవలా ఉంచుదాం. నిన్ను ఓ భయం పీడిస్తుందనుకో నువ్వేం చేస్తావో చెప్పు'' అన్నారాయన.

జానకికి ఏంచెప్పాలో అర్థంకాలేదు. వాస్తవానికి అలాంటి ప్రశ్నకు జవాబు కోసమే తను ఎదురుచూస్తోంది.

''నీ భయాలగురించి నువ్వు ఆందోళన చెందుతావు. ఆ భయాలకు దూరంగా పారిపోవాలనుకుంటావు. కానీ నువ్వలా అనుకున్నకొద్దీ అవి నిన్ను వెంటాడుతాయి. వాటికి దూరంగా ఉండాలని ప్రయత్నించినంతకాలం అవి నీ పక్కనే ఉంటాయి. నీకు స్పృహ ఉంది. అంటే నీ మెదడు ఉంది. అది భయాల్ని లొంగదీయాలని ప్రయత్నిస్తుంటుంది. నీ భయాలకు వ్యతిరేకంగా నిన్ను నిలబెట్టడానికి కృషి చేస్తుంది. ఇందువల్ల జరిగేదేమిటో తెలుసా? నీ జ్ఞాపకశక్తి క్రమంగా అంతరించి పోతుంది. అంటే నీకు నీరసాలు, నరాల జబ్బులూ ఇలాంటివి రావచ్చునన్న మాట. మనవాళ్ళని చూస్తున్నావుకదా... వాళ్ళకెప్పుడూ నరాలు లాగుతుంటాయి. కీళ్ళనొప్పులు... ఊరికే అలసట... చెమటలు పడుతుంటాయి. ఇవన్నీ భయం తాలూకు లక్షణాలే జానకీ. ఇంకొంచెం లోతుకు వెళ్దాం. ''చావు'' అనే మాట మనకు గొప్ప భయం కలిగిస్తుంది. అసలు ఆ ఆలోచన మెదడులోకి రాగానే ఓ రకమైన కంపరం పుడుతుంది. ఎందువల్ల?

మీరు అంతకుముందు అనేక మరణాలు చూసి ఉండవచ్చు. నువ్వు రేపో మాపో చచ్చిపోతావనే ఓ ఆలోచన సైతం వస్తుంటుంది. అది వాస్తవం కూడాను! అయితే నువ్వు భయపడేది మరణం గురించేకాదు. మరణం తెచ్చే రకరకాల సంఘటనలు... మార్పుల గురించి అవునా?''

''ఈ నడుమ నాకు చిత్రమైన ఆలోచనలు వస్తున్నాయి అన్నయ్యా. ముఖ్యంగా బస్సులో ప్రయాణం చేయాలంటే భయంగా ఉంటుంది. అందుకే ఎప్పుడూ ట్రైన్‌లోనే ప్రయాణం చేస్తుంటాను. అంతేకాదు బస్‌లో నేనొక్కదాన్నే ప్రయాణం చేస్తుంటే అదెక్కడన్నా పడిపోతుందేమో అనే ఆలోచనకంటే ఈ బస్‌లో నాతోపాటు ఆయనా, పిల్లలూ లేరుకదా అనే తృప్తి ఉంటుంది. కానీ మేమందరం కలిసి బస్సులో ప్రయాణం చేస్తుంటే మాత్రం ఏమైపోతామోననే భయం కలుగుతుంది''

''ఇంకా ఏమేం భయాలు నీలో కలుగుతున్నాయో చెప్పు?'' అన్నారు భరద్వాజ పరిశీలనగా చూస్తూ.

''ఈ నడుమ ఆయన ఎక్కువగా ప్రయాణా




లు చేస్తున్నారు. ఆయన ఇంటిదగ్గరనుండి బయలుదేరింది మొదలు తిరిగి ఇంటికి వచ్చేంతవరకూ ఆందోళనగా ఉంటుంది. నాది భయమే. ఈ విషయం చెబితే ఆయన నవ్వులాటగా కొట్టేస్తారు. అంతదాకా ఎందుక న్నయ్యా... ఆయన స్నేహితుడొకాయన ఆ నడుమ రైలు ఏక్సిడెంటులో చనిపోయారు. అప్పుడు తనెంతగా భయపడిపోయారో. రెండు రోజులు బాగా ప్రయత్నించేసి ఓ ఇరవైవేల రూపాయలకు ఇన్స్యూర్ చేశారు. ఓ రాత్రి పడుకున్నాక 'ఇప్పుడు కొంచెం తృప్తిగా ఉంద న్నారు'. అప్పుడుగాని ఆయన తేరుకోలేదు. అదే నాభయం గురించి చెబితే ఎగతాళిగా ఉంటుంది''

''అది సహజమేనమ్మా. ఒకరి భయాలు మరొకరికి వింతగా ఉండొచ్చు. ఒకరు ఓ విషయానికి భయపడితే మరొకరు ఇంకో విష యానికి భయపడవచ్చు. తమకు భయం ఉందనే విషయం ఆ క్షణంలో వారు మరిచిపో తారు. తన మిత్రుడి మరణం తర్వాత తన పిల్లలు అనాథలవుతారనుకున్నప్పుడు ఆయ నకు ఎల్.ఐ.సి అవసరమైంది. దాంతో ఆయ నకు తన సమస్య తీరిపోయింది. ఇంకేదో కొత్త సమస్య వస్తేకదా కొత్త భయాలు వచ్చేది'' అని నవ్వాడాయన.

మరి ఇలాంటి ఆలోచనలన్నింటికి దూ రంగా ఉండాలనుకుంటాను. కానీ నాకు సాధ్యంకావటంలేదన్నయ్యా. నన్నేం చేయ మంటావు చెప్పు?'' అంది జానకి.

''తిరిగి ఇదో పెద్ద ప్రశ్నమ్మా... ఆలోచనకు ఎంత గొప్ప శక్తి ఉందో అంతకంటే వ్యతిరేక మైన స్థితి ఉంది. ఒక్కో సందర్భంలో ఆలోచ నారహితంగా ఉండటం అవసరం. సైనికులు న్నారు. వారికి ఆలోచనలు ఉంటే ఆ పని చేయలేరు. ఉరితీసే తలారి ఉన్నాడు. అతని కి ఆలోచన ఉంటే ఉరితీయలేడు. ఓ రకంగా వారు టూల్స్ అంటే పనిముట్లులాంటివారు- ఏం చెబితే అది చేయాలి. ఎందుకు వారలా చేస్తున్నారు? తమ దేశంకోసం. తమ కడుపు నింపుకోవటంకోసం కాదా అనొచ్చు. అదికూడా ఉంటుంది. కానీ అదొక్కటేకాదు. ఓ లక్ష్యం ఏదో ఉంటుంది.

అంటే వారు ఓ శక్తికి లొంగిపోయారన్న మాట

అలాగే నువ్వుకూడా నీ ఆలోచనల్ని జయించాలంటే ఒకటే మార్గం. మనం ఓ శక్తికి లొంగిపోవాలి. అప్పుడే మన హృదయ కవాటా లు తెరుచుకుంటాయి. హృదయం విశాలమై నంత మాత్రాన చాలదు. మనల్ని మనం అంకితం చేసుకోవటానికి సిద్ధంగా ఉండాలి. అంటే ఆ 'డివైన్‌పవర్'కు మనల్ని మనం అర్పించుకోవాలి. ఆ శక్తినే మనం 'మదర్' అంటున్నాం. నువ్వు 'మదర్'ను తెలుసుకోగలి గినప్పుడు ఈ లౌకిక ప్రపంచపు బాధలు నిన్నేమాత్రం కదిలించలేవు. అర్థమవు తోందా ?''

జానకి తలూపింది.

''అయితే అన్నయ్యా... ఈ మందులూ... ఈ ఆసుపత్రులూ ఇవన్నీ ఏమిటి?''

''ఇవన్నీ తాత్కాలిక పరిష్కారాలమ్మా. ఇవేవీ శాశ్వత పరిష్కారాలు అందించలేవు. అందుకే మనం మన రోగాలనుండి, మన భయాలనుండి తాత్కాలికంగానే విముక్తి చెందుతున్నాం. వాటన్నింటికి శాశ్వతమైన పరి ష్కారం కావాలి. అందుకు మనం అన్వే షించాలి. ఈ ప్రపంచానికి ఆధారం ఏమిటి? భావం... ఆ భావం ఏమిటో తెలుసుకోవాలి. ఆ భావంతో మనం మమేకం కావాలి. ఆ భావాన్నే మనం 'మదర్' అంటున్నాం. అంటే 'మదరే' మనం... మనమే 'మదర్' కావాలి'' అన్నారా యన.

''మీకు ఈ పుస్తకాలు చదవాలని, 'మదర్' గురించి తెలుసుకోవాలని ఎప్పుడు అని పించింది?'' అంది జానకి.

''భలే ప్రశ్న అడిగావమ్మాయ్... ఈ రోజున నీ విషయమే చూడు. నీకేమనిపించింది. నాగు రించిన ఏదో ఒక ఆలోచన వచ్చింది. నా విషయం కొంత భిన్నంగా ఉంటుందనుకో. నాకు పది సంవత్సరాల క్రితం వరకూ మదర్ అంటేనూ, అరబిందో అంటేనూ తెలియదు. అయితే చిన్నతనం నుండి మా కుటుంబంలో పద్ధతులవల్ల ఆధ్యాత్మిక చింతన అంటూ అలవడింది. సరిగ్గా అరబిందో తనని తాను

సమాధి స్థితిలోకి ప్రవేశ పెట్టుకున్ననాడు నాలో ఏదో జ్ఞాననేత్రం తెరచుకుంది. నాకేదో ఆరాటం... దేని గురించో తెలుసుకోవాలని పించింది. అప్పుడే 'అరబిందో' గురించి విన్నాను. ఆయన మానవజాతికి అందించిన అపారవిజ్ఞానపు లోతులకు వెళ్ళినకొలదీ నా మనస్సు మరింత ఎదుగుతూ వచ్చింది. ఆయన చెప్పిన తత్వం ఓ శాస్త్రం. అది అనంతమైనది. అయితే అది ఓ ముద్దలా ఉండిపోయింది. ఆ క్లిష్టతను విడగొట్టి మీ లాంటివారికి అర్థమయ్యేటట్లు చెప్పగలిగితే.. ఎంత అద్భుత ఫలితాలుంటాయో'' అన్నాడా యన పారవశ్యంగా.

''మరి ఈ 'మదర్' ఎవరు?''

''అరబిందో భావాలు ఆమెను ప్రభావితం చేశాయి. ఆమెది భారతదేశం కాదు. కానీ వారి భావాలు ప్రచారం చేయటానికి ఇక్కడకు వచ్చారు.''

''ఆమె ఇప్పుడులేరా?''

''లేరు... ఆమె కూడా సమాధి స్థితి పొందా రు''

''అంటే చచ్చిపోవటం కాదా?''

''చావా...! చావనేది శరీరానికి - ఆత్మకి కాదు. వారు తమ శరీరాల్ని తాము విడిచిపెట్టా రు. వారు సమాధి స్థితిలోకి వెళ్ళారు. అలాంటి మహనీయులకి మరణం ఉండదు. వారి అనంతమైన బోధనలకు మరణం ఉండదు. అవి నిత్యం... అవి సత్యం'' అన్నాడాయన తాదాత్మ్యంతో.

ఆయన పూనకం వచ్చినట్లుగా జానకికి ఉపదేశించటం ఆరంభించాడు.

''చూడమ్మా...నీలో ఓ జిజ్ఞాస... ఆరాటం కలిగాయి. నీ జ్ఞాననేత్రం తెరుచుకుంటోంది. నువ్వు సత్యాన్వేషణ కోసం బయలుదేరాలి. ముందు సత్యం అంటే ఏమిటో తెలుసుకో. ఈ ప్రపంచంలో శాశ్వతమైనది అంటూ ఏదీ లేదు. అంతా భ్రాంతి మాత్రమే. అందుకే నిన్ను నువ్వు 'మదర్'కు అర్పించుకో. ఆమె అనంతమైన శక్తిపట్ల విశ్వాసం పెంచుకో. ఆమె అస్తిత్వాన్ని అంగీకరించు. అప్పుడు నీలోనూ అద్భుత శక్తులు వస్తాయి. ఈ ప్రపంచం తాలూకువేవీ నిన్ను ఇబ్బంది పెట్టలేవు. నువ్వు క్రమంగా 'మదర్'ను అర్థం చేసుకుంటావు. క్రమక్రమంగా 'మదర్'లో నిన్ను నీవు ప్రతిష్టించుకుంటావు''

జానకి ఆయనకేసే చూస్తుండిపోయింది.

ఆయన అలా కళ్ళు మూనుకునే ఉండిపోయాడు. ఆయన మాటలు ఆగిపోయాయి. కానీ ఆయన మాత్రం కళ్ళు తెరవలేదు. కొద్దిసేపు పెదవులు కదులుతూనే ఉన్నాయి.

అయితే ఎలాంటి శబ్దమూ రాలేదు.

ఆ తర్వాత పెదవులు కదలటం మానేసాయి.

ఆయన జ్ఞాన సముద్రంలో మునిగిపోయిన ఋషిలా ఉన్నాడు.

ఆయన్ని పలకరించాలంటే జానక్కి భయం కలిగింది.

అందుకే 'భరద్వాజ'ను అలానే చూస్తుండి పోయింది. పది నిముషాల తర్వాత మెల్లగా కళ్ళు తెరిచాడు.

''స్నానం చేస్తారా అన్నయ్యా''అంది.

''చేస్తానమ్మా'' అన్నారు భరద్వాజ.

మధ్యాహ్నం మధు ఇంటికి భోజనానికి వచ్చాడు. బావగార్ని చూడగానే ఎక్కడలేని ఉత్సాహం వచ్చింది.

''ఏం బావగారూ... ఎప్పుడు రావటం? అసలు మీరు మా ఇంటిని దర్శించటమే ఈ ప్రపంచపు వింత'' అన్నాడు వస్తూనే.

భరద్వాజ హాయిగా నవ్వారు.

''ఇంతకూ భోజనం చేశారా?''

''ఎక్కడండి... మీకోసం చూస్తున్నాం. చేతులు కడుక్కురండి నేను వడ్డిస్తాను'' అంది జానకి.

మధు వెళ్ళి కాళ్ళూ చేతులూ కడుక్కొని వచ్చాడు.

జానకి ఇద్దరికీ వడ్డించింది. మధు ఏదో విషయం మాట్లాడుతూనే అన్నం కలుపుకొని తినటం ప్రారంభించాడు.

ఎందుకో బావగారికేసి చూశాడు.

అప్పటికింకా ఆయన భోజనం ఆరంభించ లేదు.




చేతులు ముద్దను చేస్తుంటే ఆయన పెదవులు మాత్రం ఏదో మంత్రాన్ని ఉచ్ఛరిస్తున్నాయి. మధుకి నవ్వొచ్చింది.

జానకిని చూడమని సైగచేశాడు.

జానకి కోపంగా చూసింది.

మధుకు తన చిన్ననాటి సంఘటన గుర్తొచ్చింది.

తన అమ్మమ్మ కూడా భోజనానికి కూర్చున్నప్పుడు మొదటి ముద్దను మంత్రించి కళ్ళకు అద్దుకొనిగాని తినేదికాదు. అమ్మమ్మ మంత్రం చదివి నోట్లో పెట్టుకోబోతున్నప్పుడు అడిగేవాడు. ఒకటి రెండుసార్లు అమ్మ కోప్పడింది కూడా- 'నోటిదగ్గర ముద్దను తీసుకుంటావేమిటిరా' అని.

అమ్మమ్మ మాత్రం నవ్వుతూ అందించేది.

ఆ తర్వాత మామూలుగా తింటుంటే అడిగేవాడు-

"ఈసారి మంత్రం పెట్టలేదే"

అప్పుడూ అమ్మమ్మ నవ్వేది.

"నువ్వు మంత్రంపెట్టిన ముద్ద తింటే నేను గొప్పవాడినైపోతాను కదూ"

తర్వాతకాలంలో గొప్పవాడు కాలేదుగానీ- దేవుడు లేడనే నిర్ణయానికి వచ్చాడు.

తనను గురించి తలుచుకుంటే ఆశ్చర్యం.

చిన్నప్పుడు ఎంతభక్తుడో... ఇప్పుడింత నాస్తికుడు.

అయితే జానకి విషయంలో అంత కఠినంగా ఉండడు.

అయినా మధుకు ఇష్టంలేని పనులుచేయటం జానకి స్వభావానికి విరుద్ధం. అందుకే ఆ ఇంటిలో బహిరంగంగా విగ్రహాలుండవు. ఏదో ఓ మూల వినాయకుడో, వెంకటేశ్వరుడో ఉంటారు. ఏ పండగలొచ్చినప్పుడో తలంటు పోసుకొని, ఆ పటాలకు నమస్కరించి కొబ్బరికాయ కొట్టడంతో ఆ కార్యక్రమం ముగుస్తుంది.

పిల్లలకూ ఈ విషయంలో అంతగా ఇంట్రెస్ట్‌లేదు. ఓ రకంగా ఆ ఇంట్లో భగవంతుడి గురించి ఆలోచించేది జానకి మాత్రమే. బావగారు భోజనానికి ఉపక్రమించగానే అడిగాడు మధు:

''ఏం బావగారూ... మంత్రించిన భోజనాన్నే మీరు తీసుకుంటారా?''

''అదేమిటయ్యా అలా అంటావ్. ఎవరి నమ్మకాలు వారివి. నాకు తెలిసినాయన ఒకాయన ఉన్నారు. ఆయనకు మృణాల్‌సేన్ అంటే ఇష్టం. భగవంతుడంటేనే ఇబ్బంది. వాళ్ళమ్మాయి ఆయన టేబుల్ అద్దంకింద దేవి ఫొటో పెట్టింది. రోజూ హాయిగా దానిమీద కాళ్ళుపెట్టుకొని పేపర్ చదువుకునేవాడు. ఓ రోజు కాళ్ళుపెట్టబోతూ ఆగిపోయాడు. అక్కడ మృణాల్‌సేన్ ఉన్నారు. వెంటనే ఆయన కాళ్ళు వెనక్కి లాక్కుని లెంపలేసుకున్నారు. అయ్యా... ఆయనేం విగ్రహారాధకుడుకాదు. అలాగే ఎవరి నమ్మకాలు వారివి. ఇతరుల్తో మీరు ఏకీభవించినా, తిరస్కరించినా వాళ్ళ భావాలు వారివని వదిలేయండయ్యా'' అన్నాడాయన.

''అదికాదు బావగారూ... మీరేమైనా దానికి సైంటిఫిక్ రీజనింగ్ ఇస్తారేమోనని అడిగాను''

''నేను జానకికి అయితే రీజనింగ్ ఇస్తానయ్యా. ఆవిడ అంగీకరించినా అంగీకరించకపోయినా ఆమెకు నామీద వ్యతిరేకత లేదు. మరి నీకో... కొన్ని భావాలున్నాయి. నా రీజనింగ్‌ను నువ్వేటూ ఆమోదించవు. నీతో చర్చవలన నాశక్తి హరించుకుపోవటం తప్పితే లాభంలేదోయ్. మన దారులేవేరు'' అన్నారు భరద్వాజ.

''అది నిజమే అనుకోండి. నాలాంటివారిని కూడా మార్చవచ్చుకదా''

''లేదయ్యా... ఇంకా అలాంటి స్థాయికి నేను రాలేదు. నేనేదో నా గొడవలో ఉన్నాను. అయినా మనం నేర్చుకునేవాళ్ళకు నేర్పుతాంగానీ నటించేవారికి ఏం నేర్పగలం?''

''ఇదేంటి బావగారూ... ఇలా పాడుస్తున్నారేమిటి?''

కబుర్లు చెప్పుకుంటూ భోజనాలు పూర్తిచేశారు.

తర్వాత సంభాషణ పెళ్ళిళ్ళమీదకెళ్ళింది. ఈలోపు జానకి వచ్చింది.

''ఏం బావగారూ- ఈ సంవత్సరమైనా మాకు పప్పు భోజనం పెట్టిస్తారా లేదా?'' అన్నాడు మధు.

''ఏం పప్పు భోజనమో ఏమోనోయ్... మనం సంపాదించిందేమీ కనపడటంలేదు. ఇప్పుడు కుర్రాళ్ళను చూస్తే ఏమీ అందేటట్లు లేరు. సరే- మా పెద్దమ్మాయిని మీ తమ్ముడికి ఇద్దామనుకుంటున్నాం. రెండోపిల్ల విషయం తలుచుకుంటేనే భయంగా ఉందయ్యా. ఇదిగాక పిల్లాడు చదువుకొచ్చాడు. వాడికేమో ఇంజనీరింగ్ సీటు వచ్చేట్లుంది. ఈ ఖర్చులన్నీ ఎలా భరించాలా అనేదే ప్రస్తుతం మా సమస్య'' అన్నారాయన.

జానకి దిగ్భ్రాంతి చెంది వింటుండిపోయింది.

''దానికి భయమెందుకులే బావగారు. మనకు తగినవాడు మనకొస్తాడు''

''నీకేమయ్యా ఇద్దరూ మొగపిల్లలు. నువ్వు ఎన్నయినా చెబుతావు. మేం ఆడపిల్లల్ని కన్నాం. మా గుండెలమీద కుంపటిలా ఎదిగారు. ఇప్పటిదాకా మేం ఆనందంగా బతకటానికి అలవాటుపడ్డాం. సమస్యలన్నీ వచ్చి ఇప్పుడు కూర్చున్నాయి. ముందు వీళ్ళందరినీ గట్టెక్కించితే చాలు''

''ఆ తర్వాత మీ కార్యక్రమం ఏమిటి?''

''ముందీ పనులు కానీవయ్యా స్వామి. ఇవన్నీ కావాలంటే ఎన్ని బాకీలు చేయాలో చూడు. అవన్నీ వరసనే తీర్చుకుంటూ రావాలికదా?''

''అదేమిటి బావగారూ... పుత్రరత్నమొకడున్నాడు కదా... మీరు ఖర్చుపెట్టినవన్నీ అటునుండి నరుక్కు రావచ్చుగదా''

''నరుక్కు రావటానికి వాళ్ళు అంగీకరించవద్దూ- లక్షలు ఊరకే ఇస్తారటయ్యా. వాళ్ళ సేఫ్టీవారు చూసుకోరూ. అయినా కన్నందుకు వారి పెళ్ళిళ్ళు చేయాల్సిన బాధ్యత మనదేనయ్యా'' అన్నారు భరద్వాజ.

''అయ్యా... మాలాంటి కుటుంబాల్లో అది తప్పనిసరి అంశమే అనుకోండి. మీలాంటి మహానుభావుల ఇంట్లో కూడా ఇలాంటి పరిస్థితి ఉంటుందా ఏమిటి?''

''ఉండక ఏమవుతుంది బాబూ... ఇదంతా లౌకికప్రపంచం''

''ఏం లేదులెండి బావగారూ.... మీరు అన్నీ





వదిలేసి ఏదో ఆశ్రమంలోకి వెళ్ళబోతున్నారని మన చుట్టాలు అనుకున్నారు. మీతోపాటు మరి కొందరిని కూడా లాక్కుపోతారని తెలిసింది. అందుకని అడుగుతున్నాను"

"మనం వెళ్ళటం ఖాయం కావాలేగాని నాతోపాటు వచ్చేవారు చాలామంది ఉన్నారు. ఎక్కడోదాకా ఎందుకు- మా చెల్లెలు నా వెంట రాదా?" అన్నాడాయన.

"ఎవరు... జానకా?"

"అవును... నీ ధర్మపత్నే"

"అంటే ఉదయం నుండి క్లాసు అయిపో యిందన్నమాట. మంచిది బావగారూ... ఇంకో పది సంవత్సరాల తర్వాత వచ్చేయండి. ఆ తర్వాత మీ ఇష్టం. మీ చెల్లెల్ని ఆశ్రమాల్లో చేర్పిస్తారో... సన్యాసుల్లో కలిపేస్తారో మీ ఇష్టం"

"ఎంత స్వార్థమయ్యా... అప్పటికి నీ కోడ ళ్ళు వస్తారు కాబట్టి జానకితో అవసరం లేద నేగా నువ్వంటున్నది"

"అదికాదు బావగారూ... మీరు చెప్పిన సమస్యలన్నీ తీరాలంటే కనీసం పది సంవత్స రాలయినా పడుతుందని"

"కొట్టావయ్యా... అదే నీ భావలో పొడిచావ య్యా" అన్నారు భరద్వాజ.

"మరినాకు టైం అయింది. నేను ఆఫీసుకు వెళ్ళాలి" అన్నాడు మధు.

"నాకూ పనుందోయ్. నేనూ బయలుదేరతా ను"

"సాయంకాలం రారా?"

"సాయంకాలమా? లేదోయ్. పని అవగానే వెంటనే వెళ్ళిపోవాలి. మొత్తం మీద మీ సంసారం చూశాను... బాగుంది. పిల్లలు సాయంకాలం దాకా రారుగా. అడిగానని చె ప్పండి. సరే- మరలా ఏ పెళ్ళిలోనో కలుసు కుందాం"

"మా అక్కను అడిగామని చెప్పండి"

"అలానే. మరి నేను వస్తానమ్మాయ్. ఈసారి తీరిగ్గా మాట్లాడుకొందాం" అన్నారు భరద్వాజ.

జానకి చిరునవ్వుతో వీడ్కోలు ఇచ్చింది.

వారటు వెళ్ళగానే జానకి ఓసారి ఉదయం నుండి జరిగిన సంభాషణ గుర్తుకు తెచ్చు కుంది. తలుచుకుంటే ఆశ్చర్యంగా ఉంది. ఓ రకంగా భరద్వాజగారి మీదున్న అపారన మ్మకం కొంత సడలినట్లనిపించింది.

ప్రపంచమంతా 'మదర్'లో లీనంకావాలనే అన్నయ్య సాధారణమైన అనుభూతులకేం దూరంకాదు. ఆయనకూ చాలా భయాలు ఉన్నాయి.

పిల్లల పెళ్ళి విషయంలోనూ, పిల్లవాడి చదువు విషయంలోనూ అన్నిటికీ ఆయన తన ఉద్యోగం మీదే ఆధారపడుతున్నాడు. అంతే గాని తన సమస్యలన్నింటినీ ఏ అద్భుత శక్తికో వదిలివేయటం లేదు. అంటే ఆయన కూడా తనలాంటివాడే.

కాకపోతే పుస్తకాలు చదివిన జ్ఞానం వల్ల ఆయనకు ఎన్నో విషయాలు తెలిసి ఉండవ చ్చు. అయితే ఈయన ఇంకా భయాన్ని జయించలేదు. ఆయన చెప్పిన లౌకిక విష యాల్ని కూడా అధిగమించలేదు. ఇప్పట్లో అధిగమించలేనని కూడా చెబుతున్నారు. ఇక్కడ రెండు విషయాలు స్పష్టం అవుతు న్నాయి.

భయాలు అందరికీ ఉంటాయి. తను ఒకతే ఈ భయాలకు లోనుకావటం లేదు.

అలా అనిపించగానే జానకిలో సంతోషంతో కూడిన భావం ఒకటి లేచింది.

అప్పుడే మొదటిసారిగా జానకిలో జ్ఞాననే త్రం తెరుచుకొంది.

"ఈ సమాజంలో తనలాంటి స్త్రీలు, గృ హిణులు, తన భర్తలాంటివారు, అన్నయ్య లాంటివారు ఎందరెందరో ఉన్నారు. ప్రతి ఒక్కరి జీవితం భిన్నంగా ఉంటుంది. అందరి కీ రకరకాల భయాలుంటాయి. వాటిన న్నింటినీ పరిశీలించాలి. ఈ మానవులు భయం నుండి విముక్తిపొందటానికి ఏయే మార్గాలుచేపడుతున్నారో గమనించాలి. అప్పు డే తనను వేధిస్తున్న సమస్యకు పరిష్కారం లభిస్తుంది. ఇక నుండి తను పాత జానకి కాదు సరికొత్త జానకిగా రూపాంతరంచెందబోతోంది.

జానకి పెదవుల మీద చిరునవ్వు వెలి సింది. మధుకు తృప్తికలగటం లేదు. తనను వేధిస్తున్న సమస్యలకు జవాబు దొరకటం



లేదు. రోజువారీ జీవితంలో జానకి ఎవరికీ ఏ లోటు రానివ్వదు. పగలంతా బాగానే ఉంటుంది. రాత్రులు మాత్రం నిద్రరాక దొర్లు తుంటుంది. తనకు ఎప్పుడైనా మెలకువ వచ్చిచూస్తే ఆమె నిద్ర రాక పడుతున్న అవస్థ అర్థమౌతూనే ఉంటుంది. దానికి కారణం మనోహర్ మరణమా?

కాదు... ఖచ్చితంగా కాదు.

అసలు జానకిని విశ్లేషిస్తే ఒక్కోసారి ఎంతో ఆశ్చర్యం కలుగుతుంటుంది. ఎంత అద్భుతమైన వ్యక్తి. ఆమె సహచర్యం లేనిదే, ఆమె ప్రోత్సాహం లేనిదే తాము ఈనాడున్న కనీస స్థాయికి వచ్చేవారా? లేదు. ఇందులో ప్రధాన భాగం కేవలం జానకిదే.

ఒకప్పుడు అంత ధైర్యాన్ని ప్రదర్శించిన జానకి ఇలా అవటానికి కారణం ఏమిటి?- జాగ్రత్తగా పరిశీలించాలి.

తమ జీవితంలోనే ఎక్కడో జవాబులున్నాయి.

వాటిని వెదుక్కోవాలి.

అంటే గతాన్ని నెమరు వేసుకోవాలి.

గతం...గతం...ఎంత సంక్షోభకాలం! అయినా ఎంత మధురం...అనుభూతికరం... తమగతం తమకు గర్వకారణం... గొప్ప గుణ పాఠం...!

మధు పెదవులు విచ్చుకున్నాయి.




అమ్మ తనని కూర్చోబెట్టి చెప్పటం ఆరంభించింది:

"చూడు మధూ... నువ్వు ఇంటర్ పూర్తిచేశావు. ఇంక నిన్ను చదివించటం ఎటూ సాధ్యం కాదు. మరి రాజాను ఆ పదో తరగతి గట్టెక్కిస్తే గొప్పనుకుంటున్నాం. ఈ రోజు యశోద వచ్చింది. వాళ్ళ మరదలు జానకి ఉంది. దాన్ని నీకు ఇవ్వాలని వారికుంది" అంది.

"అదేంటమ్మా... నాకు అప్పుడే పెళ్ళి ఏమిటి? నాకు ఎన్ని సంవత్సరాలున్నాయని?" అన్నాడు మధు.

"వయసేమిటిరా? మా చిన్నప్పుడయితే పది హేను సంవత్సరాలకే చేసుకునేవారు. అసలు నేను ఆడుకుంటుంటే తెచ్చి పీటల మీద కూర్చోబెట్టారు"

"ఆ కాలం వేరమ్మా. ఇప్పుడు అలాంటి పెళ్ళిళ్ళుచేయటం నేరం కూడా"

"ఏడ్చావులేరా. విషయం ఆలోచించవేం. నేను చెప్పేది కూడా విను. ఆ తర్వాత నీ ఇష్టం. జానకి నాకు బాగా తెలుసు. అది ఎంతో కష్టపడి పనిచేస్తుంది. అసలు మా అన్నయ్య ఎంతో మంచివాడు. మా నాన్న చనిపోయాక అటు ఆయన తరపునగానీ, ఇటు మా తరపున గానీ ఎవరూ పలకరించిన దిక్కులేదు. అన్నయ్య మా పిన్నిగారబ్బాయి. అయితేనేం ఎప్పుడు వచ్చినా పలకరించకుండా వెళ్ళేవాడు కాదు.

ఈ రోజు ఎవరూ లక్షలు ఇవ్వనవసరం లేదురా... అవసరానికి ఓ మాట మాట్లాడగలిగితే చాలు. అన్నయ్యకు మనమంటే ఎంతో ప్రాణం. అందుకే యశోద అడిగిన నాటినుండి అలా చేస్తే బాగుండుననిపిస్తుంది. వాళ్ళే ఉద్యోగం చూసుకుంటారట. ఇంకేం కావాలి చెప్పు. అసలు ఈ రోజుల్లో ఉద్యోగం దొరకటం అంటే మాటలా"

"ఉద్యోగం చూస్తామని చెప్పారు... బాగానే ఉంది. ఉద్యోగం దొరకాలి కదా. ఓ వేళ ఉద్యోగం చూడటం కుదరలేదనుకో. అప్పుడు నేనేం చెయ్యాలి? ఇప్పుడు నేను ఒకణ్ణే. అప్పుడు ఇద్దరం. ఇద్దరికీ ఎక్కడ నుండి తేను. ఇంకో విషయం నాకు అర్థంకావటంలేదు. నేను పెళ్ళిచేసుకున్నాననుకో- రాజాను చదివించటం అంటూ ఉండదు. ఎందుకుండదు అంటావు. అది కుదరదు... అంతే. నువ్వను కుంటున్నావుగానీ ఈ పెళ్ళి చేయటం వల్ల

ఎవరికీ సుఖం ఉండదు. అందులోనూ ఈ వయసులో చేసుకుంటే నా మొహం మీదే నవ్వుతారు'' అన్నాడు మధు.

''ఎవడ్రా నవ్వేది. అయినా నేను నా బిడ్డను కావాలని కష్టాల్లో నెట్టను కదా... ఇది మంచి సంబంధం. పైగా అందరూ నీకు అండగా ఉంటారు. నేను చాలాదూరం ఆలోచించి ఈ నిర్ణయానికొచ్చాను. అసలు నువ్వు జానకిని చూశావా?''

''చూడలేదు''

''చక్కగా ఉంటుందిరా. అసలా పిల్ల ఎంత పని చేస్తుందనుకున్నావ్. మనకు తెలిసిన కుటుంబాలన్నింటిలోనూ అన్నయ్యగారి కుటుంబమే పద్ధతిగా ఉంటుంది. వచ్చిన అతిథుల్ని మర్యాదగా చూసే విషయంలోగాని, ఆదాయాన్ని బట్టి కుటుంబాన్ని తీర్చిదిద్దుకోవటంలోగానీ వాళ్ళ తర్వాతే ఎవరైనా. అయినా మా అన్నయ్యకు ఏముందని నలుగురు ఆడపిల్లల పెళ్ళిళ్ళు చేశాడు. ఇద్దరు మొగపిల్లలకు ఉద్యోగాలు ఇప్పించుకున్నాడు. ఆయన మంచితనమే ఆయనకు అండఅయింది. అందుకే చెబుతున్నాను. ఈ సంబంధం మంచిదే. నేను అన్నీ ఆలోచిస్తున్నాను. మన కోసం ఉద్యోగం చూడరుకదా. వాళ్ళపిల్లకోసం ఉద్యోగం చూసుకుంటారు. నీకు నాలుగు సంవత్సరాలు ఆగితే బాగుండునని పిస్తుందేమో... ఒవేళ అప్పుడు ఉద్యోగం వచ్చి నీకు కట్నం డబ్బులొచ్చినా జానకంత అణకువగల భార్య మాత్రం రాదు. ఆ విషయం నేను ఖచ్చితంగా చెప్పగలను'' అంది అమ్మ.

మధు మాట్లాడకుండా బయటకు వచ్చాడు.

తను పెళ్ళిచేసుకోవటం ఏ మాత్రం సరయిందనికాదని తనకు తెలుస్తూనే ఉంది. అయితే అమ్మ మాత్రం అందుకు అంగీకరించటంలేదు. వయసురీత్యా చూసుకున్నా కనీసం ఉద్యోగమన్నాలేదు. తనను తాను పోషించుకోవటమే సమస్య. అలాంటిది మరో వ్యక్తిని ఎలా ఆహ్వానించగలడు. అమ్మ ఇన్ని సంవత్సరాల నుండి ఇన్ని బాధలు అనుభవించాక ఆ మాత్రం ఆలోచించదేమిటి? ఏమిటి ఆవిడకంత నమ్మకం?

మధు మరో కోణంనుండి ఆలోచించాడు.

నాన్న మరణం తర్వాత అమ్మ కుటుంబం కోసం ఎనలేని త్యాగంచేసింది. తను తిన్నదో లేదో తెలియదు. తమను ఈ రకంగానైనా తీర్చిదిద్దటానికి ఆమె ఎంతో శ్రమించింది. ఆమె చేస్తున్న పెళ్ళి ఇదే అవుతుంది. పెద్దక్క పెళ్ళి నాన్నే చేసి చనిపోయారు. చిన్నక్క పెళ్ళి తనే చేసుకుంది.

తమను ఇంతవారిని చేసిన అమ్మ తన బిడ్డల్లో ఒక్కరికయినా తన ఇష్ట ప్రకారం వివాహం చేసే స్వేచ్ఛ లేకపోతే ఆమె త్యాగానికి అర్ధమేముంది?

మధు ఈ సెంటిమెంట్‌కు లొంగిపోయాడు.

''అమ్మా... మరోసారి నీకు చెప్పేదేమిటంటే ఈ పెళ్ళి వలన మనకు కొత్త సమస్యలు వస్తాయి. ఆ సంగతి నాకు తెలుసు. అయితే నీ కోసం, నీ తృప్తి కోసం నేను ఏమైనా చేస్తాను. ఈ పెళ్ళి చేసుకుంటాను. అయితే కష్టాలు కొని తెచ్చుకుంటున్నానని నాకు తెలుసు. నాకు కష్టాలు కొత్తకాదు. నాతోపాటు ఆ అమ్మాయి కూడా కష్టపడాలి. ఆమెకు ఇంతవరకూ కనీస జీవితం ఉంది. ఆమె మంచిరోజులన్నీ బహుశా ఈ పెళ్ళితో అంతమైపోవచ్చు'' అన్నాడు మధు.

అమ్మకు చెప్పలేనంత సంతోషం కలిగింది.

''నీకు తెలియదురా. నీ జీవితంలో నీకు ఈ పెళ్ళి చేసినందుకు నన్ను తిట్టుకోవని నేను భావిస్తున్నాను. మా అమ్మ నాకు మంచేచేసిందని నువ్వు అనుకుంటావు చూస్తుండు'' అంది. చూస్తుండగానే ముహూర్తాలు పెట్టేశారు.

అప్పట్లో ఓ కంట్రాక్టర్ దగ్గర పనిచేస్తున్నాడు మధు. ఆయన నెలకో వంద రూపాయలు ఇచ్చేవాడు. పెళ్ళి ఇంకా రెండురోజులు ఉందనగా కబురు వచ్చింది. ఎండలో తిరిగి పనులు చేయించటంతో నల్లబడిపోయాడు. సరైన తిండి లేకపోవడం వలన ఎలానో కనిపిస్తున్నాడు.

తనని చూడటానికి జానకి రెండో అన్న వచ్చాడని తెలియగానే పడుకున్నవాడల్లా బయటకొచ్చాడు. మధుని చూడగానే అతను నోరు తెరిచాడు ఆశ్చర్యంతో.

మొత్తంమీద అందరూ బంధువులే అయినా ఒకరినొకరు అంతకుముందు ఎప్పుడూ చూసుకోలేదు. తను మాట్లాడ్తూ అన్నాడు:

"నిన్ను చూస్తుంటే ఆశ్చర్యంగా ఉందిరా. అయినా ఇంత తొందరపడ్డావేమిటి? అప్పుడే పెళ్ళా? సొంతం నీకు మీసాలు కూడా సరిగ్గా రాలేదుగా?"

"ఏం చేయమంటారో చెప్పండి. ఆ ముక్క నేను అమ్మతో చెప్పాను, ఆవిడ వినలేదు. మీ చెల్లెలు అద్భుతంగా పనిచేస్తుందట. ఇలాంటి సంబంధం ఈ జన్మలో దొరకదని చెప్పింది. ఆవిడ మాటలు కాదనలేక మాత్రమే చేసుకుంటున్నా"

"అది సర్లే... మా చెల్లెలి విషయం పక్క నుంచి ఆలోచిస్తే నీమీద జాలిగా ఉందిరా. నేనయితే ఇప్పుడే పెళ్ళి చేసుకోను. మా చెల్లెలంటావా... అత్తయ్య చెప్పింది నిజమే. ఆ రకంగా నువ్వు అదృష్టవంతుడివే" అనేసి వెళ్ళిపోయాడు.

మధుకు నవ్వాలో ఏడవాలో తెలియలేదు. రెండు రోజుల్లోనే బట్టలు ఇవ్వటం, టైలర్ వాటిని అద్భుతంగా చెడగొట్టడం జరిగిపోయింది. ఎదురుచూసిన క్షణం రానే వచ్చింది. ముందుగా అనుకున్నప్రకారం దండలు మార్చుకుని, ప్రమాణాలు చేయటంతో ఆ కార్యక్రమం ముగుస్తుంది.

మధు ఇంతవరకూ జానకిని చూడలేదు. ఆవిడ చూసిందో లేదో తెలియదు.

అప్పటికీ ఓసారి జానకి అక్కవాళ్ళు మధు ఉంటున్న ఉళ్ళోనే ఉండటంతో అడిగారు.

"జానకిని చూస్తావా?"

"నాకు చూడాలని లేదు. ఓ వేళ మీ చెల్లికి చూడాలని ఉంటే చూడమని చెప్పండి. రెండోది ఈ పెళ్ళి ఆమెకు ఇష్టమో కాదో కనుక్కోండి" అన్నాడు మధు.

"మా ఇంట్లో అలాంటిదేం ఉండదు. పెద్దవాళ్ళు ఏం చెబితే అది అంగీకరించటమే" అన్నారు వాళ్ళు.

అందుకు సంతోషించాలో మరేం చేయాలో అర్థం కాలేదు. అంతలోనే తను మాత్రం ఏం చేశాడో గుర్తొచ్చి నవ్వుకున్నాడు.

రెండు కుర్చీలు... దాని ముందు ఓ బల్ల వేశారు.

పెళ్ళి చేసే పెద్దాయన వధూవరుల్ని ఆహ్వానించాడు.

"అమ్మాయ్ పెళ్ళికొడుకు ఏడీ? కనిపించడే" కళ్ళు చిట్లించుకుంటూ అడుగుతోందో ముసలమ్మ.

"అదేమిటే నీముందు నుండి నడుచుకుంటూ వెళ్ళాడుగా. అడుగో కుర్చీలో కూర్చున్నాడు"

"ఏంటి... ఆ పిల్లాడా?"

అక్కడ నవ్వులు.

"పెద్దగా అరవ్వాకవే తల్లీ... కొంచెంసేపట్లో అతను నీ మనవరాలి మొగుడు కాబోతుంటేనూ" అంది. తిరిగి అక్కడ నవ్వులు.

జానకిని ఎవరో నడిపించుకు వచ్చారు.

ఓ పదినిముషాల ప్రసంగం తర్వాత ఇద్దరితోనూ ప్రమాణం చేయించారు. దండలు మార్పించారు.

కొత్త జీవితంలోకి అడుగుపెట్టబోతున్న తన బిడ్డను చూసి కళ్ళు చెమర్చాయి మధు అమ్మకి.

ఆదే క్షణంలో ఇరువురి కళ్ళూ కలుసుకున్నాయి.

అందరూ భోజనానికి లేచారు.

మధు బిడియంగా తన స్నేహితుల దగ్గర కొచ్చాడు.

అప్పుడు ఓ వ్యక్తి పలకరించాడు.

"ఏం బాబూ బాగున్నావా?" అంటూ హృదయానికి హత్తుకున్నాడు.

"నాకీ క్షణం నాన్న గుర్తొస్తున్నాడయ్యా... అమ్మ నీ గురించి ఎంత విలవిలలాడిపోయిందో, నీ కోపం చూసి ఎంత ఆందోళన చెందిందో నీ ఆవేశంలో ఏమైపోతావో... ఏ నిర్ణయాలు తీసుకుంటావోననే భయంతోనే ఇంత త్వరగా పెళ్ళి చేసింది. నాన్నగారి మరణంతో మీ కుటుంబం బాగా చితికిపోయింది. మీరు తిరిగి కోలుకోవాలిబాబూ" అనేసి వెళ్ళిపోయాడు.

మధు కొన్ని క్షణాలపాటు ఆలోచించాడు.





అలానే నిలబడిపోయి అమ్మ ఎంతదూరం ఆలోచించింది. తనకు ఈ ప్రపంచం మీద ఓ కసి ఏర్పడుతున్నమాట వాస్తవమే. తనకు బాగా కోపం ఉన్నమాటకూడా వాస్తవమే. బహుశా తను ఏ ఉగ్రవాదంలోకో జారిపోతానని భావించిందేమో... ఆమె కళ్ళముందు అలాంటి అనుభవాలు చాలా ఉన్నాయి. అందుకే ఆమె భయంనుండి విముక్తి కాదలుచుకొంది.

అంటే భయాన్ని పోగొట్టుకోవడానికి పెళ్ళి కూడా ఓ మార్గం అన్నమాట! అనుకున్నాడు మధు.

అమ్మ భయాలకు నవ్వుకోవాలో, ఆమె భయంవల్ల ఎదుర్కోబోతున్న మరో రణరంగం గురించి దిగులుపడాలో ఆ క్షణం అర్థంకాలేదు.

జానకి వాళ్ళ గ్రామంనుండి మూడు మైళ్ళ దూరంలో ఉన్న పట్నంలో తాము ఉంటున్నారు. ఉదయాన్నే తిరిగి తమ ఇంటికి ప్రయాణం. ఇంటిదగ్గర చిన్నతనంనుండి తెలిసిన వారందరూ పలకరించారు.

"ఏవయ్యా మధూ నీ భార్యను చూపించవా?"

"చూపిస్తాను మామ్మగారూ" అంటూ వెళ్ళి అమ్మకు చెప్పి జానకిని వెంటబెట్టుకొని అందరిదగ్గరకు తీసుకువెళ్ళి పరిచయం చేశాడు.

"మొత్తానికి నీకు పెళ్ళికళ వచ్చిందయ్యా" అన్నారంతా.

"మామ్మగారూ... పెళ్ళికళ సంగతేమోగాని నాకో విషయం గుర్తొస్తోంది" అన్నాడు మధు.

"ఏమిటయ్యా?"

"ఈ పెళ్ళి ఎందుకు జరిగిందో నాకు తెలియదు. నాకయితే నాలుగు జతల కొత్తబట్టలొచ్చాయి. రెండు లుంగీలు కూడా కొనిపెట్టారు. నా చేతికో వాచీ, వేలికో ఉంగరం వచ్చింది. మీకు తెలుసుగా ఇవన్నీ ఎవరు పెట్టుకుంటారో" అన్నాడు.

అక్కడున్నవారంతా పది నిముషాలు నవ్వుతూ ఉండిపోయారు.

మధు వారుంటున్న వీధికావల అందరూ పనులకెళ్ళేవారే. అందులో రకరకాల కులాలు, శాఖలు, వృత్తులు కలవారు ఉండేవారు. మట్టి పనులకో, పొలంపనులకో వెళ్తుండేవారు. ఏ పనులూ లేకపోతే రిక్షాలాగుతుండేవారు. వారందరూ ఈ కుటుంబాల్తో చనువున్నవారే.

ఆ కుటుంబాల్లోని యువకులు ఓ వారం రోజులపాటు మెరుస్తుండేవారు. మొదట్లో మధుకి అర్థంకాలేదు.

తెల్లగా నిగనిగలాడే చొక్కా, కొత్త లుంగీ, చేతికి 'వాచీ' వేలికి మెరిసే ఉంగరం... సెంటర్లో నిలబడి కిళ్ళీ నవుల్తూ, 'చార్మినార్' సిగరెట్ వెలిగించేవారు, పక్కన నలుగురయిదుగురు కుర్రాళ్ళు ఉండేవారు. మామూలుగా ఈ స్థితి వారంనుండి పదిరోజులు మాత్రం ఉండేది.

ఆ తర్వాత అవేం ఉండేవికాదు. పార, పల్లిక వేసుకొని ట్రాక్టర్ ఎక్కుతుండేవారు.

మధు పరిశోధనల సారాంశం ఏమిటంటే, ఆ యువకుడికి పెళ్ళయిందని. అప్పటినుండి మధుకు ఒకటే కొండగుర్తు. తెల్ల చొక్కా, లుంగీ, వాచీ, ఉంగరం ఉంటే చాలు...

"పెళ్ళయిందనే!"

"మరి నీకేం ఇచ్చారు మీ మావగారు" నవ్వాపుకుంటూ అడిగింది మామ్మగారు.

"వాచి, ఉంగరవండి... రొండొందలు రొక్కవండీ" అన్నాడు మధు.

తిరిగి అక్కడ బిగ్గరగా నవ్వులు...

కడుపులు పట్టుకొని మరీ మరీ నవ్వారు.

కళ్ళనీళ్ళు వచ్చేంతగా నవ్వారు.

"ఆ...లు నిన్ననటం కాదురా... హాయిగా ఆడుకోవలసిన వాడిని తెచ్చి ఈ కూపంలోకి నెట్టింది మీ అమ్మ"

మధు నవ్వి అన్నాడు.

"దేవుడే మమ్మల్ని రక్షించాలి!"

జానకిగారింటికి ప్రయాణం.....

మొదట్లో రిక్షాను బస్‌స్టాండ్‌కు మాట్లాడుకున్నారు. ఇద్దరూ ఎక్కాక యశోద మరో రిక్షాలో ఎక్కింది.

మధు అడిగాడు-

"ఏం బాబూ పొలెం వస్తావా?"

"వస్తానండి"

''ఎంతివ్వమంటావ్?''

''మీకు తెలియందేముందండి''

''సర్లే పోనీ''

బస్‌స్టాండ్‌కు వెళ్ళాల్సిన రిక్షా పాలెం వైపుకు తిరగటంతో యశోద కేకలు వేయటం ఆరంభించింది. అయితే ఆ పిలుపు వారికి వినపడలా...

రిక్షా ముందుకు వెళ్తోంది.

''చూడు బాబూ మెల్లగా వెళ్ళినా ఫర్వాలేదు. మాకేం తొందరలేదు''

''అలాగేనండయ్యా''

''బస్‌లో అయిదు నిముషాల్లో చేరుకుంటాం. ఇలా అయితే బాగుంటుందని...''

''వదిన ఏమనుకుంటుందో'' జానకి మొదటిమాట

''ఏమీ అనుకోదు. కొత్త పెళ్ళి కొడుకూ పెళ్లికూతురు కదా''

జానకి నవ్వింది మనోహరంగా

''మనం కొన్ని విషయాలు మాట్లాడుకుంటే బాగుంటుంది''

చెప్పంతన్నట్లు చూసింది.

''మనం చుట్టాలమే. అయితే ఒకరి గురించి ఒకరికి అంతగా తెలియదు. నువ్వంటే మా అమ్మకు ఎంతో ప్రేమ. ఖచ్చితంగా చెప్పాలంటే అమ్మ తృప్తికోసం నిన్ను చేసుకున్నాను. చాలా మంది అనుకున్నారు. ఈ వయసులో వాడికి పెళ్ళేమిటని.... ఎక్కడిదాకో ఎందుకు మీ అన్నయ్య నామీద జాలిపడ్డాడు. నిజం కూడా అది. నేనే రోడ్డు మీదున్నా. నాకు ఓ ఉద్యోగమంటూ లేదు. పోనీ వెనకాల తాతల, తండ్రుల ఆస్తులులేవు. ఈ పెళ్ళి చేసుకోవటం నా నేరమే. నేను బాధపడేది నీ విషయం గురించి''

''అదేమిటండి అలా అంటారు'' అంది జానకి.

''అవును మరి... ఇప్పటి వరకూ నువ్వు హాయిగా బ్రతికావు. ఇప్పుడు కష్టాలు ఆరంభంకాబోతున్నాయి. అవన్నీ ఎదుర్కోవటానికి నువ్వు సిద్ధంగా ఉండాలి''

జానకి తిరిగి నవ్వింది

''నా గురించి నీకు చెప్పారో లేదో నేనెంత సరదాగా ఉంటానో, అంత భయంకరమైన కోపం వస్తుంటుంది''

''వదిన మీ గురించి చెప్పింది''

''ఏం చెప్పింది''

''వాడికి బాగా కోపం ఉన్నమాట నిజమే. అయితే వాడి హృదయం మంచిది. అసలది కోపం కంటే పట్టుదల అనుకోవచ్చు అని చెప్పింది''

మధుకు నవ్వొచ్చింది.

''మరి నాకు ఎప్పుడు ఉద్యోగం వస్తుందో తెలియదు. ఎప్పటి నుండి కలసి ఉండాలో కూడా తెలియదు. ఏమీ ఆలోచించకుండా ముందయితే పెళ్ళి జరిగిందని పించుకున్నారు. ఓ రకంగా మీ వాళ్ళు నీ తరపున తమ బాధ్యతల్ని నిర్వర్తించారు. నా తరపున అమ్మ. అమ్మకు తన జీవితంలో సుఖం అంటూ లేదు. మనం అమ్మను సుఖపెట్టాలి. అంతేకాదు. తమ్ముడున్నాడు. వాడికోసం మనం ఏమైనా చేయాలి. అంతకంటే ముందు మనందరి కోసం మనం ఏదైనా చేయాలి. ఇవన్నీ దృష్టిలో పెట్టుకున్నప్పుడు నాకో ఆలోచన వచ్చింది''

ఏమిటన్నట్లు చూసింది జానకి.

''ఏం లేదు మనం మన జీవితానికి ఓ ఆధారం అంటూ ఏర్పడేంతకాలం, కనీసం ఓ సంవత్సరం మనం స్నేహితులుగా ఉందాం- ఏమంటావ్?'' అన్నాడు మధు.

తిరిగి జానకి నవ్వింది.

''నువ్వు నవ్వుతుంటే చాలా బాగుంది. మరీ ఎక్కువసార్లు అలా నవ్వకు. మనం స్నేహితుల్లా కాక భార్యాభర్తల్లా ఉండాల్సి వస్తుంది. అయినా మనకు అప్పుడే పిల్లలు వద్దు. నా స్నేహితులంతా చదువుకుంటున్నారు. ఆసమయంలో నేను పెళ్ళి చేసుకున్నాను. వారందరికీ వారి భవిష్యత్ మీద ఎన్నో ఆశలూ, ప్రణాళికలూ ఉన్నాయి. అవి వింటుంటే నాకు అసూయకలుగుతుంది. ఇదంతా ఎందుకు చెబుతున్నానో నువ్వు అర్థం చేసుకో. నిన్ను పెళ్ళి చేసుకోవాలి అనుకున్నాక నీ గురించి ఆలోచించాను. అమ్మ చెప్పిన విషయాలు నాకింకా





గుర్తున్నాయి. అందుకే ధైర్యం చేశాను. ఏదిఏమైనా మనం ఓ అవగాహనతో, పట్టుదలతో ముందుకు పోవాలి- సరేనా?''

తలూపింది జానకి.

రిక్షా వెళ్తూనే ఉంది.

మధు తన బలహీనతలు, చిన్ననాటి విషయాలు చెబుతుంటే జానకి వింటుండిపోయింది.

''నువ్వేమిటీ మాట్లాడవు'' అన్నాడు మధు అకస్మాత్తుగా.

''మీరు చెబుతున్నారుగా. నేను వింటున్నాను''

''నువ్వు కూడా నీ గురించి చెప్పు. వింటాను''

''ఏముంది చెప్పటానికి నా దగ్గర విశేషాలేం లేవు''

''ఓ ఇంగ్లీష్ సామెత చెప్పనా'' అంటూనే చెప్పటం ఆరంభించాడు.

''పెళ్ళయిన మొదటి ఆరు నెలలూ అతను చెబితే ఆవిడ వింటుందట. తర్వాత ఆరు నెలలూ ఆవిడ చెప్పేది అతను వింటాడట. ఆ తర్వాత వారిద్దరూ చెప్పేది దేశం వింటుందట- అర్థమైందా?''

జానకి నవ్వింది హాయిగా.

''అంటే మనం మొదటి దశలో ఉన్నాం. ఈ ఆరు నెలలూ నేను చెప్పేది నువ్వు వినటమే. సరే. రెండో దశలో నువ్వు చెప్పేవన్నీ నేను వింటాను. ఆ తర్వాత స్టేజి గురించి చెబుతాను. ఇప్పుడే మనం ఓ నిర్ణయానికి వద్దాం. జీవితంలో ఎప్పుడైనా సరే మన విషయాలు మనమే వినాలి. అంటే మనకు తగాదా వచ్చినా, అభిప్రాయబేధాలొచ్చినా, ఇంకేమైనా కేవలం మన గదిగోడల నడుమ పరిష్కారం కావాలి. అంతేగాని మన కుటుంబ విషయాలు ఇతరుల తీర్పుకోసం మాత్రం వెళ్ళకూడదు. ఏమంటావ్?''

మౌనంగా తలూపింది జానకి.

''ఇక్కడ ఆపమంటారా'' రిక్షా అతను అడుగుతున్నాడు.

''మైగాడ్... ఇంత త్వరగా వచ్చిందా? బస్సుకంటే ముందే తీసుకొచ్చావు కదయ్యా. ఇంకొంచెం ఆలస్యంగా తీసుకొస్తే నీ సొమ్మేం పోయిందట'' అన్నాడు మధు డబ్బులిస్తూ.

★ ★ ★

పెళ్ళయి వారం రోజులు గడిచిపోయింది.

మధు తన చిరుద్యోగానికి వెళ్ళిపోయాడు. ఈలోపే ఆషాఢమాసం కూడా వచ్చింది. ఆ పట్టింపులు లేకపోయినా తనున్న పనిలో పదే పదే వెళ్ళటమూ కుదరదు. అందులోనూ కాంక్రీట్ పనులు చేస్తున్నప్పుడు క్షణం తీరిక ఉండదు. ఆ పనుల నడమే జానకి నవ్వు గుర్తొస్తుండేది. అక్కడ పనిచేసేవారిలో కొందరు యువకులు వేళాకోళం ఆడటం ప్రారంభించారు.

''ఏంటిసార్... పెళ్ళి చేసుకున్నాక ఊరికే ఉండటం మాకు నచ్చలేదు. అలాంటప్పుడు ఓ సంవత్సరం ఆగే చేసుకోవాల్సింది''

''నేను ఆ ముక్క కూడా చెప్పానయ్యా బాబు. అయినా అమ్మ అంగీకరించలా. క్షణాల్లో నిర్ణయాలు మార్చుకుంటున్న ఈ రోజుల్లో సంవత్సరం తర్వాత పరిస్థితి ఎలా ఉంటుందో అన్నారు''

''మరి అలాంటప్పుడు ఆలస్యం ఎందుకు?''

''మా పద్ధతి మాది'' అనేవాడు మధు.

ఓ సాయంకాలం పనిపూర్తి చేసుకొచ్చి కూర్చోగానే కబురు వచ్చింది.

''వెంటనే బయలుదేరి రమ్మని''

ఇంటికి వెళ్ళాడు. విషయం ఏమిటంటే 'నాన్నగారి మిత్రుడు తన కోసం హైదరాబాద్‌లో ఏదో ఉద్యోగం చూశారు. కాబట్టి వెంటనే బయలుదేరి వెళ్ళాలి'

''నేను బట్టలు సర్దుతాను. ఓసారి జానక్కి ఈ విషయం చెప్పి వస్తావా?'' అంది అమ్మ.

''చెప్పి రమ్మంటావా?'' అన్నాడు.

''చెప్పిరా'' అంది.

ఓ సైకిల్ తీసుకొని బయలుదేరాడు. దారి పొడుగునా ఎంతో ఉద్వేగం జానకితో చాలా విషయాలు మాట్లాడాలని ఉంది. కానీ ఏం మాట్లాడాలి? మరో గంటలో తను బయలు దేరి

వెళ్ళిపోవాలి. అక్కడ వెంటనే చేరమంటే చేరిపోవాలి. కొత్త గాబట్టి వెంటనే శెలవు ఇస్తారో... ఇవ్వరో? ముందు విజయవాడ వెళ్ళి అంకుల్‌ను కలుసుకోవాలి. ఆయన్తో మాట్లాడాకగాని అటు వెళ్ళటం కుదరదు. ఆలోచనల్లోనే ఇల్లు వచ్చేసింది.

చెమటలు కక్కుతున్న భర్తను చూడగానే సంతోషమూ, ఆందోళన రెండూ కలిగాయి జానకికి.

"ఏమిటింత వేగంగా వచ్చారు. మెల్లగా రావచ్చుకదా... అసలా చెమటలు చూడండి. ముందు మొఖం కడుక్కుందురుగాని రండి" అంది జానకి.

"లేదు జానకీ... నాకు టైంలేదు. విజయవాడ నుండి అంకుల్ కబురు పంపించారు. హైదరాబాద్‌లో ఏదో ఉద్యోగమట. పూర్తి వివరాలు ఆయన దగ్గరకు వెళ్తేగాని తెలియవు. ఎన్ని రోజులు ఉంటానో కూడా తెలియదు. వెంటనే జాయిన్ అవాలంటే చేరాలి కదా. అందుకని బట్టలు తీసుకువెళ్తున్నాను. నీతో చెప్పి వెళ్దామని వచ్చాను" అన్నాడు.

ఆ క్షణం జానకి మొఖం వెలిగిపోయింది. తన సంతోషాన్ని దాచుకుంటూ అంది.

"సబ్బుతో మొఖం కడుక్కురండి. అలసట తగ్గుతుంది"

"నీ అదృష్టమే. మీకు మంచి ఉద్యోగమే వస్తుంది" అంది జానకి తల్లి సంతోషపడిపోతూ.

మధు వచ్చేసరికి కాఫీ కప్పు అందించింది జానకి. గబగబ తాగాడు.

"మరింక నేను బయలుదేరుతాను" అన్నాడు.

మనసులో ఏదో అసంతృప్తి... దిగులు కూడా... దూరం వెళ్తున్నాననే బాధ...

"ఒక్క నిముషం"అంటూ లోపలికెళ్ళింది జానకి.

రెండు నిమిషాల తర్వాత వచ్చింది.

జానకి చేతిలో వంద రూపాయల కాయితం. నలిగిపోయి ఉంది! మధు మొఖంలో అదే రకం భావం...

"ఎవరిచ్చారు అత్తయ్యా...?"

"కాదు. నేను చాలారోజులుగా దాచుకున్న డబ్బు... తీసుకోండి"

మధు జానకి కళ్ళలోకి చూస్తుండిపోయాడు.

"థాంక్యూ జానకీ" పెదవులు కదిలాయి.

"వెళ్ళాక ఉత్తరం రాయండి"

"అలాగే"

వారిద్దరి నడుమ నిశ్శబ్దం.

జానకిని గుండెలకదుముకోవాలని చుంబించాలనే కోర్కె...

అతి బలవంతంమీద ఇద్దరూ నిగ్రహించుకున్నారు.

"వెళ్ళిరానా" అన్నాడు మధు.

తలూపింది జానకి.

అప్రయత్నంగా జానకి చెయ్యందుకొని నొక్కి వదిలేశాడు.

శరీరంలో రక్తం ఒక్కసారిగా ఉప్పొంగిన భావన ఇద్దరికీ!!

★ ★ ★

హైదరాబాద్

ప్రియమైన జానకీ...

నేను విజయవాడలో అంకుల్ దగ్గరకు వెళ్ళాను. అక్కడకు వెళ్ళేసరికి ఇంకా నలుగురున్నారు. వారు కూడా నాలా ఉద్యోగాలకు వచ్చినవారే. అయితే ఒకటే తేడా. వారందరికీ నాన్నలున్నారు. నేనొకణ్ణే నాన్న లేనివాణ్ణి. అయితే మావయ్య మాత్రం నాన్నలేని లోటు తీర్చారు. ముందు మేం మావయ్యగారింటికి వెళ్ళాం. అక్కడ ఆయన చాలాసేపు మాట్లాడారు. మొన్న మన పెళ్ళికి ఆయన రాలేకపోయారు. కానీ నీపేరు ఆయనకు బాగా గుర్తుంది. నువ్వు ఎలా ఉన్నావని అడిగారు. నాతోపాటు వచ్చినవారు అన్ని ఏర్పాట్లతో వచ్చారు.

నాకు ఈ విషయంలో ఏం చేయాలనేది తెలియదుకదా. ఆయనే నాకు దిండుతోపాటు ఓ బెడ్‌షీట్ ఇచ్చారు. రాత్రి నేను నిద్రపోతుంటే నాకు దుప్పటికప్పారు. నేను నిద్రపోయినట్లు కళ్ళు మూసుకున్నానుగానీ ఆయన ఆప్యాయతకు అనుభూతి చెందుతూనే ఉన్నాను. తలనిండా ముసుగు కప్పుకున్నాక





నాకెందుకో ఏడుపొచ్చింది. నేను నిశ్శబ్దంగా చాలాసేపు ఏడ్చాను. ఆ తర్వాత నిద్రపట్టింది. తిరిగి మావయ్య లేపుతుంటే మెలకువ వచ్చింది. అప్పటికే ఆయన స్వయంగా టీ తయారుచేశారు. అన్నట్లు నీకు ఆంటీ గురించి రాయలేదు కదా. ఆంటీ, అంకుల్ ఇద్దరూ తమనుతాము సమాజంకోసం అంకితం చేసుకున్నారు. ఆంటీ మహిళల కోసం, వారి జీవితాల్లో మార్పుకోసం పనిచేస్తున్నారు. ఆమె ఎక్కడికో వెళ్ళారు.

తెల్లవారే ప్రయాణం... హైదరాబాద్ మొదటిసారి రావటం. నువ్విచ్చిన వంద రూపాయలు కాక మరో అరవై తెచ్చుకున్నాను. మావయ్యా వచ్చేముందు ఓ వంద రూపాయలు జేబులో పెట్టారు. హైదరాబాద్‌లో ఓ ఫ్యాక్టరీకి పంపిస్తున్నామని, అక్కడ ఉద్యోగం వచ్చే అవకాశం ఉందని చెప్పారు. నేను ఆయన దగ్గర వీడ్కోలు తీసుకున్నాను. నన్ను భుజం తట్టి పంపిస్తున్నప్పుడు ఆయన కళ్ళలో తడి మెరిసినట్లనిపించింది.

హనుమంతరావు మావయ్యా మాకు స్వయంగా మేనమామ కాదు కానీ ఆయన్ని మావయ్యా అని పిలుస్తాం. నాన్న ఆయనకు ప్రాణస్నేహితుడు. నాన్న పోయాక తన పనుల్లో మా గురించి పట్టించుకోవటం సాధ్యంకాలేదు. కానీ మాపట్ల గొప్ప ప్రేమను ఆయన ప్రదర్శించారు. ఆయన్ను చూస్తుంటే నాన్న గుర్తొస్తారు. అమ్మను అమితంగా ప్రేమించిన వ్యక్తి ఆయన. తనకు ఏ కష్టం వచ్చినా అమ్మ ఆయనకు చెప్పుకుంటుంది.

సరే మేం బస్‌స్టాండ్‌కొచ్చాం. నా కొత్త మిత్రులందరికీ వాళ్ళ నాన్నలు ఎంత జాగ్రత్తగా ఉండాలో చెబుతున్నారు. వీరందరిలోనూ పెళ్ళి అయింది నాకు మాత్రమే. ముందసలు నాకు పెళ్ళయిందంటే వారు నమ్మలేదు. బస్ కదిలినప్పుడు వారి కళ్ళలోనూ దిగులు కనపడింది. నాకు చాలాసేపు అమ్మా, నువ్వూ గుర్తొచ్చారు. అతి ప్రయత్నంమీద కన్నీళ్ళని ఆపుకున్నాను.

హైదరాబాద్ చేరాక మేమందరం ఓ ఆఫీస్‌లో ఉన్నాం.

ఆ తర్వాత మమ్మల్ని ఓ ఫ్యాక్టరీ దగ్గరకు తీసుకువెళ్ళారు. అది సిగరెట్లు తయారుచేసే ఫ్యాక్టరీ. ఆ కంపెనీ మేనేజర్ వచ్చారు. మా అందర్నీ అప్లికేషన్ రాసివ్వమన్నారు. రాసిచ్చాం. నాతోపాటు వచ్చిన మిత్రులు అంతగా చదువుకోలేదు.

కొందరు ఎనిమిది మాత్రమే చదివారు. నేను పీలగా ఉండటం మంచిదయింది. నన్నూ ఇంకో నన్నటి మిత్రుడ్ని ప్యాకింగ్ సెక్షన్‌లో వేశారు. కొంచెం బలంగా కనిపించే ఓ వ్యక్తిని పి.ఎమ్.డి సెక్షన్‌లోనూ మరో ఇద్దరిని మేకింగ్ సెక్షన్‌లోనూ వేశారు. మా వరకూ బాగానే ఉంది. మేం ఏ.సి. రూంలో కూర్చుని పనిచేస్తాం. అన్నట్టు ఓ విషయం రాయటం మరిచిపోయాను. నేను వచ్చేముందు మావయ్యా ఓ విషయం చెప్పారు. అది డిగ్నిటీ ఆఫ్ లేబర్ గురించి. మనం చేసే పనిమీద మనకు గౌరవం ఉండాలని చెప్పారు. నేను గ్రాడ్యుయేట్‌నయితే నాకు టైప్ వచ్చు కాబట్టి టైపిస్ట్‌గా ఉద్యోగం వచ్చి ఉండేది. ఇప్పుడు నాకూ, స్వీపర్‌కూ ఒకటే జీతం. పనుల్లో తేడా అంతే. మమ్మల్ని జనరల్ వర్కర్ అంటారు. మేం నిన్ననే ఉద్యోగంలో చేరటం జరిగింది. తీరిగ్గా ఉత్తరం రాస్తున్నా. నీతోపాటు అమ్మకూ రాస్తున్నా. నాకు ఉద్యోగం వచ్చినందుకు సంతోషంగా ఉన్నా పూర్తి ఉత్సాహంగా లేదు. ఎందుకంటే ఆరునెలల తర్వాత మాకు ఇచ్చేది రెండువందల చిల్లరే. రెండు వందల్తో మనం హైదరాబాద్ నగరంలో ఎలా బతకగలమో ఆలోచించుకుంటే భయం కలుగుతుంది. ఇంతవరకూ మీ అన్నయ్యనుగానీ, మా అక్కనుగానీ కలవలేదు. ప్రస్తుతం మేమందరం ఒగదిలో ఉంటున్నాం. అందరం సామాన్లు కొనుక్కొని వండుకు తింటున్నాం- నాది కూరల సెక్షన్. మొత్తం మీద భలే తమాషాగా ఉంది. మా ఫ్యాక్టరీ అడ్రస్ ఇస్తున్నాను. వెంటనే లెటర్ వ్రాయగలవు. ఎదురుచూస్తుంటాను''

అని ఆపాడు మధు. ఇంకేదో రాయాలనుకొన్నాడు. సిగ్గుపడ్డాడు. అంతలోనే ఈ లెటర్ ఎవరి చేతుల్లోనయినాపడితే ఏమనుకుంటారో? ఏమనుకుంటారేమిటి? తనేం తప్పు చేయటంలేదు. తన భార్యకు 'ముద్దుల్తో' అని రాస్తున్నాడు. అందులో తప్పేముంది? అలా అయితే

ఇంక ఆలస్యం ఎందుకు? ఊహుఁ... కొద్దిసేపు ఆగి

నీ.... మధు.... అనిరాసి పోస్ట్ చేశాడు.

★ ★ ★

ఆరు నెలలు గడిచాయి.

మధును రెగ్యులరైజ్ చేస్తూ ఆర్డర్ అందించారు. అమ్మ బయలుదేరి రమ్మంటూ ఓ ఉత్తరం రాసింది. నాలుగు రోజులు శెలవు పెట్టి ఇంటికి బయలుదేరాడు. ఇంటికి వచ్చాక అసలు విషయం తెలిసింది.

తమకు శోభనం ఏర్పాటు చేస్తున్నారు.

తిరిగి అమ్మతో వాదనకు దిగాడు మధు.

"నీకు తెలియదురా. ఆడపిల్ల పెళ్ళిచేశాక ఇంతకాలం ఆగమంటే ఆగరు. వాళ్ళకుండే హడావిడి వారిది. ఇవన్నీ పిల్లలు మీకు తెలియవు"

"అవును. ఈ విషయంలో మేం పిల్లలమే. పిల్లలమని తెలిసినప్పుడు పెళ్ళిచేయటమెందుకు?" అన్నాడు మధు విసుగ్గా.

"నువ్వు చెప్పేది బాగానే ఉంది. దేశంలో ఎవరూ పెళ్ళిళ్ళు చేసుకోవటం లేదా?"

"నేను కూడా నీ మాట ప్రకారం చేసుకున్నాను కదా"

"అవును... ఆ మాట ప్రకారం ఇప్పుడు మీ అత్తగారింటికి వెళ్ళు"

"అసలు నీకు తెలియటం లేదు. ఇప్పుడు నాజీతం ఎంతనుకొంటున్నావు. ఇప్పుడు మన నడుమకి ఓ బిడ్డవస్తే ఆ వచ్చేవి ఏ మూలకు చాల్తాయో చెప్పు"

"అలా అని ఎంతకాలం అలా ఉంటావ్? దాన్ని కాపరానికి తెచ్చుకోవా ఏమిటి?"

"ఎందుకు తెచ్చుకోం. ఈ రోజేవస్తుంది. తీసుకొస్తాను"

"అదే మరి సంప్రదాయమంటే. నీలా మేం ఆలోచించిఉంటే బాగానే ఉండేది. అయినా అయిదారు వందలు వచ్చేదాకా పెళ్ళాం మొఖం చూడనంటావేమిటి?" అంది నిష్ఠూరంగా.

"అమ్మా... ఈ నడుమ నువ్వు నన్ను అర్థం చేసుకునే ప్రయత్నం చేయటంలేదు. తమ్ముడి చదువు విషయం గందరగోళంగా ఉంది. వాడు టెన్త్ పాసయ్యాడు. వాడికి ఏదో ఒకటి చెప్పించాలి కదా"

"చూద్దాంరా. అందుకని చెప్పి నువ్విలా చేయటం బాగుంటుందా?" అంది.

జీవితంలో మొదటిసారి రాజీపడటమే కష్టం. ఆ తర్వాత అది అలవాటుగా మారుతుంది. మధు అంతకంటే ఎక్కువ మాట్లాడలేదు. అనవసరంకూడా. అమ్మ విషయం అలా ఉంచినా వాళ్ళు తమ పూర్తి బాధ్యతల్ని నెరవేర్చాలనుకుంటున్నారనేది స్పష్టం. అందుకే సాయంకాలం బయలుదేరుతుంటే అమ్మ పిలిచి చెప్పింది.

"జానకి పెట్టుకుంటుంది పూలు తీసుకెళ్ళు"

బస్‌స్టాండ్ ఇవతల పూలు కొనాలనే అనిపించింది మధుకి. తిరిగి అదోరకం భయం.... బిడియం... తనను చూసి వాడేమనుకుంటాడో.... అతనెవరో తనకు తెలియదు.

అతనేమనుకున్నా తనకొచ్చే నష్టమూ లేదు. రేపటి నుండి అతని మొఖం తను చూడడు కూడా. అయినా తన భార్యకు తను పూలు కొనుక్కుంటున్నాడు. ఇదేం నేరం కాదు. అయినా ఈ సందిగ్ధత ఏమిటి? ఇలాంటి వాటిని అధిగమించని పక్షంలో ఈ సమాజంలో బతకటం కష్టమే.

ఎటో చూస్తూ అడిగాడు...

"మల్లెపూలివ్వండి"

"ఎన్నివ్వమంటారు?"

జేబులో నుండి రెండు రూపాయల కాయితం అందించాడు.

"మొత్తానికి ఇవ్వమంటారా?"

తల ఊగింది.

పూలను జేబులో పెట్టుకున్నాడు మధు. బస్‌లో ముందుసీట్లో కూర్చున్నాడు.

జేబులో పెట్టుకుంటే పూలు నలిగిపోతాయి కదా... జేబులో పెట్టుకోకుండా చేతిలో పెట్టుకొని వెళ్తే అందరూ నవ్వరూ! నలిగిపోయిన పూలు తెచ్చారెందుకని జానకి అంటుందేమో.... మరీ అంత బహిరంగంగా నేను శోభనపు పెళ్ళికొడు




కునని చెప్పుకోవాలా? అది సరే పూల ఖరీదెంత? రెండు రూపాయలు! ఎంత తెగింపు!

రెండు రూపాయల మల్లెల్తో ఈరాత్రి గడవబోతుందన్న మాట.

ఎవరైనా చూస్తే, తనకు తెలిసినవారు గమనించి ఉంటే కథలుగా చెప్పుకుంటారు. ఈ రోజు రెండు రూపాయల మల్లెలు తీసుకోవటం వరకూ బాగానే ఉంది. ఎప్పుడూ తీసుకోగలడా?

ఫ్యాక్టరీలో తోటిపనివారిని చూస్తే ఆశ్చర్యం కలుగుతుంది. వారంతా పేదవారుగానే కనిపిస్తారు. అయినా రెండుసార్లు టీ తాగుతారు. కనీసం నాలుగు పాన్‌లు తింటారు. మూడు గిన్నెల క్యారియర్‌లు తెచ్చుకుంటారు. అందులో చపాతీలూ, అప్పుడప్పుడు మాంసం కూరలు కూడా ఉంటాయి. అసలది ఎలా సాధ్యం?

తనకు రెండురోజులకోసారి టీ తాగాలన్నా భయం వేస్తుంది. లంచ్‌లో తను క్యాంటీన్‌కు వెళ్ళడు. సిగరెట్ తాగడు. వేరే అలవాట్లు లేవు. అయినా డబ్బులు చాలటంలేదు. మరీ ప్రపంచంలో అందరూ ఎలా జీవిస్తున్నారో.... చిత్రంగా ఉంటుంది.

మధులో మరో మనిషి తిరగబడ్డాడు.

"నువ్వొత్త వెధవ్వి కాకపోతే ఓ కొత్త అనుభూతుల ప్రపంచంలోకి వెళ్తున్నావ్. నిజమే... రెండు రూపాయలు పూలకు తగలేశావ్. ఇంక ఆ విషయం మరిచిపోవా? నువ్వు అనుభవించి చచ్చేదేమిటి? లేకపోతే ఓ పనిచెయ్యి. నీ జీవితంలో ఇంకెప్పుడూ పదిపైసల పూలు కూడా కొనొద్దు.. ఇంకనీ దరిద్రపు ఆలోచనలు కట్టిపెట్టు"

బస్సు ఆగింది.

తను నడుస్తూ రావటాన్ని ఏ కిటికీ తలుపుల నుండో జానకి చూస్తూనే ఉంటుంది. అయినా ఏం ఉపయోగం? ఇద్దరిలోనూ సిగ్గుతెరలే. ఇంతకాలం దూరంగా ఉన్నాంకదా.... కేవలం తమ నడుమ ఉత్తరాలే కదా ఉంది. ఇప్పుడు తను వెళ్ళగానే ఆ సంతోషం కేవలం కళ్ళలోనే కనిపిస్తుంది. అంతకుమించి ఇరువురూ హృదయాల్లోనే ఒకరినొకరు పలకరించుకోవటం ఎంత చిత్రమైన స్థితి. వాకిట్లో ఎదురైంది జానకి.

మొఖంలో, కళ్ళలో కాంతి. తను మాట్లాడకుండా లోపలికి నడిస్తే...

"ఎప్పుడురా రావటం?" అంది అమ్మమ్మ.

"కులాసానా?" అంది అత్తయ్య.

"పొద్దున వచ్చాను. బాగానే ఉన్నాను" అనేసి గదిలోకి వెళ్ళాడు. మావయ్య ఎ దొడ్లోనో ఏదో పనిమీదుండి ఉంటాడు.

బహుశా ఇదే గదిలో... తనలా అందరూ అల్లుడి హోదాలో వచ్చి ఉంటారు. వాళ్ళూ తనలా ఇంత బిడియపడి ఉంటారా?

గదిలో ఓ మూల మంచం.... దాని మీద కొత్త దుప్పటి.... దాని పక్కన కిటికీ తలుపు తెరిస్తే ఎదురుగా ఓ ఇల్లు... చెట్లు... వెన్నెల... బాగానే ఉంటుంది. తను మరీ చిన్నపిల్లాడేం కాదు. ఆధునిక ప్రపంచంలో యువతరంలో కొందరు ఈ వయసుకే ఎన్నెన్నో అనుభవాల్తో ఎదిగిపోతున్నారు.

మరితనో ఓ సాధారణ యువకుడు

నిరంతరం భయానకమైన ఆలోచనల్తో, సమస్యల్తో బాధపడే మధ్యతరగతి యువకుడు.

"స్నానం చేస్తారా?" అంది జానకి.

ఎన్నిరోజులయింది ఆ స్వరం విని.

"ఊ"

"చొక్కా విడవండి"

మెల్లగా విడిచి హేంగర్‌కు తగిలించాడు జేబులో పొట్లాం తీసి టేబుల్ మీదుంచాడు.

"ఏమిటివి?"

"మల్లెపూలు"

"ఫర్వాలేదే" వాసనచూస్తూ అంది. పూలకు రెండు రూపాయలు ఖర్చయినాయనే విషయాన్ని ఆ క్షణం మరిచిపోయి ఆనందపడ్డాడు మధు.

బీరువాలో నుండి కొత్త టవల్ తీసి అందించింది.

శరీరమంతా ఉద్వేగంతో కంపించిపోతూంది. నీళ్ళు శరీరంమీద పడి వెచ్చగా మారుతున్నాయా అనిపించింది. ఆరోజు

వెన్నెల మున్నెన్నడూలేనంత అందంగా ఉంది.

స్నానం చేసి రాగానే మామయ్య పలకరించాడు. ఉద్యోగం ఎలా ఉందో. ఏమేంపనులు చేయాలో వివరాల్తోసహా.

జానకికి ఓ అరఎకరం ఇచ్చారు. అందులో సంవత్సరానికి ఏడుబస్తాలు వస్తాయి. వాటిని తింటానికి ఉంచుకొంటే జీతం పైఖర్చులకు వాడుకోవచ్చు. కొంతకాలం అలా సర్దుకుంటే జీతాలు పెరుగుతాయి. ఈలోగా ఇంకేదైనా మంచి ఉద్యోగం కోసం ప్రయత్నం చేసుకోవచ్చుననేది వాళ్ళ అభిప్రాయం. కాగా త్వరలోనే జానకిని హైదరాబాద్ పంపించేయాలని వారు నిర్ణయించుకున్నారు.

మధుకు జానకే స్వయంగా వడ్డించింది. భోంచేశాక గదిలో కూర్చున్నాడు. అక్కడ ఏవేవో పుస్తకాలున్నాయి. అన్నీ పాతవి. ఆ ఇంట్లో ఎవరికీ సాహిత్యం మీద అంతగా అభిరుచిలేదు. ఉత్తరాలు రాయటం, పత్రికలు చదవటం వరకూ చదువువస్తే చాలని వారు అభిప్రాయపడుతుంటారు.

ఆ ఇంట్లో ఎక్కువ చదువుకొంది కూడా జానకే. పదోతరగతి చదువుతూ మానేసింది. జానకి చిన్నన్నయ్య మాత్రం తనని చదివించాలని ఆరాటపడినా కుటుంబ ప్రభావంవల్ల జానకి చదువుమీద ఏమాత్రం ఉత్సాహం చూపించలేదు.

మొదటిసారిగా జానకితో పూర్తి స్వేచ్ఛగా మాట్లాడే అవకాశం మధుకి లభించింది. పనులన్నీ పూర్తయ్యాక అందరూ ముందు హాల్లోకి వెళ్ళిపడుకున్నారు. జానకి గదిలోకివచ్చి తలుపు మూసింది.

మధు కిటికీ పక్కన కుర్చీవేసుకుని కూర్చున్నాడు. బయట వెన్నెల మెరుస్తూంది.

"ఇలారా. కొంచెంసేపు ఇక్కడ కూర్చుందాం" అన్నాడు.

"మంచంమీద కూర్చుందాం రండి" అంది జానకి.

"వెన్నెల బాగుంది"

జానకి వచ్చి కూర్చుంది.

కొంచెంసేపయ్యాక అడిగాడు:

"ఏమిటిదంతా?"

"నాకేం తెలుసు" అంది జానకి.

అంతలోనే అంది:

"చాలాపూలు తెచ్చినట్లున్నారు. మంచం మీద జల్లుతాను"

మధు ఓ క్షణం సిగ్గుతో కంపించాడు.

జానకి తలలో మల్లెమొగ్గల్తో కట్టిన చిన్నపూలదండ. కిటికీ తలుపులు మూసి తనూ లేచివెళ్ళాడు. మంచం మీద కూర్చున్నాక అన్నాడు-

"నీతో మాట్లాడటం అంత తేలికయిన విషయం కాదు"

జానకి నవ్వింది.

"ఏం లేదు. మనకిప్పుడు ఉద్యోగం వచ్చింది. ఇదేమంత గొప్ప ఉద్యోగం కాదు. కానీ ఎందుకు చేస్తున్నానంటే చేయాలికాబట్టి. ఈ ఆరునెలల కాలంలోనూ నాకు చెప్పిన ప్రతి పనిని విజయవంతంగా పూర్తిచేశాను. ఆ తృప్తి నాకుంది. అయితే మనం కొత్త జీవితంలోనికి ప్రవేశించటానికి ఇంకా కొన్నాళ్ళు ఆగితే బాగుంటుందేమో"

"మీ ఇష్టం" అంది జానకి.

"ఇలారా కూర్చో" అన్నాడు చెయ్యిపట్టుకుంటూ.

తిరిగి అదోరకం ప్రకంపన.

"పెద్దవాళ్ళు వాళ్ళ ఆరాటం కొద్దీ వారు చేస్తారు. అంతా మనచేతుల్లో ఉంది. ఒక్క సంవత్సరంకాదు పది సంవత్సరాలు ఆగమన్నా నేను ఆగుతాను. అయితే ఒక్క విషయం. నేను మీతో వస్తాను. మిమ్మల్ని విడిచి ఉండటం నాకు సాధ్యం కావటంలేదు. మనకు వచ్చే జీతం ఎంత తక్కువైనా ఫర్వాలేదు మనం సరిపెట్టుకుందాం. అంతేగాని జీతం పేరుతో నన్నింకా ఇక్కడ ఉంచకండి" అంది జానకి. ఎందుకో ఆ కంఠం వణికినట్లనిపించింది!

"ఛఛ...అలాంటిదేం లేదు. నా ఉద్దేశం కూడా అదికాదు. మనకు పిల్లలు పుట్టుకొచ్చారనుకో...వారికి సరైన పోషణ మనం చేయగలమా అనేదే నాబాధ" జానకి కళ్ళలోకి సూటిగా





చూస్తూ అన్నాడు మధు.

"మీరేమనుకోనంటే ఓ విషయం చెబుతాను. మనకంటే లేనివారు ఈ దేశంలో చాలా మంది ఉన్నారు. వారంతా బతుకుతూనే ఉన్నారు. మీరెందుకింతగా భయపడుతున్నారు?"

మధు తనభార్యకేసి ఆరాధనాపూర్వకంగా చూశాడు.

నిజమే. తమకంటే ఎందరెందరో అన్ని రకాలుగా హీనమైన స్థితిలో ఉండి జీవిస్తున్నారు. మరి తనెందుకు జీవించలేడు. జీవిస్తాడు... తప్పక జీవిస్తాడు. ఈ భయాలన్నింటినీ అధిగమిస్తాడు. మధులో అనంతమైన విశ్వాసం ఆక్షణంలో మరింత బలంగా వేళ్ళూనుకొంది.

"నన్ను విడిచి ఉండలేనంటున్నావ్... ఇన్ని సంవత్సరాలూ ఎలా ఉన్నావ్?"

"ఇన్ని సంవత్సరాలూ మీరెవరో నాకు తెలియదు. ఇప్పుడు మీరు తెలవటమేకాదు మీరే నాకు అన్నీ. ఏ క్షణమైతే మనల్ని కలిపారో ఆ క్షణమే నేను మీ మనిషిని. నా ఆలోచనల్లో ఉండేది మీరు మాత్రమే. ఈ ఆరునెలలుగా మీ ఉత్తరాలు చూసుకొని వాటిని చదువుకుంటూ కాలం గడుపుతున్నాను. ప్రతి బుధవారం, అలానే శనివారం మీ ఉత్తరం రాకపోతే ఎంతో బాధ అనిపించేది. అసలు మీరెలా ఉన్నారో, మీ ఆరోగ్యం ఎలా ఉందో అనే ఆందోళన కలిగేది. మీరు చాలా పెద్దఉత్తరాలే రాస్తారనుకోండి. అయినా కూడా ఇంకా పెద్ద ఉత్తరాలు రాస్తే బాగుండేదనిపించేది. ఈ విషయం గురించి మొన్నే తెలిసింది. మీరు వస్తున్నారంటే నాకెంత సంతోషం కలిగిందో" అంది జానకి.

"హైదరాబాద్ నుండి వస్తూ నీకో చీరయినా తేలేకపోయాను. నీకు తెస్తే అమ్మకు తేవాలి. తమ్ముడికికూడా రెండు జతలకు మించిలేవు. అయినా అమ్మ రాగానే అడిగింది జానక్కి ఓ చీర తేలేకపోయావా అని. నిజం చెబుతున్నా నువ్వు దాచుకున్న వంద రూపాయలు తీసుకున్నందుకే బాధగా ఉంది"

"అదేమిటండీ. అలా మాట్లాడతారు. నేను దాచుకుంటే మాత్రం అది మనది కాదా? అయినా మనలో మనకు నీ డబ్బూ నా డబ్బూ అనే తేడా ఏమిటి చెప్పండి. చీరలు ఇప్పట్లో నాకు అవసరం లేదు. పెళ్లికి కొనుక్కున్నవి చాలా ఉన్నాయి. రెండు సంవత్సరాలదాకా అసలు చీరలు అవసరం లేదు. అత్తయ్యకే తీసుకోవాలి. ఇంకెప్పుడూ దయచేసి అలా మాట్లాడకండి" అంది జానకి.

"నిజమే... నాలో ఒకరకమైన గిల్టీనెస్ ఉందనుకుంటాను. ఇదిగో ఇలాంటి ఇబ్బందులే నన్ను రకరకాల ఆలోచనల్లోకి లాగుతాయి. నాకయితే వాస్తవానికి ఈరోజు శోభనం కూడా ఇష్టంలేదు"

"మరెందుకని వచ్చారు?"

"ఎందుకు పెళ్ళిచేసుకున్నానో అందుకోసమే వచ్చాను. అయితే నేను గాంధీగారిలా ఓ ప్రయోగం చేయాలనుకున్నాను"

"గాంధీ ఎవరు?"

"గాంధీగారు తెలియదూ. మన గాంధీ తాత"

"అయినా... ఆయనలా ఏంచేస్తారు?" అంది.

"తనని తాను నిగ్రహించుకోవటానికి రాత్రి పూట ఆడపిల్లల్ని పక్కనే పడుకోబెట్టుకునేవారట"

"మంచిది... మీరూ అలాగే చెయ్యండి" అంది జానకి నవ్వుతూ. మధు మంచం మీద పడుకున్నాడు. టేబుల్‌ఫ్యాన్ నుండి చల్లటి గాలి వీస్తోంది. గాలి మల్లెల సౌరభాన్ని మోసుకొస్తూంది. జానకి లైటుతీసివచ్చి పడుకొంది. కొద్దిసేపు వారిద్దరూ ఏమీ మాట్లాడుకోలేదు. మల్లెల సువాసన ఆ గదంతా పరుచుకుంది. దాంతోపాటు అంతకుముందే ఆ గదిలో ఉంచిన అగరొత్తుల పరిమళం కూడా.

"నేను మాట్లాడవద్దని చెప్పలేదు" మధు నిశ్శబ్దాన్ని చీలుస్తూ అన్నాడు.

జానకి మధుకేసి తిరిగి కళ్ళలోకి చూసింది. అలా తిరగటంలో తన శరీరం మధుకి తగిలింది. శరీరంలో రక్తనాళాలు చిట్లిపోతాయా అనే భావన. అప్రయత్నంగా జానకి భుజంమీద చేతులు వేశాడు.



మరుక్షణం బలంగా తనకేసి అదుముకు న్నాడు.

క్షణాలపాటు వారి నడుమ గాలిస్తంభించి పోయింది.

తొలి కౌగిలిలోని అనుభూతి వారిని మరింత ఉద్రేకింపచేసింది.

"ప్ర... యో... గ... ం" అంటూ గొణిగింది.

"ఈ ప్రపంచం ఏమైపోనీగానీ... నేను గాంధీని కాను" అన్నాడు మధు తమకంతో.

బయట వెన్నెల కాస్తూనే ఉంది.




మధు, జానకి బడ్జెట్ వేయటం ప్రారంభించారు.

జానకితో నూతన అనుభవాల్ని వంచుకున్నాక హైదరాబాద్ రావటం జరిగింది. మధు అక్కతో కలసి ఉండటానికి నిర్ణయించుకున్నాడు. అందరికీ కలిపి ఓ ఇల్లు తీసుకున్నారు.

దాదాపు ఇరవై సంవత్సరాలుగా ఉన్న ఊరును వదిలిపెట్టారు మధువాళ్ళు. ఊరువదిలి వస్తుంటే చాలా బాధ కలిగింది.

అప్పటిదాకా ఎంత దరిద్రం అనుభవించినా ఆ పరిసరాలు వారినెంతో ఆనందపరిచాయి. అక్కడున్న అయిదారు కుటుంబాలవారు ఈ ఇరవై సంవత్సరాలకాలంలోనూ ఒకరి అనుభూతులు మరొకరు వంచుకొన్నారు. ఎవో కొద్దిపాటి సంఘర్షణలు మినహాయించి వారంతా స్వంత కుటుంబ సభ్యుల్లా మెలిగారు. వారు వస్తున్నప్పుడు అక్కడున్న వారందరి కళ్లూ చెమ్మగిల్లాయి.

"మధు తల్లి చెప్పుకోదగ్గ స్త్రీ. ఎవరి సహాయం లేకపోయినా, తిన్నా తినకపోయినా తన పిల్లల్ని పెంచింది. ఈ రోజుకూ వారికి ఆమె ఎంత చెబితే అంత. ఆమె ఈ వీధినీ, ఈ ఊరునూ విడిచివెళ్లి పోతుందంటే మాకేదో పోగొట్టుకున్నట్లుంది" అన్నారు.

మధు అమ్మ చాలాసేపు కళ్లు వత్తుకుంటూనే ఉంది.

హైదరాబాద్ వచ్చాక తీరిగ్గా కూర్చుని తమ ఆదాయ, వ్యయాల్ని లెక్క చూశారు. మొత్తం రెండువందల జీతం. అందులో కనీసం వంద రూపాయలు ఇంటి అద్దె తీసేస్తే మిగిలేది వందరూపాయలు. ఈ డబ్బులకుగాను మొత్తం నలుగురు తినాలి. ఎంత బియ్యం వచ్చినా పాలు, కిరోసిన్‌లాంటి వాటిని దృష్టిలో పెట్టుకుంటే కనీసం మరో నూట ఏభై రూపాయలు ఉంటేగాని అందరికీ కనీస జీతం రాదు. ఈ సందర్భంలో స్పష్టమైన విషయం ఏమిటంటే రాజాకు కాలేజీలో చేరి చదివే అవకాశం లేదు. ప్రైవేట్‌గా మాత్రం చదువుకోవాలి. వీలయితే తనూ ఏదో ఒక ఉద్యోగం చేసుకుంటూ, ఇంకా సినిమాలు బంద్. పూలు బంద్. బయటకు వెళ్లటం బంద్. కొత్తబట్టలు బంద్. ఒక్కమధును మినహాయించారు. తను నెలకు ఓ సినిమావరకు చూడవచ్చు.

కొత్త సంసారం బాగానేవుంది మధుకి. పని చేయటం, రావటం, జానకితో కొద్దిసేపు కబుర్లు. తమ అవసరాల్ని కుదించుకొని బతుకుతున్నా సంసార జీవితంలోని ఓ రకమైన తృప్తి... సుఖం జీవితాన్ని ఫర్వాలేదనిపిస్తున్నాయి. ఇదంతా అక్కగారి ఆర్థిక పరిస్థితి బాగున్నంత వరకూ. మధు బావగారు వ్యాపారం చేస్తుంటారు. అందులో ఒడిదుడుకులు ప్రారంభమైన నాడు తిరిగి ఆ కుటుంబంలో ఓ సంక్షోభం తలెత్తింది. చదువుకోవలసిన వయసులో కోల్పోయిన విద్యార్థి జీవితం గురించిన ఆవేదన తమ్ముడిలో కనపడేది. కాగా తను ఏమైతే ఊహించాడో అదే జరుగుతూంది. జీవితం ఎలా అనే భయం తిరిగి ముందుకొచ్చింది.

అలాంటి రోజుల్లో ఓ ఉషోదయాన మధు అక్క ఓ వార్త చెప్పింది.

...నువ్వు తండ్రివి కాబోతున్నావు.

మధు చాలాసేపు మౌనంగా ఉండిపోయాడు. మామూలుగా ఇది సంతోషాన్ని కలిగించే

విషయమే. ఇరవై సంవత్సరాలకే తను తండ్రి కాబోతున్నాడు. నలుగురితో ఎలా అనుకుంటు న్న చేతులో మరో ప్రాణి రాబోతూంది.

జానకి ఈ విషయం ఇంటికి రాసింది. వెంటనే అక్కడనుంచి ఉత్తరం వచ్చింది. అందులోని సారాంశం ఈ వార్త వారినెంతో ఆనందింపచేసిందని. అదే ఉత్తరంలో ఓ మూల పక్కింటివారు రాశారు.

సోదరుడికి,

మీ మరదలు ఆరోగ్యం జాగ్రత్త. తనకి అసలే బిడియం ఎక్కువ. ఎవరి ఇంటికైనా వెళ్తే అర్థాకలితో వస్తుంది. మరలా ఇంటిదగ్గర కొస్తేగాని సరిగ్గా భోంచేయదు. అందుకని జానకి విషయంలో నువ్వు కొంచెం శ్రద్ధ తీసుకోవాలి. ఇలా రాస్తున్నందుకు ఏమీ అనుకోకండి. ఇప్పుడు జానకి మామూలు మనిషికాదు. తను ఇద్దరికోసం తినాలి. పళ్ళూ, స్వీట్లూ లాంటివి తింటే బాగుంటుంది. ఇవన్నీ మీకు తెలియని వని కాదు రాయటం. జానకిని అడిగినట్లు [illegible]

[illegible] ఆ లెటర్ పట్టుకొని ఆలోచిస్తుండిపోయాడు. నిజమే. జానకి ఇద్దరు మనుషుల ఆహారం తినుకోవాలి. ఇంకా వళ్ళూ , హార్లిక్సూ తీసుకోవాలి. రెగ్యులర్‌గా డాక్టర్ దగ్గరకెళ్లాలి. మందులు వాడాలి. నెల నెలా చెక్ చేయించుకోవాలి. బరువు పనులు చేయకుండా జాగ్రత్తగా ఉండాలి. అలా ఉంటే పండంటి పాపో, బాబో పుడతారు.

అందుకు వాళ్లేంచేసి ఉండాల్సింది?

తనకు ఇచ్చి ఉండాల్సిందికాదు.

కనీస జీతం గ్యారంటీగా ఉన్న వ్యక్తులకు ఇచ్చి ఉండాల్సింది. అప్పుడు బహుశా ఇలా రాసి ఉండేవారు కాదు... అదే రాయించి ఉండేవారుకాదు.

అంటే..,

తన పేదరికాన్ని గుర్తు చేస్తున్నారు.

ఇంతకంటే వారు చేయాల్సింది మరోటుంది...

అది తాము చెప్పినట్లు మరో ఉద్యోగం చూడటం. కనీసం నాలుగు వందలైనా వచ్చే జీతం. అయినా అలా రాయించటంలో వాళ్ళ



ఉద్దేశ్యం ఏమిటి? రెండువందలు తెచ్చుకుంటున్న కుటుంబంలో ఇవన్నీ ఎలా సాధ్యం అవుతాయి? మధ్యలో రకరకాల ఆలోచనలు ఆ లేఖ అతన్ని గాయపరచింది. ఆ మాటే జానకితో అన్నారు. తనకు ఆ లేఖలో బాధపడవలసిన విషయం ఏముందో అర్థంకాలేదు. మధు బాధపడినందుకు తనూ బాధపడింది.

అక్కడకు దగ్గర్లో ఉన్న ఓ డాక్టర్‌కు చూపించేవారు. జానకి ఆయన ఇచ్చిన బిళ్ళలు మాత్రం వేసుకొనేది కాదు. అదేమంటే ఆ వాసన తనకు గిట్టదని చెబుతుండేది. చాలా కాలం వాంతులు కూడా ఆగలేదు.

ఇంట్లో ఆర్థికపరమైన ఇబ్బందులు మొదలయ్యాయి. మధు తల్లి మౌనంగా ఉండేది. అంతకు మించి ఆమె ఏం చేయగలుగుతుంది? ఈ రకమైన ఇబ్బందుల గురించి మధు మొదటి నుండే చెబుతున్నారు. కానీ తనే లక్ష్యపెట్టలేదు. పెళ్ళి చేసేదాక త్వరపడింది. దాని ఫలితాలు ముందుకొస్తున్నాయి.

మధులో తీవ్రమైన అశాంతి. జీవితంతో ఓడిపోతున్న భావన ఎవరిమీదో తెలియని కసి. ఏం చేయాలో తెలియని పరిస్థితుల్లో జీవితం మరో మలుపు తిరగటానికి నాంది 'మహేష్'.

అతనో వ్యాపారస్థుడు. మధు అన్నయ్యా వరసయ్యే ఓ చుట్టం. 'మహేష్'తో హైదరాబాద్ రావటం జరిగింది. అతను తన వ్యాపారంలోకి మధును ఆహ్వానించాడు. అంతేకాక రాజాను సైతం ఉద్యోగంలోకి తీసుకుంటానని చెప్పాడు.

ఈ విషయంలో మధు త్వరగానే ఓ నిర్ణయానికి రావటం జరిగింది.

మొదటిసారిగా జానకితో తీవ్రమైన వాగ్వివాదం జరిగిందప్పుడే...

"మీరు ఈ ఉద్యోగం మానేయటం నాకిష్టంలేదు"

"నాక్కూడా ఇష్టంలేదు. కానీ ఇక్కడ భవిష్యత్తేదే"

"ముందు ముందు ఉంటుందేమో"





"ఉండదేమో... అంతవరకు ఎదురుచూసే ఓపిక నాలోలేదు. ఇప్పుడు నా కుటుంబంలోకి మరో వ్యక్తి ప్రవేశిస్తున్నాడు. వాడి కడుపుకి ఇన్ని పాలు పట్టాలంటే ఈ జీతంతో కుదరదు. ఈ ఉద్యోగంలో అసలు ఏం తృప్తి ఉందని... మల్లెపూలవాసన కూడా తెలియటంలేదు. ఏ వస్తువు చూసినా పొగాకు వాసనే. ఈ ఫ్యాక్టరీ కొత్తగా పెట్టారు. బోనస్ ఇవ్వాలంటే కనీసం అయిదు సంవత్సరాలు పడుతుంది. జీతాలు పెరగాలన్నా అంతే. ఈ రెండువందల్తో ఈ మహానగరంలో అయిదు సంవత్సరాలపాటు ఎదురుచూస్తూ బతకటం నాకు సాధ్యం కాదు. నన్ను కన్నందుకు అమ్మకూ, నిన్ను కట్టుకున్నందుకూ కనీస జీవితాన్ని అందించాలికదా"

"నిజమేనండి. అందుకని ఇప్పుడు ఈ ఉద్యోగం మానితే ఏమొస్తుంది? ఇక్కడే ఉండి మనం ఇంకో ఉద్యోగంచూసుకోవచ్చుగదా?"

"ఎవరు... ఎవరు చూసేది. నాకు జీవితమంతా ఫ్యాక్టరీకి వెళ్ళిరావటానికి సరిపోతుంది? ఓ సినిమాలేదు. ఓ సరదాలేదు. బయటకు వెళ్ళాలంటే భయం. ఇరవైనాలుగు గంటలూ ఈ కొంపలో పడిచావాలి. మరెలా ఉద్యోగం వస్తుంది? అసలా విషయం గురించి ఆలోచించాల్సిందెవరు? చిటికెలో ఉద్యోగం ఇప్పిస్తానని నీ మెడలో తాళి కట్టించారే వాళ్ళు. వాళ్ళకది అవసరంలేదు. అయ్యా మా అమ్మాయికి పళ్ళు-బుకొనిపెట్టు. స్వీట్లు కొనిపెట్టూ అని రాయటం మాత్రం వచ్చుఅంతేనా?"

"మరీ అంత ఇదిగా మాట్లాడకండి. గర్భంతో ఉన్నాను కాబట్టి కొంచెం జాగ్రత్తగా ఉండమని రాశారు. ఇందులో కూడా తప్పుందా? ఎవరైనా అలా రాస్తారు."

"ఎవరైనా అలా రాస్తారన్నమాట. రాసేటప్పుడు మనకెంత జీతం వస్తుందో తెలియదా? ఈ జీతంతో ఎంతమంది బతకాలో తెలియదా? మీకు తెలియకుండా మేమేమైనా లక్షల రూపాయలు దాచామనుకున్నారా? తన జీవితం ఏమిటో తెలియని, దరిద్రం మాత్రమే ఉండి నడిబజార్లో నిలబడ్డ ఓ కుర్రాడ్ని తెచ్చి పెళ్ళి చేశారు. కనీసం రెండు సంవత్సరాలపాటు ఉంటాం. కొంచెం ఊపిరి పీల్చుకున్నాక సంసారం పెడతాంఅంటే అదీ వినలేదు. ఇప్పుడు కాయలూ కమ్మలూ కొంటావా లేదా

అని రాస్తే నన్ను అవహేళనం చేయటంకాక మరేమిటి? నాకు వేరే ఆదాయాలేమన్నా వస్తు న్నాయా? అంత ఆవేదనకలవారు... ప్రేమకల వారు ఆ లెటర్తోపాటు నీకు ఓ వంద పంపి ఉండొచ్చుగా... ఇదంతా మాతో పరిహాసానికా? లేక ఆడపిల్లను ఏదోలా వదిలించుకోవటాని కా?'' కోపంగా అన్నాడు మధు.

''మీరు చాలా దారుణంగా మాట్లాడుతున్నా రు. మీ ఇష్టం వచ్చినట్లు మీరు చేసుకోండి. ఏదైనా మంచి ఉద్యోగం చూసుకున్నాక మాను కుంటే బాగుంటుందని చెబుతున్నాను. అయినా ఇలా మనుమలు వస్తుంటారు. వారితో నమ్మకం ఏమిటి? ఇది వరకు మీ బావగారి దగ్గర పనిచేశారు కదా. ఎందుకు బయటకొచ్చారు? లేపూ అంతేగా. అందుకే అన్నాను. మావాళ్ళు ఏదో రాశారని ఇంతంత మాటలు అనటం ఎందుకు?'' అంది ఏడు స్తూ.

జానకి కన్నీళ్ళు చూసి అదోలా అయిపో యాడు మధు.

''ఏ కోపం వచ్చినా ఊడిపోని ఉద్యోగం చేస్తాను నువ్వు చూడు '' అనేసి వెళ్ళిపోయా డు.

ఈ చర్చ తర్వాత జానకిలో ఒకే ఆలోచన:

ఆయన మొండిమనిషి. ఓ నిర్ణయమంటూ తీసుకుంటే ఇంకెవరు చెప్పినా వినడు. ఆ తర్వాత ఎలాంటి పరిణామాలొచ్చినా ఎదుర్కో వటానికి సిద్ధంగా ఉంటాడు.

అప్పటికి జానకికి ఎనిమిదో నెల. జానకిని తీసుకువెళ్ళటానికి చిన్నన్నయ్య వస్తున్నాడు. రాత్రంతా మధుకు నిద్ర లేదు. జానకి పొట్ట కేసి చూస్తుండిపోయాడు. చేతుల్తో ఆప్యా యంగా నిమిరాడు.

''జానకీ... నువ్వు కావరానికొచ్చిన ఈ ఎని మిది నెలలలోనూ నాలో చాలా లక్షణాలు చూసి ఉంటావు. ఇవన్నీ బతుకు భయానికి చెందినవే. నిన్ను నేను గాఢంగా ప్రేమిస్తున్నా. నువ్వు వెళ్ళి పోతున్నావని తెలిసి బాధ....'' అన్నాడు తలవంచుకుంటూ. జానకి కళ్ళ వెంట నీళ్ళు రాగా ఏమీ మాట్లాడలేకపో యింది.

''మొదటి కాన్పు చాలా కష్టమంటారు. స్త్రీకి అది మరో జన్మతో సమానమట. నీ కడుపులో బిడ్డకు జన్మనివ్వటానికి నువ్వు పడే బాధలు తలపుకొస్తే నాకు భరించలేనంత దుఃఖం వస్తుంది. అమ్మ నన్నుకంది. ప్రతి ఒక్కరిని కనటంలో ప్రతి స్త్రీ అలాంటి బాధను పొందు తుంది. ప్రతిసారీ ఈ భయం తప్పదనుకుంటా ను. నేనిక్కడ ఉంటాను. అక్కడ నువ్వు బాధతో గిలగిలలాడుతుంటావు. నీకు జరగరానిది ఏదైనా జరిగితే...'' ఆ తర్వాత కొద్దిసేపు మాట్లా డలేకపోయాడు.

''జానకీ.... నేను చాలామందిని తిట్టాను. చాలామంది మీద విరుచుకుపడ్డాను. ఆ సంగతి నీకు తెలుసు. అవును మరి. చిన్నత నంలో నాన్న పోయాక అన్ని కోర్కెలూ సమాధి చేసుకు బతికాను. కనీసం పెద్దయ్యాకయినా ఈ జీవితంలో మార్పు వస్తుందేమోనని కలలు కన్నాను. కానీ అలాంటిదేం లేదు. ఈ బతు కులో కష్టాలు... కన్నీళ్ళూ తప్ప ఏమీ లేవను కుంటాను. నాకు అది తప్పదు. కానీ నువ్వు... నువ్వు జన్మనివ్వబోతున్న బిడ్డ కెందుకు రావాలి నా దురదృష్టం''

''అదేంటండి అలా మాట్లాడతారు. దయ చేసి ఇంకెప్పుడూ అలా మాట్లాడవద్దు. మనకే మిటండి ఇది కాకపోతే ఇంకోటి..... అవసర మైతే నేనూ కష్టపడతాను. మనకేం ఫర్వాలేదు. జీవితం గురించి అంతగా ఆలోచించకండి. అంతేకాదు నాకేం కాదు చూస్తూండండి. మీకు పండంటి బాబును కని చూపిస్తాను'' అంది జానకి.

మధు కళ్ళు మెరిశాయి.

ఆ రాత్రంతా జానకిని విడిచిపెట్టలేదు. మెలకువ వచ్చినప్పుడల్లా పొట్టను తడుము తూనే ఉన్నాడు.

సికింద్రాబాద్ స్టేషన్లో రైలు బయలుదేర టానికి సిద్ధంగా ఉంది. జానకి, మధు కళ్ళలో కన్నీటి వర్షం కురవటానికి తయారుగా ఉంది.

''జాగ్రత్తండి. ఆఫీసుకు వెళ్ళేటప్పుడు జా గ్రత్తగా వెళ్ళండి. ఇదివరకటిలా పెద్ద పెద్ద ఉత్తరాలు రాస్తుండండి. మీరేం చేసినా ఫర్వా లేదు. ఓసారి ఆలోచించండి. నా గురించి దిగులు పెట్టుకోవద్దు. అంతా నవ్యంగానే జరు



గుతుంది. కాన్పు అవగానే ఫోన్ చేయించటమో, టెలిగ్రాం ఇవ్వటమో చేయిస్తాను. అప్పుడు మీరు వద్దురుగాని''

మధు తలూపాడు.

మధుకు ఎన్నో చెప్పాలని ఉంది. కాని నోటి వెంట మాటలు పెగిలి రావటంలేదు. ఇద్దరినీ వదిలేసి జానకి అన్నయ్య సీటులో కూర్చుండి పోయాడు. ట్రైన్ కదలబోతున్నట్లుగా ప్రకటన వినవడింది.

''ముందు నువ్వు జాగ్రత్తగా ఎక్కు'' అన్నాడు మధు.

ఎత్తుగాఉన్న పొట్టతో చిత్రంగా కనిపిస్తోంది. జానకి అనలే ఎత్తు తక్కువ. ఎక్కాక వెనక్కి తిరిగింది. కళ్ళు తడితో మెరుస్తునాయి. వెళ్ళే ముందు ఒక విషయం అడగాలని పదే పదే అనిపించింది. కానీ నోరు పెగలటంలేదు. జానకికి కూడా! మధు వెనక్కి తిరిగాడు. గార్డ్ వచ్చజెండా ఊపుతున్నాడు. బండి కదలబోతూంది. జానకి చెయ్యి ఊపుతోంది. మధు జానకి చేతిని చేతిలోకితీసుకున్నాడు. కాయితంలా తగిలితే చూసింది.

మడతలుపడ్డ ఏభైరూపాయల నోటు!

మధు మాట్లాడలేదు. కానీ జానకి ఆ భావాలు చదివింది.

''ఇంతకంటే భార్యకు ఏమీ ఇవ్వలేనివాడిని. ఈ డబ్బుతో ఏమీరాదని, ఓ వారంరోజులపాటు పళ్ళుకూడా రావని నాకు తెలుసు. అవి ఎంతకాలంనుండి దాచానుకున్నావ్... అది నువ్వు ఇచ్చిన వందరూపాయల్లో ఖర్చుచేయకుండా ఉంచింది. చూశావా నీ డబ్బు నీకు తిరిగి ఇచ్చేస్తున్నా. నాకంటూ ఏమీలేని నిరుపేదను. ఈ పేద యువకుడి దగ్గర స్వర్గాలు లేవు. ఈ ప్రయాణంలో అన్నీ ముళ్ళే జానకీ... వెళ్ళు... నా హృదయాన్ని మాత్రమే నీకు కానుకగా ఇస్తున్నా... నీ చిరునవ్వులు వెదజల్లే నీ మోము పదికాలాలపాటు నా ముందుండాలి. నీ ఆత్మవిశ్వాసం నన్ను నడిపించాలి. వెళ్ళిరా... మన నడుమకో చిన్నినేస్తాన్ని తీసుకురా... ఈ ప్రపంచం ఎంత దుర్భరంగా ఉన్నా... మన బతుకుల్లో ఎంతవేదన ఉన్నా... మన బిడ్డను చూసి అన్నీ మరిచి పోదాం. మనం ముందుకే పోదాం జానకీ... ముందుకు పోదాం''

ట్రైన్ చిన్న కుదుపుతో ముందుకు కదిలింది. జానకి కళ్ళనుండి టప టప రాలిన కన్నీటి బొట్లు బుగ్గలమీద కారాయి. చేతులు ఊపుతూనే ఉంది. ఇద్దరికీ నడుమ క్రమ క్రమంగా దూరం ఎక్కువకాసాగింది.

కళ్ళు మసకలు కమ్ముతుండగా చూస్తూ నిలబడ్డాడు మధు. అదే వదనం... చిరునవ్వునూ వేదననూ మేళవించుకొని వీడ్కోలు చెబుతున్న జానకి... ఏదో చెప్పాలని పెదవులదాకా వచ్చిన పదాల్ని గొంతులోనే దాచుకున్న జానకి... చూస్తుండగానే నలుసులా... ఆ తర్వాత కనిపించకుండా మాయం అయింది.

అదేరోజు మహేష్ వచ్చాడు.

తిరిగి ఇంట్లో మరో సుదీర్ఘ చర్చ నడిచింది.

''మనం ఇప్పుడు సీరియస్‌గా మాట్లాడుకోవలసిన అవసరం ఏర్పడింది. నాకొచ్చే జీతం ఇంకేమాత్రం చాలటంలేదని తేలిపోయింది. అక్క పరిస్థితి ఏమీ బాగుండలేదు. వాళ్ళే అప్పులు చేసి నెట్టుకొస్తున్నారు. ఇలాంటి సమయంలో మనం ఎక్కువకాలం ఉండటం భావ్యంగా ఉండదు. ఓవేళ వారి ఆర్థిక పరిస్థితి బాగున్నా ఇక్కడ ఉండటం బాగుండదు. కాబట్టి ఏదోఒక నిర్ణయం తీసుకోవాలి'' అన్నాడు మధు.

''ఏం చేద్దామంటావో నువ్వే చెప్పు'' అంది అమ్మ.

''ఇప్పుడు మహేష్ వచ్చారు. నాతోపాటు రాజాను కూడా తీసుకుంటామంటున్నారు. ముందు కీడెంచి ఆతర్వాత మేలెంచుదాం. ఆయన దగ్గర ఉద్యోగం శాశ్వతం కాదని నాకు తెలుసు. అయితే ఓ సంవత్సరమైనా ఉంచుతాడని నేననుకుంటున్నా. నేనూ రాజా పనిచేస్తాం కాబట్టి చాలావరకు ఫర్వాలేదు. ఈ లోపు మంచి ఉద్యోగంకోసం నేను ప్రయత్నంచేస్తుంటాను. నేనేకాదు మావయ్యా వాళ్ళూ ప్రయత్నంచేసి తీరాలి'' అన్నాడు మధు.

''అదికాదురా. నువ్వు ఉద్యోగం మానటం మావయ్యవాళ్ళకు నచ్చదేమో''

''నువ్వు ఏ మావయ్య గురించి మాట్లాడుతు





న్నావో నాకు తెలియదు. మన హనుమంత రావు మావయ్యా గురించి అయితే ఆయన అర్థంచేసుకుంటారు. ఇంక జానకి తరఫున అయితే వాళ్ళకి నచ్చుతుందా లేదా అనేదికాదు సమస్య. మనకీ జీతం చాలటంలేదు. నెలకు మరో రెండు వందలు లేందే మనం ఇక్కడ ఉండలేం. అవాయన పంపలేడు గదా''

''అదికాదురా. మా విషయం వదిలెయ్. మీవరకూ సరిపోతాయి కదా. మీరుండండి. మేం వెళ్తాం'' అంది తలదించుకుంటూ. మధుకోపంతో విరుచుకుపడ్డాడు.

''అంటే నీ ఉద్దేశ్యం ఏమిటి? నన్నువెధవను చేయటమా? ఇందుకోసం నాకు పెళ్ళిచేశావన్నమాట. అయినా నీకు ఏ అన్యాయం చేశాను. ముందునుండీ చెబుతున్నాను కదా. ఈ పెళ్లి వల్ల రాజా చదువుకు ఇబ్బంది అవుతుందన్నా నువ్వు విన్నావా? విన్లా. ఈరోజు నువ్వు, నీ పెళ్ళాం ఉండండి అంటున్నావు. అంటే నీ కొడుకూ పెళ్ళి కాగానే తన సంసారం తను చూసుకుంటూ నిన్ను రోడ్డుమీదకు పంపించాడని ప్రపంచం చెప్పుకుంటుంది. అదేగా నీకు కావలసింది''

''అదికాదురా'' అంటూ ఏదో చెప్పబోయింది.

''ఏది కాదమ్మా... నువ్వు కొంచెం ప్రశాంతంగా ఆలోచించవచ్చు గదా. దాదాపు పదిహేను సంవత్సరాలనుండీ దరిద్రం అనుభవిస్తున్నాం కదా... అయినా ఏం తొందరొచ్చిందని ఇదంతా చేశావు. నాకు పెళ్లికాకపోతే ఛస్తాననుకున్నావా? నీ మూర్ఖత్వంవల్ల మరో పది సంవత్సరాలు మన కుటుంబాన్ని కోలుకోకుండా చేశావ్. అసలు నిన్నిప్పుడు ఏమీ అనకపోతే రాజాకు కూడా పెళ్ళిచేస్తావు'' అన్నాడు నిష్ఠూరంగా.

అమ్మ కళ్ల వెంట నీళ్లు...

మధు కోపం ఒక్కసారిగా దిగిపోయింది. చాలాసేపు మాట్లాడుకోలేదు.

''అన్నీ అయిపోయాక ఇప్పుడు చేయగలిగింది లేదు. మానసికంగా కూడా నేను ఈ ఉద్యోగం చెయ్యలేను. ఓ రకంగా ఈ మహానగరమంటేనే నాకు భయం పుట్టింది. నేనిప్పుడు టాస్ వేస్తున్నాననేది నాకు తెలుసు. అంతగా ఫెయిల్ అయ్యామనుకో. మన ఊర్లో ఏ షాపులోనో చేరితే ఎంతో కొంత ఇవ్వకపోరు. ఈ నగరంలో రెండు వందలొచ్చినా, అక్కడ నూట పాతిక వచ్చినా ఒకటే. మనం అక్కడే బతుకుదాం. అంతేగాని నా బతుకు నన్ను చూసుకో అని మాత్రం అనకు'' అన్నాడు మధు. అదే రోజు 'మహేష్'తో రాజా వెళ్లాలని నిర్ణయం జరిగిపోయింది. నెల రోజుల తర్వాత తను వస్తాడు. ఈ లోపు సామాను అంతా సర్ది ఓ గదిలో ఉంచటం. అక్క వాళ్లు వేరే ఇల్లు చూసుకోవటం అనుకున్నారు.

రెండు జతల బట్టల్తో రాజా మహేష్‌తో వెళ్లిపోయాడు.

''ముందుగా లీవ్‌పెట్టి వెళ్తాను సార్. ఆ తర్వాత అవసరాన్నిబట్టి లీవ్ పెంచటమో రిజైన్ చేయటమో చేస్తాను. ఓ రకంగా నేనే ఉద్యోగం మానేసినట్టుగానే చెప్పుకోవచ్చు. ఇంతకంటే మంచి భవిష్యత్‌ను నేను వెతుక్కుంటూ వెళ్తున్నాను. ఈ ప్రయాణంలో నేను సక్సెస్ అవుతానో, మరింతగా ఓడిపోతానో నాకు తెలియదు. ఒకటి మాత్రం నిజం. ఈ పనిని నేను ప్రేమించాను. నేను ఇక్కడ పనిచేసినంతకాలం మీ అభిమానాన్ని చూరగొన్నాను. నా జీవితంలో తృప్తిని కలిగించే విషయం ఇది. ఇంత కాలం నన్నెంతో అభిమానించారు. సంతోషం- కృతజ్ఞతలు'' అన్నాడు మధు సూపర్‌వైజర్‌తో.

''నువ్వు వెళ్తుంటే నాకు చాలా బాధగా ఉంది. ఇక్కడ రెండు వందల్లో బతకటం కష్టమే. మరో అయిదారు సంవత్సరాలపాటు ఉంటేగాని ఈ ఫ్యాక్టరీ భవిష్యత్ ఏమిటో తెలియదనుకుంటాను. నీకేకాదు నాకూ అంత కాలం ఎదురుచూసే శక్తి లేదనుకుంటాను. ఎనీహౌ ఐ విష్‌యూ ఆల్ సక్సెస్'' అన్నారాయన.

''ఓ రకంగా మిమ్మల్ని చూస్తుంటే అసూయగా ఉంది. నాలా మీ ఎవరికీ వివాహంకాలేదు. అయితే మీకుండే సమస్యలు మీకున్నాయి. ఈ ఫ్యాక్టరీ అభివృద్ధి చెందేంతవరకు

పెళ్ళిళ్లు చేసుకోకండి. నేను ప్రపంచానికిచ్చే నలహా అది''

"ఎప్పుడు వెళ్తున్నావ్'' అన్నారు మిత్రులంతా.

"రేపే మార్చుముప్పై... కొత్త జీవితంలోకి''

* * *

జానకి పొట్టచేత్తోపట్టుకొని "అమ్మా'' అని మూలిగింది.

"ఏమండీ.. అమ్మాయికి నొప్పులు వస్తున్నట్లున్నాయి. రిక్షాను పిలవండి. హాస్పిటల్‌కు తీసుకువెళ్దాం'' అంది జానకి తల్లి.

హాస్పటల్లో బెడ్ మీద విలవిలలాడుతున్నప్పుడు-

జానకి మెదడులో ఆ ఆలోచన ప్రవేశించింది...

"ఏం చేస్తుంటారు ఆయన. ఉద్యోగానికి రాజీనామా ఇచ్చేసి అతని వెంట వెళ్లి ఉంటారా?''

తన ఉత్తరాల్లో ఆ విషయం గురించి రాయనేలేదు. బహుశా తను పదేపదే ఆలోచిస్తానేమోనని కాబోలు. అయినా ఈ ఉద్యోగం మానేస్తారు. ఆయన దగ్గరకు వెళ్తారు. అదేం ఓ చోట ఉండే ఉద్యోగం కాదు. మరి ఎక్కడ ఉండాలి? ? ఎక్కడో చోట ఉంచి తను మాత్రం అటూ, ఇటూ తిరుగుతారేమో! అంటే తిరిగి ఆయనకు దూరంగా బతకాలి. దూ..ర..ం..గా!

జానకి చేతులు ఇనుప మంచానికున్న రాడ్‌ను గట్టిగా పట్టుకున్నాయి. ఒక్కసారి గుండెలవిసిపోయేటట్లుగా అరవాలనుకొంది.. అరిచాననుకొంది..

అప్పుడే మరోశబ్దం వినిపించింది.

"కేర్ కేర్''మంటూ.

"మొగపిల్లవాడు'' అంటున్నారెవరో.

అప్పుడే సికింద్రాబాద్ నుంచి మధు ఎక్కిన ట్రైన్ కదిలింది.

"గుడ్ బైటు భాగ్యనగర్. జీవితంలో మరోసారి బతకటంకోసం ఇటు రావాలని నేను బావించటంలేదు. అలాంటి అవసరం కలగకుండా ఉంటే బాగుంటుంది'' అనుకున్నాడు మధు.

హాస్పిటల్లో ఇరువురి నడుమ నిశ్శబ్దం.

చాలాసేపు పిల్లవాడ్ని చూస్తుండిపోయాడు మధు.

ఎందుకో సంతోషం కలగటంలేదు. బాగా సన్నగా ఉన్నాడనిపిస్తూంది. అంతకు మించిందేదో ఆ మొఖంలో కనిపిస్తోంది.

జానకి మొఖంలోకి నవ్వు తెచ్చుకొంది.

"నేను వచ్చేశాను'' అన్నాడు మధు.

"రాజీనామా చేశారా?''

"చెయ్యలేదు... శెలవుపెట్టివచ్చాను. చేయకపోయినా చేసినట్లే''

ఇద్దరి నడుమా నిశ్శబ్దం.

ఆ క్షణం జానకి హృదయంలో ఎలాంటి అలజడి కలగలేదు. అది ఊహించిందే కాబట్టి.

"ఎల్లుండే ప్రయాణం. రాజా రాజమండ్రిలో ఉన్నాడు. బహుశా నన్ను మద్రాసు పంపిస్తారేమో. ఏమైనా నువ్వు రావటానికి కనీసం అయిదు నెలలైనా పడుతుందని అమ్మ చెప్పింది. తీసుకొస్తే మూడో నెల. లేకపోతే అయిదో నెలట. ఆలోచించుదాం. నేను వెళ్ళగానే లెటర్ రాస్తాను'' అన్నాడు మధు.

మధుతో ఎవరూ ఏమీ అనలేదుగానీ అందరి మొఖాలు వివర్ణమై ఉండటాన్ని గమనించాడు. వారెవరికీ ఈ ఉద్యోగం మానటం ఇష్టం లేదనే విషయాన్ని ఆ మొఖాలు స్పష్టంగా చెబుతున్నాయి. మధు ఎక్కువ సేపు అక్కడ ఉండలేకపోయాడు. బయటకొచ్చి తన చిన్ననాటి మిత్రుల్ని కలుసుకున్నాడు.

అందులో మనోహర్ ఒకడు!

"వచ్చేశారా. జీతం ఏమీ చాలటం లేదు. దానికి తోడు ఇప్పుడు 'నాన్నా' అంటూ ఇంకొకడొచ్చాడు. సరే ఎవరో తన వ్యాపారంలోకి రమ్మని ఆహ్వానించారు. ప్రస్తుతం వెళ్తున్నా. ఇంకా మనకి ప్రభుత్వ ఉద్యోగం సంపాదించటానికి చాలా సంవత్సరాలున్నాయి. ఈలోగా ఏదో ఒక ఉద్యోగం ర లదేమో చూద్దాం. అది ప్రైవేట్ కంపెనీ కాబట్టి క్లరికల్ పోస్ట్‌కు గ్రాడ్యుయేషన్ కావాలట. గవర్నమెంట్‌కు టెన్త్ చాలుగా. ఇంతకూ నువ్వేం చేస్తున్నావ్?''

"ఏముంది మామూలే. వ్యవసాయం. డిగ్రీలో మిగిలిపోయిన గ్రూపులు పూర్తి చేయాల

నుకుంటున్నాను. సాధ్యంకావటంలేదు. ఇంట్లో పెళ్ళి చేసుకొమ్మని గొడవ. ఏమవుతుందో మరి. నాకూ ఉద్యోగం చూసుకుంటే బాగుండునని పిస్తుంది. అయినా మనకు ఉద్యోగాలిచ్చేది ఎవరు చెప్పు?'' అన్నాడు మనోహర్.

మరికొందరు మిత్రుల్ని కలిశాడు. తిరిగి ఆసుపత్రికి వెళ్ళాడు. అక్కడ ఎవరూ లేరు. జానకి మాత్రం ఉంది. తన బిడ్డకేసి ఆప్యాయంగా చూసుకుందప్పుడే.

''నువ్వు పుట్టిన రోజున నేను ఉద్యోగంలో నుండి బైటకి వస్తున్నారా? అయినా ఫర్వాలేదు. మీ నాన్నకు భయాలున్నా కృంగిపోడు. మనకి దరిద్రాన్ని భరించేశక్తి, దరిద్రం మీద సమరం చేసే శక్తి ఉంది... అందుకే నీ పేరు 'సమర్'.''

జానకి కేసి చూశాడు. మామూలుగా నవ్వింది.

''ఎర్రటి అబ్బాయిని కంటానన్నావ్. కన్నావ్. ఈసారి కనాల్సివస్తే ఎర్రటి అమ్మాయిని కంటే బాగుంటుంది.''

జానకి విస్మయంగా చూసింది.

భయానికి లోనైన వ్యక్తిలో తెగింపు మొదలవుతుందని ఆమెకాక్షణం అర్థమైంది.

* * *

మద్రాసు వెళ్ళాల్సిన ప్రయాణంలో చిన్న మార్పు. అందరూ రాజమండ్రికే పయనం ఆరంభించారు. మొదట్లో మధు కొద్దిగా ఆశ్చర్యపోయాడు. అందుకు మహేష్ చెప్పాడు.

''మొదట్లో మిమ్మల్ని మద్రాసు పంపించాలనుకుంది వాస్తవమే. అయితే మన వ్యాపారాన్ని రాజమండ్రిలో కేంద్రీకరించవలసిన అవసరం ఉంది. అక్కడ వ్యాపారాన్ని కొద్దిమంది కంట్రోల్ చేస్తున్నారు. అది మన చేతుల్లోకి తెచ్చుకోవాలంటే మీరందరూ అక్కడే ఉండాలి. నేను మద్రాసు తిరుగుతుంటాను'' అన్నాడు.

రాజమండ్రిలో రాజాను చూశాడు మధు.

వాడి కళ్ళలో ఏమాత్రం ఉత్సాహం లేదు.

అసలక్కడ తిండి బాగుండలేదు. ఎవరెవరో వండిపెడుతున్నారు. అక్కడ తృప్తి కలిగించిన విషయం ఒక్కటే.

గోదావరి!

గోదావరి నడుమ ఇసుక తిన్నెలు!!

అక్కడకు చేరిన నాలుగో రోజు జానకి పంపించిన కవర్ అందింది. అది ఫ్యాక్టరీ నుండి వచ్చింది.

''మీరు ఆరోగ్యం బాగుండలేదని సెలవు పెట్టారు. మీ దగ్గరలోని ఇ.యస్.ఇ. హాస్పటల్లోని డాక్టర్ ద్వారా మీ అనారోగ్యాన్ని ధృవీకరిస్తూ పంపగలరు''

''ఏమిటా ఉత్తరం'' అన్నాడు మహేష్

''ఫ్యాక్టరీ నుండి''

''ఏమిటంట?''

''వెంటనే వచ్చి డాక్టర్ సర్టిఫికెట్ ఇవ్వమంటున్నారు''

''అలాగా'' అన్నాడాయన.

''ఇప్పుడేం చేద్దాం?'' అన్నాడు మధు అతన్ని చూస్తూ.

''మనకు వెళ్ళటం కుదరదుగా?''

''కుదరదు. అందుకే రాజీనామా చేస్తాను''

''చెయ్యండి'' అన్నాడు ఎలాంటి భావం వ్యక్తంచేయకుండా.

ఆరోజే మధు తన రాజీనామాను పంపించాడు.

రెండు నెలలు గడిచాయి...

ఈ రెండు నెలలకాలంలో క్షణం తీరిక లేదు. మధు ఓ వంద రూపాయలు మాత్రం తీసుకున్నాడు. అందరికీ భోజనాలు అక్కడే. తనకేం ఖర్చులేదు. కాగా ఒకేసారి జీతం తీసుకోవాలనుకున్నాడు. అంటే మొట్టమొదటిసారిగా తన జీవితంలో తన జీతమే ఏడు వందల రూపాయలు మిగిల్చాడు. ఊహించుకుంటేనే ఎంతో అద్భుత విషయమనిపించింది.

ఈ నడుమ కాలంలో అప్పుడప్పుడు రాజీనామా చేసి తను తప్పు చేశానా అనిపించేది. మరుక్షణం ఆహం ఉవ్వెత్తున లేచేది. ఏమైనా ఆదినరయిందే. తనకక్కడ ఏ మాత్రం భవిష్యత్ లేదని గట్టిగా చెప్పుకునేవాడు.

రెండు నెలల తర్వాత...

మహేష్ కొడుకులు అక్కడే రంగ ప్రవేశం

చేశారు.

అదేమంత విచిత్ర పరిణామంగా అనిపించలేదు మధుకి. త్వరలోనే అర్థమైంది. మహేష్ తమతో అసలు మాట్లాడటం లేదు. తామెవరో తెలియని వ్యక్తుల్లా ప్రవర్తిస్తున్నాడు. రెండు రోజులు గమనించి తమ అన్న వెళ్ళిపోయాడు.

ఈ రెండు నెలలుగా వ్యాపారాన్ని మహేష్ పరం చేయటంలో తాము విజయం సాధించారు.

ఫలితం ఇది!

విషయం తెలిసి మధు హతాశుడయ్యాడు.

తను మోసగింపబడ్డాడు.

తనే కాదు. తమ్ముడు-అన్న!

కేవలం రెండు నెలల వ్యాపారం కోసం తమను వినియోగించుకున్నాడు.

తనకు ఇచ్చిన వంద రూపాయలే తను పొందిన జీతం!

అక్కడ అన్నం సరిపడక రాజాకు రక్తపు విరేచనాలు!

రాజమండ్రి రోడ్ కమ్ రైలు బ్రిడ్జి మీద నిలబడి చాలాసేపు గోదావరికేసి చూస్తుండిపోయాడు. మధు పెదవులు కంపించాయి.

ఏడుపు రాబోయింది.

అంతలోనే ఆగిపోయింది.

ఎందుకో నవ్వొచ్చింది.

బిగ్గరగా నవ్వాడు.

"రెండు నెలలు. కేవలం రెండు నెలల కోసం ఓ వ్యక్తితో రాజీనామా చేయించటానికి ఏ మాత్రం సంకోచించలేదు.

అర్థరూపాయికి గొంతులు కోసే కర్కోటకుల గురించి విని ఉన్నాడు.

అంతకంటే ఏం తక్కువ ఇది.

పరమ నికృష్టమైన దారుణమైన స్వార్థం ఇది.

★ ★ ★

"జీవితంలో నువ్వేం కోరుకుంటున్నావ్" అన్నాడు మనోహర్ ఓసారి.

తను ఇంటర్ పరీక్షలు అయ్యాక తన బావ దగ్గరికి వెళ్ళిపోయాడు మధు. అక్కడ పనిచేస్తున్నప్పుడు వచ్చిన 'మనూ' ప్రశ్న అది.

"ఈ ప్రపంచంలో దరిద్రం నాకువద్దు. ఈ ప్రపంచంలో దరిద్రం ఎవరికీ వద్దు" అన్నాడు మధు.

"బాగా చెప్పావ్...ఇంకో కోరిక చెప్పు"

"పని చేయాల్సివస్తే అయినవారి దగ్గర పనిచేయటం అంత దురదృష్టం మరొకటుండదు. ఆ స్థితి రాకూడదు"

"అంటే నీకిక్కడ బాగుండటలేదా?"

"బాగుండటంకాదు. ప్రతిక్షణమూ అమ్మ మొహంగుర్తొచ్చి ఉంటున్నా! లేకపోతే పారిపోయి ఉండేవాణ్ణి"

"అంటే నువ్వు ఎక్కువకాలం ఉండవన్న మాట"

"అవును. ఏ క్షణమైనా బయటకు రావచ్చు"

అదే జరిగింది. తన అక్క పెళ్ళి విషయంలో అది బద్దలై బయటకు వచ్చేశాడు. వచ్చాక అనుకున్నాడు.

"జీవితంలో ఇంకెప్పుడూ బావదగ్గరకు వెళ్ళకూడదు. వెళ్ళనే కూడదు"

ఈ పరిణామం తర్వాత బావ నుంచి కబురు వచ్చింది రాజాను రమ్మని.

రాజా సందిగ్ధంలో ఉండిపోయాడు అన్నయ్య బాధపడతాడేమోనని.

మధు రాజాకు చెప్పాడు.

"చూడ్రా...నీ పట్ల నేనే నా బాధ్యత నిర్వర్తించలేకపోయాను. ఇందులో పూర్తి నేరం నాది కాదు. అమ్మది కూడా నేరం అని నేనను. అమ్మ వాళ్ళని విశ్వసించింది. వాళ్ళు ఏదో ఉద్యోగం చూపించగలరని నమ్మింది. మన కోసం కాకపోయినా జానకి కోసం చూడగలరను కొంది. ఈ కాలంలో ఉద్యోగం చూడటం అంత సాధారణ విషయం కాదు. ఇప్పుడు నేను రోడ్డు మీదున్నా! నా వెనకాల జానకి. అమె చేతిలో వాడు. అయినాసరే నేనే బావ దగ్గరకి రాను. ఈ జీవితం ఏమైపోయినా పర్వాలేదు. అంతగా అయితే రిక్షాలాగుతా. రాళ్ళు కొట్టుకుంటా. కానీ నేను వెళ్ళను. నిన్ను పిలిచారు




నువ్వు వెళ్ళాలా వద్దా అనేది నిర్ణయించుకో. నన్ను వదిలేయండి. నేను మూర్ఖుడ్ని. రోడ్డు మీదున్న నేనే నీకేమైనా చేయగలనని చెబితే హాస్యాస్పదంగా ఉంటుంది. నువ్వు బావ దగ్గరకు వెళ్ళావని మాత్రం నేనేం అనుకోను. అంతవరకు చెప్పగలను. నన్ను వరమదారు ఇంగా ట్రీట్ చేశారు. ఆ అనుభవంతో ఆయన మీద వచ్చిన విమర్శలవల్ల మీవల్ల అంత దారుణంగా ఉండకపోవచ్చు. అందుకే చెబుతున్నా. ఇప్పుడు నీ జీవితాన్ని నిర్ణయించుకోవాల్సింది నువ్వు. నా గురించి మీరేం దిగులు పడొద్దు. అమ్మను నీతో ఉంచుకోవాలనుకుంటే ఉంచుకో లేదా నా దగ్గరికి పంపిస్తానన్నానరే. జానకి రావటానికి మరో నెల ఉంది. ఈలోపు నేను ఏదో ఒకటి నిర్ణయించుకోవాలి కదా''

రాజా తలూపాడు.

తర్వాత బావ దగ్గరకు వెళ్ళిపోయాడు అమ్మతో సహా.

★ ★ ★

"ఎక్కడ ప్రారంభమైన నేను ఎక్కడ తేలానో చూస్తున్నావుగా'' అన్నాడు మధు.

మనోహర్ తలూపాడు.

"ఇప్పుడు జీవన పోరాటంలో నాతో పాటు జానకిని, సమర్‌ని ఉంచి అమ్మ వెళ్ళిపోయింది. అమ్మ చేతిని అందుకున్నాడు తమ్ముడు. ఇప్పుడు నాకు బాధలేదు. నా అంతరాత్మకు నేను జవాబు చెప్పుకోగలను. నేను నా పెళ్ళాం, నా పిల్లలు అని అక్కడే కూర్చుని వారిని బయటకు నెట్టేయలేదు. అలా నెట్టేస్తే బాగుండేదని మామయ్యవాళ్ళు అదో తరహా భాషతో చెప్పారు. నేను లేచి వచ్చాను. జానకి మొన్న సమర్‌తో వచ్చింది. నా మీద చాలా కోపంగా ఉంది. అయినా ఆ మొహంలో అదే చిరునవ్వు. తిరిగి కొత్త జీవితం ఆరంభించాలి మనూ... ముందు నేను నా భార్యనూ, పిల్లవాడ్ని తెచ్చుకోవాలి. వెంటనే నాకు ఇల్లు కావాలి. అడ్వాన్స్‌గా ఇవ్వటానికి కూడా నా దగ్గర పైసా లేదు''

రెండురోజుల తర్వాత చెప్పాడు మధు.

"ఇల్లు దొరికింది. ఓ గది. వంటిల్లుకూడా ఉంది. ఏభై అయిదు ఇమ్మన్నారు. ఇస్తానన్నాను. అడ్వాన్స్ ఇవ్వలేనని చెప్పాను. ఫర్వాలేదన్నారు. అమ్మ మంచితనం ఈ ఊర్లో ఇంకా గుర్తుంది. రేపే జానకి వస్తూంది''

జానకి వచ్చింది. అంతకుముందే వాళ్ళ అన్న సామాను తెచ్చాడు. నాలుగురోజులు అటూ ఇటూ తిరిగాక ఓ మిత్రుడు అడిగాడు.

"మన ప్రసాద్ పాన్‌షాపుకు ఓ మనిషి కావాలట. పని చేస్తావా?''

"ఎంతిస్తారు?''

"నూట ఇరవై రూపాయలు''

"ఆనందంగా''

మధుకు మొదటిసారి కిళ్ళీ కట్టినప్పుడు వచ్చిన కామెంట్...

"ఎవరయ్యా నువ్వు దవడ బద్దలు గొట్టావ్?''

"కొత్తసార్''

"ఆ ముక్క ముందు చెప్పాలికదా''

కళ్ళలోకి రక్తం ఎగతన్నుకొచ్చింది.

"సారీసర్'' అన్నాడు తలవంచుకొని.

రెండో కిళ్ళీకడుతూ అడిగాడు

"సున్నం ఎక్కువా? తక్కువాసార్''

మొదటి జీతం అందుకునే రోజు అతను వచ్చాడు.

"కిళ్ళీ చాలా బాగుందయ్యా... వెరీగుడ్''

మధు ఆరోజు తన డైరీలో రాసుకున్నాడు

"ఎక్కడ నువ్వు విఫలం చెందుతావో...

అక్కడే నువ్వు విజయం సాధించు''

★ ★ ★

నూట ఇరవైలో ఏభైఅయిదు అద్దె... మిగిలింది అరవై అయిదు. పిల్లవాడి పాలకు ముప్పై... బియ్యం వస్తాయి. సరుకులు... సరదాలు ముప్పైఅయిదులోనే!

అయినా జానకి వాటితోనే గడిపింది. బూడిదతో పళ్ళు తోముకునేవారు. పదిగంటలకు ఓసారే భోజనం. రాత్రికి సరిపోను ఒకసారే వండుకోవటం. ఎక్కడ ఆదా చేయవచ్చో అంత చేయటం... పెళ్ళినాటి బట్టలు చక్కగా ఉతికి ఇస్తుంది. ఇంటి నుండి చిరునవ్వుతో బయటకు రావటం... తిన్నారో... తినలేదో ఎవరికీ తెలియదు.

వాళ్ళు బాగున్నారు!

రోజులు గడుస్తున్నాయి.

జానకి మరలా నెలతప్పింది.

'సమర్'కి అప్పటికి ఒకటిన్నరసంవత్సరం

"కానీయండి. ఇదికూడా అయిపోతే ఒసారే ఆపరేషన్ చేయించుకోవచ్చు" ఓ సలహా.

"చెయ్యక చచ్చేదేముంది. అంతా అయ్యాక"

తొమ్మిదోనెల జానకి తమ పుట్టింటికి వెళ్ళింది.

అంతవరకూ జరిగిన జీవితమంతా తగాదాలు... ప్రేమ... సూటిపోటి మాటలు... ఒకటే మంచి విషయం.

"వారిద్దరూ చెప్పేవి బయటివారు వినలేదు"

ఏం జరిగినా అన్నీ తమ గది గోడల నడుమే జరిగాయి.

మధు, మనోహర్‌లు తమ పనులు తాము చూసుకుంటూనే యువజన సంఘంలో చేరారు. శెలవురోజుల్లో ఆ కార్యక్రమాల్లో పూర్తిగా నిమగ్నం అయ్యేవారు.

జానకి రెండో కాన్పులో ఎర్రటి ఆడపిల్ల పుట్టలేదు.

"నువ్వు అదృష్టవంతుడివయ్యా" అన్నారంతా.

సన్నగా ఉన్న రెండో పిల్లవాడు మధుకు సంతోషాన్ని కలిగించలేదు.

ఈలోపు ఓ మార్పు జరిగింది.

తన ఓనర్ వేరే వ్యాపారంలోకి వెళ్తూ మధుకు ఆ షాపు అద్దెకిచ్చాడు.

మధు మరో కుర్రాడిని పెట్టుకున్నాడు.

అయిదారు నెలలు గడిచాయి.

యువజనసంఘం కార్యక్రమాలు అధికం అయ్యాయి.

ఓరోజు లెక్కలు చూసుకున్నాడు.

మూడువేల అప్పు...

ఇప్పుడేం చేయాలి?





ఉన్న అర ఎకరం అమ్మి బాకీలు తీర్చితే...

మరి తిండికో!?

అమ్మ వచ్చి ఓ సలహా ఇచ్చింది.

"పొలం అమ్మటం ఎందుకు? జానకి మెడలో గొలుసూ, గాజులూ అమ్మేయ్. ముందు అప్పులు తీర్చు... షాపు ఆయనకిచ్చెయ్యి. తర్వాత ఏదో ఒకటి ఆలోచించుకో. నీకు వ్యాపారం పనికిరాదు"

గొలుసూ, గాజులు అందిస్తున్నప్పుడు నిజంగానే జానకిలో ఎలాంటి బాధలేదు.

"మీరేం బాధపడకండి. మనం ఈ రోజ అమ్ముకుంటున్నాం. నిజమే. మీరు తాగి వచ్చినందుకు, పేకాడినందుకు మనం అమ్ముకోవటంలేదు. మీ వ్యాపారంలో కొంతనష్టం వచ్చింది నిజమే. ఈ నడుమకాలంలో పిల్లలకి జ్వరాలు. ఇద్దరికీ ఎంతవుతుంది. అయినాఫర్వాలేదు. మనం ఇవన్నీ కొనుక్కుంటాం. అందులో నాకెలాంటి సందేహంలేదు. మన కింక ఈ షాపువద్దు. ముందు బాకీలు తీర్చండి"

మౌనంగా వాటిని తీసుకువెళ్ళాడు మధు

అప్పులు తీర్చగా మూడువందలు మాత్రం మిగిలాయి.

"నువ్వూ మీ బావ దగ్గరకు వెళ్ళవచ్చు గదా" ఓ సలహా

"నో... అదీజన్మలో జరగదు"

"అహంకారి"

బిగ్గరగా నవ్వాడు మధు.

తర్వాత ఓరోజు జానకితో చెప్పాడు.

"చూడు జానకీ మూడు సంవత్సరాల క్రితం హైదరాబాద్ నుండి వస్తూ అనుకున్నాను. ఇంకెప్పుడూ ఈ ఊరు రాకూడదని. కానీ నాకు తప్పటంలేదు. నేను మరలా పొట్ట చేత్తో పట్టుకొని అక్కడకే వెళ్తున్నాను. రెండునెలలు మాత్రం ఉంటాను. ఈ లోపు ఏదైనా దొరికితే దొరకుతుంది. లేదా జీవితంలో అప్పుడు ఓ సంచలనాత్మక నిర్ణయం తీసుకుంటాను. ఈలోగా నువ్వు చేయాల్సింది మరోటుంది. మన సామాన్లు సర్ది మీ ఇంట్లో ఉంచు. మీ అందరూ మీ ఇంట్లోనే ఉండండి. నాకు ఉద్యోగం రాగానే నిన్నూ పిల్లల్నీ తీసుకువెళ్తాను"

జానకి ఏం మాట్లాడలేదు.

చాలాసేపటి తర్వాత అంది-

"నాకు మా ఇంటిదగ్గర ఉండాలనిపించదు. అయినా తప్పటంలేదు కాబట్టి వెళ్తున్నాను. మీకు త్వరలో ఉద్యోగం దొరుకుతుంది"

"చూద్దాం. అయితే నువ్వు మీ వాళ్ళకు చెప్పాల్సిన విషయం ఒకటుంది. ఓ వేళ ఉద్యోగం రాకపోయినా మనం బతుకుతాం! ఇంకా మనకంటూ ఓ అర ఎకరం ఉంది. దానికి అయిదువేలు వస్తాయి. మహా అయితే అదే అమ్ముకుంటాం. అయినా మనం చావం. గర్వంగానే బతుకుతాం. నేను రిక్షా లాగుతాను. నువ్వు ఎవరింట్లోనో అంట్లు తోముతావు. నాకేం బాధలేదు. ప్రిస్టేజి అంతకంటే లేదు. సిగ్గు అనలేలేదు.

సిగ్గంటూ పడితే....

ఓ ఆడపిల్లను వదిలించుకోవటానికి ఆరాటపడ్డ మీ వాళ్ళు పడాలి. నన్ను నడిబజార్లో నిలబెట్టి నిలబెట్టి ఆడుకున్న వారు పడాలి.

జానకి కళ్ళవెంట టపటపరాలాయి నీటి బొట్లు.

★ ★ ★

ప్రయాణం....

ఎటునుంచి ప్రారంభమో తిరిగి అటే....

ఎక్కడ అంతమో తిరిగి అక్కడే...

హైదరాబాద్ వెళ్తూ అనుకున్నాడు మధు.

"గతంలో ఓసారి ఇంకెప్పుడూ ఈ ప్రయాణం చేయకూడదనుకున్నాను. ఇప్పుడు ఏమీ అనుకోవటం లేదు. ఈ జీవితంలో ఏమైనా జరగవచ్చు. తిరిగి ఈ ఊరే రావచ్చు. లేదా అక్కడే ఉండవచ్చు. ఇంకా అగాథాల్లోకి జారిపోవచ్చు. లేదా ఉన్నతమైన ఎత్తులకి ఎదగవచ్చు."

అక్క దగ్గర....

సాయంకాలాలు రోడ్లమీద నడిచిపోతుంటే ఓసారి చార్మినార్ ఓసారి ఇంకేదో భవనం.... ఏం కాబోతూంది తన జీవితం.... తనూ.... జానకీ.... ఇద్దరు పిల్లలు... ఇలా రోడ్ల మీద...ఇంకెంతకాలం ఈ రోడ్ల మీద... ఎప్పటికప్పుడు కొద్దిగా విరామం. తర్వాత తిరిగి రోడ్డు మీదికే ప్రయాణం. ఇప్పటిదాకా సాధించిందేమిటి?

ఇద్దరు పిల్లల్ని!

వారికి క్షణం క్షణం రోగాల్ని!!

నెలా పదిహేను రోజులు గడిచేసరికి వెనక్కి తిరిగి వెళ్ళాలనిపించింది.

ఆరోజే ఎవరో బంధువుల వివాహం!

తనూ వెళ్ళాడు.

అక్కడ కలిసాడాయన.

బాబాయి! స్వయానా తన తండ్రికి తమ్ముడు!

ఇన్ని సంవత్సరాలుగా ఏనాడూరాని బాబాయి. తనని చూడగానే కదిలిపోయాడు. ఏం చేస్తున్నావని అడిగాడు. మరునటిరోజు అక్కడే ఉన్నాడు. ఇద్దరూ కలసి ఆయనకు తెలిసిన ఓ వ్యక్తి దగ్గరకు వెళ్ళారు.

ఆయన ఓ ప్రభుత్వ సంస్థ ఛైర్మన్...

"మావాడికి ఎలా అయినా ఓ గుమాస్తా ఉద్యోగం చూపించాలి" అన్నాడు బాబాయి.

"ఓ వారం ఆగి ఆఫీసుకు పంపించు" అన్నారాయన.

వారం రోజులు ఎలాగడుస్తాయా అని ఎదురుచూశాడు మధు.

వారం తర్వాత ఆ ఆఫీస్‌కు వెళ్ళాడు. తనను చూసి లోనకు వెళ్ళారాయన. ఎవరో వచ్చి అడిగారు-

"ఏం చదివావ్?"

"ఇంటర్ పాసయ్యాను"

"గ్రాడ్యుయేషన్ ఎందుకు పూర్తి చేయలేదు?"

"అవకాశం లేక"

"ఇక్కడే ఉండు" అనేసి ఆయన ఎవరితోనో చెప్పి వెళ్ళిపోయారు. కొద్దిసేపటి తర్వాత పిలుపు...

"అప్లికేషన్ రాసివ్వు"

"మహా అయితే రెండునెలలు ఉంటుంది. రోజుకు పదిరూపాయలిస్తారు"

తలూపాడు....!

శెలవలుపోతే తనకు వచ్చేది రెండు




వందల ఏభై రూపాయలు! పండగలొస్తే ఇంకా తక్కువ.

అక్క అంది-

"రెండు నెలలనే అంటారు. రెండు నెలల్లో తీస్తే ఎందుకిస్తారు? అందులో ప్రభుత్వ సంస్థ ల్లో చేరటమే కష్టం. ఆ తర్వాత తప్పకుండా పర్మినెంట్ చేస్తారు."

ఉద్యోగంలో చేరాక లెటర్ రాశాడు మధు.

జానకీ....

కొత్త ఉద్యోగంలో చేరాను. రోజుకి పదిరూపా యలు ఇస్తారు. అంటే రెండువందల ఏభై వస్తుంది. నాలుగు నెలల తర్వాత పి.ఎఫ్. కట్ అవుతుంది. అంటే మన మొదటి జీతమంత వస్తుంది. అయితే నేను ఇక్కడ క్లర్క్ ని. ఈ నడుమ నా పాత మిత్రులు కనిపించారు. ప్రస్తుతం ఫ్యాక్టరీ పరిస్థితి బాగానే ఉందట. మనం వచ్చాక ఆరు నెలలపాటు లాకౌట్ చేశారట. తర్వాత తెరిచినా కొంత కాలం సగం జీతాలంట. కాగా ఈ పరిస్థితి మనకు అప్పుడే వచ్చేదన్నమాట. ఓ రకంగా మనం బయటకు రావడమే సరయిందేమో!

మనకు ఎవరూ సహాయం చేయరు. చేయా లని మనమూ కోరలేదు. మనల్ని ఎప్పుడూ ఆదుకొంది మన మిత్రులే. అయితే మనవా రంతా నా మీద నింద వేశారు. వాడు ఓ చోట పనిచెయ్యడని కానీ ఓ విషయం వారు అంగీక రించరు. నాకు ఫలానా రంగంలో భవిష్యత్ లేదని స్పష్టంగా కనిపిస్తున్నప్పుడు ఎలా వేచి ఉండటం? ఈ ఉద్యోగం రోజువారీ జీతం మీదే. అయితే ప్రభుత్వరంగ సంస్థ. రెగ్యులర్ అయతే ఆరువందలు వస్తుంది. ఇంకా అయి దారు సంవత్సరాల్లో రెట్టింపు అవుతుంది. ఇంకా లోన్లు ఇస్తారు. బోనస్ ఇస్తారు. ఈ ఉద్యోగంలో ఎంత కాలం వేచి ఉండమన్నా ఉంటాను. కొంతకాలం ఆగి మిమ్మల్ని తీసుకు రావటమో, గుంటూరులో మా బ్రాంచి ఉంది కాబట్టి అక్కడకు రావటమో చేస్తాను.

పిల్లలు ఎలా ఉన్నారు? ఈ రెండు నెలల్లో నూ వాళ్ళిద్దరూ చాలాసార్లు నా ఆలోచనల్లోకి వచ్చారు. వాళ్ళకు చేయవలసింది నేను చేయ లేకపోయాను. వాళ్ళకోసం మనం మన అవస రాలన్నింటిని త్యాగం చేశాం. అయినా వాళ్ళ కు ఏమి ఇవ్వలేకపోయాం. మంచి ఆహా రంగానీ... మంచి బట్టలుగానీ... అయితే ఇది వరకటిలా నాకిప్పుడు భయం కలగటం లేదు. దానిస్థానంలో ఎవరి మీదో కసి, చూస్తుండు నేను ఎంత సంపాదించగలనో చూపిస్తా. వాళ్ళి ద్దరికి నా ముద్దులు. 'సమర్'కు ఓ పలకకొని ఇంటిదగ్గర అక్షరాలు రాయిస్తుండు. నేను త్వరలో వస్తాను".

తిరిగి మరో మూడు నెలలపాటు ఇరువురి నడుమా ఉత్తరాలే!

గుంటూరు మార్పించుకునే ప్రయత్నం... రోజువారి జీతం మీద అలా చేయటం కుదర దు. రెండు నెలలు దాటాయి. ఎవరూ తీసివే స్తామనటంలేదు. ఇప్పట్లో రెగ్యులర్ కాగలదన్న ఆశాలేదు. అయితే ఓ మిత్రుడు రాసిన లేఖ చూసుకున్నాక మధులో తిరిగి సంచలనం...

"నేను జానకిని, పిల్లల్ని చూశాను. నేను రాయకూడదుగానీ, నాకు బాధనిపించింది. నాకు వాళ్ళు "జిప్సీల్లా" కనిపించారు".

మధు వెంటనే లెటర్ రాశాడు.

"జానకీ.... నేను బయలుదేరి వస్తున్నా... కొద్దిపాటి సామాను సర్ది ఉంచు. మనం హైద రాబాద్ వస్తున్నాం"




హైదరాబాద్ తిరిగి వచ్చారు.

రెండునెలల్లోనే తిరిగి గుంటూరు...

రెండు సంవత్సరాలు ముందుకు జరి గాయి...

ఈ కాలమంతా బాధలవల్లవే... ప్రతి క్షణ మూ భరించలేని వేదనే.




పిల్లలకు ఒకరి తర్వాత ఒకరికి రోగాలు... మందులు...

ఏనాడూ జీతం రెండువందలు మించలేదు.

అదే ఎనిమిది సంవత్సరాల వైవాహిక జీవితంలోని చిత్రం!

మధులో ఆలోచనలు.... ఎంతకాలం ఇలా? మరేం చెయ్యాలి? వ్యాపారానికి తను పనికిరాడని అనుభవం చెప్పింది. ఈరోజు తిరిగి తను బయటకొస్తే వాడు ఎందులోనూ ఉండడనే దానికి బలం చేకూరుతుంది. మరేమిటి చెయ్యటం? ఏదో ఒకటి చేయాలి? మరలా జీవితంతో టాస్ వెయ్యాలి. అంటే మరోసారి రోడ్డు మీదకు రావాలి. అందుకు మానసికంగా జానకి సంసిద్ధంగా ఉందా? ఏమో!

అయినా ఇప్పుడు మాత్రం ఏముంది? ఏ ఆనందాలు, ఏ సరదాలు ఉన్నాయి. అయితేనేం ఇన్ని సంవత్సరాల అనుభవంలో దరిద్రాన్ని వదిలేస్తే తామెంతో అవగాహనతో బతికారు. తాము తమ కోసం చేతులు జోడించి ఎవరి దగ్గరికీ వెళ్ళలేదు. ముఖ్యంగా తన బావ దగ్గరకుగానీ, జానకివాళ్ళ ఇంటికిగానీ! తమ కష్టాలు తాము పడ్డారు. తమకంటూ సుఖాలు లేకపోయినా తమ బిడ్డల చిరునవ్వులు, ముద్దుమాటలు చూసి మురిసిపోయారు. ముఖ్యంగా జీవితం దీర్ఘకాలంపాటు తమ మీద ప్రసరించిన వాటన్నింటిని ఆత్మవిశ్వాసంతో ఎదుర్కొన్నారు. అదంతా ఓ పోరాటం.

వ్యక్తిగత జీవనంలో పైకి కనిపించనిపోరాటం. అదేమంత సాధారణ విషయంకాదు. అందులో తామిద్దరూ తప్పులు చేయవచ్చు. తొందరపడి ఉండవచ్చు. అంతకంటే వారిద్దరిలోనూ ఒకే భావం.

"నూట ఇరవై రూపాయల్తో మేం బతికాం. రెండువందల్తోనూ బతికాం. జీవితంలో ఇంతకంటే పైకి వెళ్ళకపోవచ్చునేమోగాని ఇంతకంటే దిగజారం"

ఆ విషయంలో ఇద్దరూ గెలిచారు.

అందరూ ఎక్కడ విఫలం కాగలరనుకున్నారో అక్కడే విజయం సాధించారు.

రెండు సంవత్సరాల తర్వాత....

యూనియన్ నిర్మాణం.... ఇతర పరిస్థితులూ అనుకూలించటంవల్ల వారి ఉద్యోగాలు రెగ్యులర్ అయ్యాయి.

ఇన్ని సంవత్సరాల నిరీక్షణ ఫలించింది.

విజయ సోపానానికి మొదటి మెట్టు అది.

మొదటి జీతం ఆరువందల రూపాయలు!

ఒక్కసారిగా మూడురెట్లు పెరిగింది.

ఏమాత్రం ఉప్పొంగి పోలేదు. గత జీవితపు అనుభవాల్ని మరచిపోలేదు. ఇన్ని సంవత్సరాలుగా తామేం కోల్పోయారో వారికి తెలును. అందుకే మెల్లగా ఇటుకలు పేర్చటం ఆరంభించారు.

జీవితం చాలా చిత్రమైంది. ఎందుకంటే ఓ ఉప్పెనలా కష్టాలు విరుచుకుపడతాయి. అలాంటి సమయంలో ఏ రంగంలో కాలుపెట్టినా ఫలితాలు ఎదురుతిరుగుతాయి. అదే మోతాదులో సుఖాలు, అవకాశాలు విరుచుకుపడతాయి. ఈ సమయంలోనే జాగ్రత్తగా ఉండటం అవసరం.

కష్టాల్లో కృంగిపోయినా, సుఖాల్లో విర్రవీగినా భవిష్యత్ ఉండదు.

జీవితం నేర్పిన పాఠం అది!

చూస్తుండగానే తమ కలల ప్రపంచాన్ని వారు నిర్మించుకున్నారు. అదెంత చిన్నదైనా కావచ్చు. తమ కుటుంబం. అందులో తాము. ఇదో అనుభూతి. ఇంకా ఎన్నెన్నో కోరికలుండవచ్చు... ఆశలుండవచ్చు...

ఏదోనాడు అవి సాధించుకోగలమనే నమ్మకం ఉంది.

* * *

మధు తమ జీవితాన్ని ఓసారి సింహావలోకనం చేసుకున్నాడు.

ఇందులో అనేకానేక విషయాలు వదిలివేయబడ్డాయి.

అవన్నీ సంఘర్షణలకు చెందిన అంశాలు.

జీవితంతో పోరాడటంలో ఓ తృప్తి కూడా ఉంటుంది.

అంతేకాదు...

పోరాడేటప్పుడే మనిషిలోని బలాలూ... బల

హీనతలు బయటపడేది. ఈనాడు ఓ రకంగా విరామం దొరికింది. ఈనాటికీ పీడించే సమస్యలు ఎన్నో ఉన్నాయి. అయితే అవన్నీ వెన్వెంటనే పరిష్కరించాల్సినవి కావు.

ఇప్పటికీ కొంత మేరకే కనీస జీవితాన్ని అందించగలుగుతున్నాడు.

అయినా ఏ క్షణం సంక్షోభం వచ్చినా తిరిగి రోడ్డు మీదకు రాక తప్పదు.

రెండు నెలలు జీతం రాకపోతే ఏం చేయాలా అనేది ఈ నాటికీ సమస్యే. అదే తనని బాధించేది.

ఈ ఉద్యోగం తనకు సంతృప్తినివ్వటంలేదు. అంతవరకు వాస్తవం. అయితే ఈ ఉద్యోగం వదిలి వెళ్ళాలని తను అనుకోవటం లేదు. జానకితో అనేకసార్లు తను చెప్పాడు.

...ఒక విషయం మాత్రం వాస్తవం. నేను జీవితాంతం ఇదే ఉద్యోగంలో కొనసాగుతానను కుంటే అది పొరపాటు అవుతుంది. ఏదో రోజు ఈ ఉద్యోగం మానేస్తాను. అయితే ఈసారి గతంలోలా కాదు. నేను ఉద్యోగం మానేసినా, ఈ కుటుంబానికి ఎలాంటి ఇబ్బందులు కలగని స్థితిని సంపాదించాక మానేస్తాను. అయితే ఈ జీవితంలో నాకలాంటి అవకాశం వస్తుందా? తప్పకుండా రాదు? అంటే చివరివరకూ ఈ ఉద్యోగం చేయక తప్పదు.

ఇప్పుడు తను ఉద్యోగం చేసుకుంటూనే తన వంతు కర్తవ్యం నిర్వర్తిస్తున్నాడు. పిల్లలు పెద్దవారవుతున్నారు. చదువులకోసం దూసుకొస్తున్నారు. ముందు ముందు వాటికి చెందిన అనేక సమస్యలు ముందుకు రావచ్చు. అయినా ఫర్వాలేదు. ఇప్పుడు తనకు ఉద్యోగం ఉంది. అవసరమైతే లోన్లు ఇస్తారు. లేదా తన పి.ఎఫ్. నుండి డబ్బు తీసి చదివించగలడు. సమస్య పిల్లలది. వాళ్ళెంత బాగా చదవగలరనే దాని మీద తన శ్రమ ఆధారపడి ఉంటుంది. ఇప్పుడు తను అనుకొంటుంది ఒకటే.

పిల్లలు బాగా చదవాలి. అందుకోసం తను కష్టపడాలి. వాళ్ళు ఏం చదువుతానని ముందుకొచ్చినా తను ఆ బాధ్యత స్వీకరించాలి. కేవలం డబ్బులేదనే కారణంగా మాత్రం వారు తమ చదువుల్ని ఆపకూడదు. వారి విషయంలో అంతవరకే తన బాధ్యత. అంతేకాని వారి ఆనందమయ భవిష్యత్‌కోసం తను లక్షల రూపాయలు సంపాదించి ఇవ్వాలనుకోవటంలేదు. వారు తనలా కాకున్నా శ్రమించి బ్రతకటం అలవాటు చేసుకోవాలి.

పిల్లలు తమ వంతు కృషి చేస్తున్నారు.

అయితే వారు రేపు ఎలా మారుతారనేది ఈనాడు చెప్పబూనటం సాహసం అవుతుంది.

స్థూలంగా తన కుటుంబ జీవిత చిత్రణ ఇది!

సూక్ష్మంగా చెప్పాలంటే ప్రతి చిన్న విషయాన్ని విశ్లేషించాలి. ఈ రోజుకూ ఆ గత స్మృతులు మదిలో మెదులుతుంటాయి. అన్ని విషయాలూ గుర్తుండవు. గుర్తుంచకూడదు కూడా!

తనకు చెందిన గర్వకారణమైన విషయం మరోటుంది.

"ఎక్కడ అపజయం చెందుతాడో అక్కడ విజయం సాధించటం తన విధానం"

తనెందుకూ పనికిరావని తిరస్కరించిన బావే తనను ఈ ఉద్యోగం మానేసి రమ్మని ఆహ్వానించాడు. ఇంతకంటే మంచి భవిష్యత్ అందించగలనన్నాడు.

చిరునవ్వుతో ఆయన ఆహ్వానాన్ని తిరస్కరించాడు మధు.

తన దరిద్రంలో....

ఏఏ వ్యక్తులు తన వల్ల ఎలా ప్రవర్తించారో, తన మెదడులో రికార్డయి ఉన్నాయి. వాటికి చెందిన ప్రకంపనలు తనలో ఎప్పుడూ ఉంటాయి. ఒక్కోసారి అసహజమైన రీతుల్లో కూడా తను బరెస్ట్ అవుతాడు.

మొత్తంమీద చూసినప్పుడు ఈ నడుమ తృప్తికరమైన జీవితాన్ని కొనసాగిస్తున్నారు. మరి ఈ సమయంలో జానకిలో ఎందుకింత స్తబ్దత...? ఎందుకింత పిరికితనం?

జీవితంలో ఎలాంటి సంక్షోభాన్నయినా ఎదుర్కోవటానికి సిద్ధపడిన జానకిలో ఈ ఊగిసలాటలు ఎందుకు వస్తున్నాయి? అత్యంత కఠినమైన, భయానకమైన పరిస్థితుల్ని చిరునవ్వుతో భరించిన జానకిలో ఈ భయాలు ఎందుకొస్తున్నాయి?







ఇందుకు తమ జీవితమే బదులు ఇచ్చి తీరాలి.

మరోసారి తను నెమరు వేసుకున్న విషయాల్లో అదృశ్యంగా ఉన్న దాన్ని వెతుక్కోవాలి. ఏ జ్ఞాపకాల నడుమ దాగి ఉందో ఆ భావం!

అదెంత కష్టమైనా, తనిప్పుడు పరిశోధనలోకి దిగాలి. తప్పదు.

★ ★ ★

ఓసారి తన గత జీవితాన్ని పరిశీలిస్తే ఓ విషయం స్పష్టం అవుతుంది. మొదటినుండీ జానకిలో ఓ లక్షణం ఉంది. అది పరిస్థితులకు అనుగుణంగా తనను తాను రూపుదిద్దుకోవటం. ఉదాహరణకు తనకు దేవుడంటే విశ్వాసం లేదు. ఆమెకు ఉంది. ఈ విషయంలో తమకెప్పుడూ అభిప్రాయభేధాలు రాలేదు.

ఓ రకంగా చెప్పాలంటే తనకు ఇష్టం లేదని చెప్పి తను ఇంట్లో బహిరంగంగా పాటిస్తూ ఉండదు. అలా అని చెప్పి తను మానలేదు. "మీరు చెప్పినట్లే దేవుడు లేడండీ" అనలేదు. జానకిలో లేనిదదే.

అలాగే తను ఏవేవో సంఘాలంటూ వెళ్తాడు. కానీ జానకి రాదు. "నాకు కుటుంబం వరకు చాలు" అంటుంది. జానకిలో లొంగుబాటు లేదు. సాధ్యమైనంతవరకూ ఇంట్లో ఘర్షణను నివారించాలనేదే ఆమె ప్రయత్నం.

మధ్య తరగతి కుటుంబాల్లో ఓ అదృశ్యమైన పోరాటం జరుగుతుంటుంది. భార్యాభర్తలవి పరస్పర విరుద్ధమైన భావాలు. ఎవరి విశ్వాసాలు వారికి అపూర్వమైనవే. అంతవరకు అయితే ఇబ్బంది ఉండదు. కానీ తమ భావాల్ని మాత్రమే రెండో వ్యక్తి ఆమోదించి తీరాలన్నప్పుడు మొదలవుతుంది యుద్ధం

ఎవరి భావాలు వారు కలిగుంటూ ప్రశాంత జీవనాన్ని కొనసాగించవచ్చు. అనేక కుటుంబాల్లో లోపించిందదే. మధు విషయంలో బలం అదే.

జానకిలోనే ఈ సుగుణం ఉంది. ఎందుకంటే తనలో మొండితనం, నిరంకుశత్వం, పురుష అహంకారం కూడా ఉన్నాయి. ఏ మాత్రం పోరాడటానికి జానకి ఉత్సాహం చూ

పించినా ఆ కుటుంబంలో మంచి వాతావరణం దూరమైనట్లే. కొత్తలో ఈ విషయం తెలియని జానకి సంఘర్షించింది. వెంటనే జీవితానుభవంతో తన భర్తతో ఆ రకమైన పోరాటం వలన లాభం లేదని గ్రహించింది.

మధు గమనించని, గమనించినా ఏం చేయలేని ఓ పోరాట రూపం ఆవిడ తీసుకొంది.

అది మౌనంగా ఉండటం!

ఇదో అద్భుత విజయం. ఆమె వరకూ!

అయినా జీవితమన్నాక వచ్చే రకరకాల ప్రభావాలు ఇద్దరి మీద ఉన్నాయి. ఇంతవరకూ వాటిని తమ జ్ఞానం కంట్రోల్ చేస్తూ వచ్చింది.

అదలా ఉంచితే జానకి బాల్యం గురించి తెలియదు. తన పెళ్ళయిన దగ్గర్నుండి ఇప్పటి వరకూ గమనిస్తే ఈ రోజు ఓ అద్భుత విషయం బయట పడబోతోంది.

ఇంతకాలం ఆ విషయం గురించి తనెందుకు ఆలోచించలేక పోయానా అని కూడా అనిపించింది.

తన పెళ్ళికాకముందు తమకేం లేదనే విషయం జానక్కి తెలుసు. తనకు బాగా కోపం అని కూడా తెలుసు. అసలు అంతకుముందు తనను పరీక్షగా చూడలేదుకూడా. అయినాసరే ఈ పెళ్ళికి ఎలాంటి అభ్యంతరం చెప్పలేదు. పెళ్ళయ్యాక కొద్దికాలంపాటు స్నేహితుల్లా ఉందామనే అంశాన్ని అంగీకరించింది.

తను మొదటిసారి హైదరాబాద్ వెళ్తున్నప్పుడూ... తన లేఖల్లోనూ ఓ విషయం ప్రస్తావించేది. "నేను మీరు లేకుండా ఉండలేను. నాకిక్కడ ఉండాలనిపించటం లేదు" మొదట్లో ఈ విషయం గురించి తను నవ్వుకోవటం మించి ఆలోచించలేదు... మొదటి కాన్పుకు ఎనిమిది నెలలు దాటాకగాని వారింటికి వెళ్ళటానికి అంగీకరించలేదు... రెండోసారి దాదాపు పదిహేను రోజుల ముందే వెళ్ళటం...

తను అమ్మగారింట్లో ఎక్కువకాలం ఉండటానికి ఇష్టం చూపించేదికాదు. అందరూ అయిదు నెలలు లేక మూడు నెలలు ఉంటే నెల నుండే రావాలనిపిస్తుందని గొడవ చేస్తుండేది. ఒక్కోసారి తనకు కోపం వచ్చేది. తన దరిద్రంలో ఆమె ఆరు నెలలయినా ఉంటే బాగుండేదనిపిస్తుండేది.

రెండోసారి హైదరాబాద్ వెళ్ళినప్పుడు తనా ఇంటికి వెళ్ళాల్సివచ్చినందుకు ఎంత బాధపడిందో తనకింకా గుర్తు.

ఇవన్నీ ఈనాడు తను గుర్తించగలుగుతున్నాడు. జానకి ప్రవర్తనవల్ల తానెంతో కోపానికి గురయ్యేవాడు. ఒక సందర్భంలో చాలా స్పష్టంగా చెప్పింది.

"మీరు వాళ్ళను నేను వెనకేసుకొస్తున్నాననుకుంటే ఏం చెప్పలేను. వారి సంగతి మనకు అనవసరం. మీరు ఉద్యోగం ఇప్పించలేదు కదా అంటారు. ఆ విషయం వదిలేయండంటున్నా. వాళ్ళు ఉద్యోగం ఇప్పించలేనంత మాత్రాన మనం చచ్చిపోలేదు కదా... లేదా ఇది ఇవ్వండని వాళ్ళను అడగలేదు. మన బతుకు మనం బతుకుతున్నాం. మనకి మంచి రోజులొస్తాయి. పదే పదే వాళ్ళ గురించి ఆలోచించటం ఎందుకు?"

అప్పుడు కూడా తను ఏదో అరిచాడు.

ఇప్పుడు అర్థమౌతుంది. తనకు వారి ఇంటికి వెళ్ళటం ఇష్టంలేదు.

అందుకే రెండోసారి హైదరాబాద్ వెళ్ళినప్పుడు కృంగిపోయింది. అందుకే తన మిత్రుడు 'జిప్సీ'ల్లా ఉన్నారని రాశాడు.

అది గతం...

తమకంటూ జీవితం ఏర్పడ్డాక ఈనాడూ జానకిలో అదే వైఖరి!

సంవత్సరానికి ఓసారి మాత్రం అక్కడకు వెళ్తుంది. రెండు రోజులు మాత్రం ఉంటుంది. తన తమ్ముడి ఇంటికొచ్చేస్తుంది. అప్పుడప్పుడు క్షేమ సమాచారాలు తెలియచేస్తూ ఓ కార్డు రాస్తుంది. ఎంతయినా వాళ్ళు తనను కన్నారు. తనవరకూ మావయ్య మీద అలాంటి అభిప్రాయం లేదు. ఆయన మంచివాడే. మరి తనను గాయపరిచింది ఎవరు... ఆ కుటుంబంలోని వ్యక్తులే...!

వారందరిపట్ల తనకున్నంత వ్యతిరేకత జానక్కిలేదని తను ఆరోపిస్తుంటాడు. అందుకే ఈనాటికీ ఈ అంశంమీదే తగాదాలు జరగటం. ఈ విషయాలన్నీ పరిశీలిస్తే ఒకటి





స్పష్టం. కష్టమైనా, నష్టమైనా, నరకమైనా తన్తో ఉండటం ఇష్టం. రెండోది తన్తోనే కాదు. ఏ వ్యక్తితోనూ ఘర్షణ పడకూడదనే ఆమె భావం. తన భావాల్ని తనలోనే దాచుకోవటం. ఇతరుల ముందు తనన్ను తాను ప్రతిబింబించుకోకుండా ఉండటం ఆమె స్వభావం.

తనలో ఘర్షణకోసం పాకులాడే తత్వం ఉంది. ఘర్షణలో వచ్చే ఫలితాలు ఎంత భయంకరంగా ఉన్నా వాటిని స్వీకరించటానికి తను సిద్ధం. మనసులో ఏమీ దాచుకోకుండా అంతా బయటకు కక్కేయాలి ందే. బహుశా అందుకే హాయిగా నిద్రపడుతుంటాడేమో.

తను బయటకి ఎంతో ఘర్షణ పడుతున్న వ్యక్తిలా కనిపిస్తాడు. జానకి పైకి చాలా ప్రశాంతంగా కనిపిస్తుంది. మానసికంగా ఇరువురూ భిన్నమైన వ్యక్తులు.

కాగా ఆ కుంటుంబంలోనే ఏవో కొన్ని విషయాలు, కొన్ని జ్ఞాపకాలు జానకిని ఇంకా వెంటాడుతున్నాయి. అవన్నీ ఇంతకాలం అదృశ్యంగా ఉన్నాయి. ఈనాడు విరామం దొరికింది. అందేకు వన్నీ ఆమెను కదిలిస్తున్నాయి.

అంతదాకా ఎందుకు తను ఒకప్పుడు 'ఫ్యాన్' కొనుక్కోవటం 'లగ్జరీ' అనుకునేవాడు. అంతేకాదు 'ఫ్యాన్' లేనిదే నిద్రరాదు అని చెప్పేవారిని చూసి నవ్వుకునేవాడు. తీవ్రంగా విమర్శించేవాడు కూడా! ఇప్పుడు రాత్రిపూట కరెంట్‌పోతే విలవిలలాడిపోతాడు. తను బయటకు చెప్పుకోలేడుగాని కొన్ని సుఖాలకు అలవాటుపడ్డాక వాటికి దూరంగా ఉం లంటే బాధనిపిస్తూంది. గతంలో ఎప్పుడూ తనకు ఇలాంటి ఇబ్బందులు కలగలేదు. అసలు బట్టల విషయంలోగాని శరీరం విషయంలోగాని అందంగా ఉండాలనే విషయంలోగాని తనకు మహా నిర్లక్ష్యం- ఒకప్పుడు.

ఇప్పుడు తనలాకా .

తనలో చాలా మార్పులొచ్చాయి. వస్తున్నాయి. ఒకప్పుడు ఏది అనవసరం, ఏది విలాసం అనుకున్నాడో ఇప్పుడు అది కనీస అవసరంగా మారుతూ వస్తూంది. ఓ రకంగా తాము ఈ సమాజానికి చెందిన వివిధ ప్రభావాలకు లోనవుతున్నారు. వస్తువులకు బానిసలవుతున్నారు. ఇదంతా తెలుస్తూనే వుంది. తీరిగ్గా ఆలోచిస్తుంటే ఈ మార్పుపట్ల ఆశ్చర్యం కలుగుతుంది. అయినా తప్పటంలేదు. కాగా వీటిని ఇంకా బాగా అర్థం చేసుకుంటే జానకిలోని ఈ మార్పుకు కారణం అర్థమవుతుంది.

అసలు జీవితమంతా సమస్యలే అయినప్పుడు, సమస్యలే ప్రధానంగా వచ్చినప్పుడు వాటిని ఎదుర్కోవటం మాత్రమే చేశాడు. అంటే ఆ కార్యక్రమంలో మరో విషయం గురించి ఆలోచించే తీరికలేదు. బతుకా. చావా అనేది నిన్నటి నినాదం. ఈరోజు పరిస్థితిలో మార్పు వచ్చింది. ఇప్పటి జీవితాన్ని నిలబెట్టుకోగలమా అనేది ఈనాటి ప్రశ్న.

ఇంతకంటే పైకి వెళ్లాలనేది వేరే విషయం. తిరిగి పాత జీవితం తాలూకు భయంకరమైన అనుభవాల్ని చవిచూడాల్సి ఉంటుందేమోనని భయం. అంటే ఓ తరహా జీవితానికి అలవాటు పడటం జరిగింది. దాన్నుండి దూరం అవుతామేమోననే ఊహే భరించలేనిదిగా వుంది.

ఇప్పుడు జానకి సమస్యేకాదు. పెద్దనాన్న సమస్య కూడా అర్థమవుతుంది. ఆయన విషయంలో తన ప్రాథమిక అంచనా సరయిందే. జానకిలో ఈ భయాలు ప్రాథమిక దశలో ఉన్నాయి. వీటిని ఇక్కడే అడ్డుకోకపోతే, ఆమె ప్రపంచంలో ఆమెను ఉండనిస్తే ఏదోనాడు తనూ డిప్రెషన్‌లోనికి జారిపోవటం తప్పదు. అయితే ఈ సమస్యకు పరిష్కారం ఏమిటి? తను ఇంతవరకూ మానసికంగా ఆలోచిస్తున్నాడు తప్పించి, మరో కోణంలో నుండి చూడటంలేదు.

మనోహర్ మరణం జానకిలో ఓరకమైన భయాన్ని ప్రేరేపించవచ్చు. మనోహర్ మరణమే కాదు. ఏ మరణమైనా భయాన్ని ప్రేరేపిస్తుంది. రోడ్డు మీద ఓ ప్రమాదం జరిగి ఎవరైనా చనిపోతే రెండు రోజులపాటు రోడ్డు మీద ప్రయాణం చేసేటప్పుడు ఎంతో జాగ్రత్తగా ఉండటం జరుగుతుంది. ఆ తర్వాత ఆ విషయం మరిచిపోతాం. మరలా పాత వేగమే. ఇది సహజంగా జరిగే విషయమే. కొందరు ఆ విషయాన్ని మరచిపోరు. అలా అని చెప్పి



రోడ్డు మీదకు రావటానికి ఇష్టపడకపోవటం ఓ రకం. ఆ విషయాన్ని గుర్తుంచుకొని జాగ్రత్తపడటం మరోరకం.

కాగా జానకికి కొన్ని రకాల ఆలోచనలు కలుగుతున్నాయంటే అందుకు కుటుంబ జీవితం, ఆర్థిక పరిస్థితుల్తోపాటు మానసికపరమైన వ్యాధిలాంటిది కారణం కావచ్చా? అందుకు డాక్టర్లు సూచించే మందులు వాడటంవలన ఏమైనా ప్రయోజనం వుంటుందా? అలా అయితే ఓ సైకియాట్రిస్ట్‌ను సంప్రదిస్తే బాగుంటుంది. ఇది కేవలం మామూలు డాక్టర్ నయం చేసేదికాదు. అందుకే ముందో సైకియాట్రిస్ట్‌ను సంప్రదించాలి.

అసలు ఇప్పుడు తనకు భయం అనే విషయం మీదే పరిశోధన చేయాలనే ఆరాటం కలుగుతోంది. తను కొన్ని సంఘాల్లో పని చేస్తున్నాడు. ఆ సందర్భంగా రకరకాల వ్యక్తుల్ని కలుస్తున్నాడు, పరిశీలిస్తున్నాడు. వారిలో వివిధ రకాల భయాలు తను గమనిస్తున్నాడు. అయితే ఇంతకాలం వాటిని పట్టించుకోలేదు. భయం గురించికాని, మరో విషయం గురించికాని సీరియస్‌గా ఆలోచించలేదు. ఇప్పటికయినా మించిపోయిందిలేదు.

భయాన్నుండి జానకినిగాని, భయం నుండి తననిగాని, భయం నుండి ఈ సమాజంలో ఏ ఒక్కరినిగాని బయటకు తీసుకు రావాలంటే ఒకటే మార్గంవుంది.

అది భయం గురించి తెలుసుకోవటం!

తను తెలుసుకున్న అంశం ఏమిటంటే ఓ విషయం గురించి ఏమీ తెలుసుకోనంతకాలం అదో ముడిపదార్థంగా వుంటుంది. 'కిచిడి'లా ఉంటుంది. అర్థం కానట్లుంటుంది. తెలుసుకునే ప్రయత్నం ఆరంభించాక, మొదట్లో కొంచెం కష్టమనిపించినా తర్వాతర్వాత ఆ విషయంలోతులకు వెళ్లవచ్చు. అనుమానాలు... సందిగ్ధత... ఊగిసలాటల్తో సాగే ఆ ప్రయాణంలో ఎన్నో అనుభవాలు... జవాబులు లభిస్తాయి. ఆచరణను మేళవించగలిగితే ఫలితాల్ని సాధించవచ్చు.

అంతేకాదు ఒకే విషయానికి ఎన్నో ముఖాలుంటాయి. వాటిని వివిధ రకాల వారు వివిధ రకాలుగా అర్థం చేసుకుంటారు. వ్యాఖ్యానం చెబుతారు. అందువల్ల సాధ్యమైనంత వరకూ అందరి వాదనలూ, వివరణలూ వినటం, పరిశీలించటం ఎంతో అవసరం.

ఆ డాక్టర్ ఈ భయంపట్ల వివరణ ఇవ్వటానికి కొద్దిగా ఉత్సాహం చూపించగలిగాలి. అంతేగాని దీనివల్ల నా వ్యాపారానికి ఎలాంటి ఉపయోగం అనుకుంటే మాత్రం కష్టం.

ఏదిఏమైనా తనకు ఇప్పుడో సైకియాట్రిస్ట్ కావాలి.

"సారథీ! నాకో సైక్రియాట్రిస్ట్‌ను కలుసుకోవాలనుంది. మనకు తెలిసిన వ్యక్తి ఎవరైనా వుంటే బాగుంటుంది" అన్నాడు మధు.

"దాందేముందిలే చూద్దాం" అన్నాడు సారథి.

"చూట్టం కాదు. ఆయన మనతో స్వేచ్ఛగా మాట్లాడగలగాలి. మనం ఆయన దగ్గరకు వైద్యానికి వెళ్లటం లేదు కదా. కనీసం ఓ గంటయినా మనతోపాటు వివరంగా మాట్లాడాలి"

"తప్పకుండా ప్రయత్నం చేద్దాం" అన్నాడు సారథి.

మరునటి రోజు వచ్చి చెప్పాడు.

"నా మిత్రుడి ఫ్రెండ్ ఈ ఊర్లోనే సైకియాట్రిస్ట్‌గా ప్రాక్టీస్ చేస్తున్నారు. చాలా చక్కగా మాట్లాడుతారు. మనం వెంటనే ఆయన్ను కలుసుకుందాం" అన్నాడు సారథి.

"ముందు వెళ్ళి అపాయింట్‌మెంట్ తీసుకుంటే తీరిగ్గా ఓ రోజు మాట్లాడుకోవచ్చు" అన్నాడు మధు.

ఆ సాయంకాలమే సారథి మిత్రుడితో డాక్టర్ వరుణ్‌ని కలిశారు. మధు ఊహించినట్లుగా ఆయనకు పెద్దవయసులేదు.

ఆయన యువకుడే. చూడగానే ఆకర్షించే రూపం. తమను పరిచయం చేశాక మధు అన్నాడు.

"మీతో కొంచెంసేపు మాట్లాడాలనుకుంటున్నాం"

"ఏ విషయం గురించి?"

"భయం... భయం గురించి. మీకు అనేక రకాల కేసులు వస్తుంటాయి. మానసికపరమై





నవి. ఆయా కేసుల స్వభావం ఏమిటి? మీ ట్రీట్‌మెంట్ పద్ధతులేమిటి? కేవలం మందుల వల్లనే ఈ వ్యాధులు తగ్గుతాయా... అలాంటివి''

''మీరు రచయితలా'' అన్నారాయన.

''కాదు''

''ఏం లేదు ఇంత డీటైల్డ్‌గా అడుగుతుంటే రచయితలేమో అనుకున్నాను''

''రచయితను కాదుగానీ ప్రజాసంఘాల్లో పని చేస్తున్నాను. 'భయం' గురించి సమగ్రంగా తెలుసుకోవాలనే ఆరాటంతో మీ దగ్గరకొచ్చాం'' అన్నాడు మధు.

''సమగ్రంగా అంటే అది సాధ్యపడుతుందా? ఓ.కె. మనం ఓ పని చేద్దాం. రేపు ఆదివారం మీరు మా ఇంటికి రాగలరా?''

''తప్పకుండా, సంతోషంగా'' అన్నాడు మధు.

''అలాగే ఇంకోపని చేయండి. మీకేం కావాలో ముందు క్లియర్‌గా నిర్ణయించుకోండి. మీరేం అడగాలనుకుంటున్నారో ఓ క్రమంలో ప్రశ్నావళిగా తయారు చేసుకోండి. లేకపోతే మనం అసలు విషయాలు వదిలిపెట్టి వేరే అంశాల్లోకి పోవచ్చు.''

''నిజమే సార్...మేం ప్రశ్నలు తయారు చేసుకొస్తాం.''

''రేపు ఎన్నింటికి రమ్మంటారు?''

విజిటింగ్ కార్డ్ అందిస్తూ చెప్పారు వరుణ్.

''పది గంటలకల్లా వచ్చేయండి.''

★ ★ ★

మధు, సారథి సరిగ్గా పదిగంటలకల్లా డాక్టర్ ఇంటిముందున్నారు. బయట ఉన్న ఓ కుర్రాడికి విజిటింగ్ కార్డ్ అందించారు.

''కూర్చోండి'' అంటూ డ్రాయింగ్ రూంలోని సోఫాలు చూపించి లోనికి వెళ్లాడు. అయిదు నిముషాల తర్వాత డాక్టర్ వరుణ్ ప్రవేశించారు.

''హలో'' అంటూ.

''గుడ్ మార్నింగ్‌సర్'' ఇద్దరూ విష్‌చేశారు.

''ప్రిపేర్ అయి వచ్చారా?'' అన్నారాయన నవ్వుతూ.

''లేదుసార్... వేరే పనుల మీద రాత్రి కుదరలేదు. మనం ఇష్టాగోష్ఠిలా మాట్లాడుకుందాం. భయానికి చెంది మీరు చెబుతుండండి. మాకేమైనా అనుమానాలొస్తే అడుగుతుంటాం'' అన్నాడు మధు.

''ఇట్సాల్‌రైట్'' అన్నారాయన.

మధు ప్రారంభిస్తూ అడిగాడు.

''భయం అనేది ఓ వ్యాధా?''

''నో... భయం అనేది ఓ జబ్బుకాదు. ఇప్పుడు మనం వున్నాం. ఇలా కూర్చున్నాం. ఈ రూంలోనికి ఓ పాము వచ్చిందనుకోండి. ఏం చేస్తాం. మీకు శరీరం బిగుసుకుపోయి చెమటలు పట్టవచ్చు. నోటి తడారిపోవచ్చు. వెంట్రుకలు నిక్కబొడుచుకోవచ్చు. వారేమో మనల్ని వదిలేసి. అమాంతం లేచి పారిపోవచ్చు. నేను అసంకల్పితంగా ఎగిరి టేబుల్ మీద కూర్చోవచ్చు. లేదా కేకలు వేయవచ్చు. ఇది సహజమైన భయం. ఇది జబ్బు కాదు.

అయితే సహజమైన భయాల విషయంలో కూడా అందరూ ఒకేలా ప్రవర్తించరు. ఆ విషయం నోట్ చేసుకోవాలి. ఆయా వ్యక్తుల మానసిక పరిస్థితినిబట్టి అది వుంటుంది. మనందరం పాముని చూసి భయపడితే మా బోయ్‌లాంటివారు కర్రతో కొట్టడానికి ముందుకు రావచ్చు. అలా...

ఎందుకని మనం భయపడుతున్నాం.

''అది పాము కాబట్టి. అది కరిస్తే మనం మరణిస్తాం కాబట్టి. అందుకే చీమ అంటే భయపడం. అది కుడితే చావు రాదు కాబట్టి. పాము గురించి తెలిసినవారెవరైనా తప్పకుండా భయపడతారు. లేదా దాన్నుండి తమను తాము కాపాడుకోవటానికో, దాన్ని చంపటానికో, దానికి దూరంగా పారిపోవడానికో ప్రయత్నిస్తారు. దీన్ని సహజ భయం అంటారు. నేను కేవలం 'పాము'ను ఉదాహరణగా తీసుకొని చెప్పాను. ఏవిషయానికయినా దాన్ని అన్వయించుకోవచ్చు. కాబట్టి సహజమైన భయాలు గురించి మనం కంగారు పడవలసిందేం లేదు.

అదసలు వ్యాధి కాదు. అదో సహజలక్షణం. మానవులందరిలోనూ కనవడేది.

రెండోది ఆందోళన... అదే యాంగ్జయిటీ. 'యాంగ్జయిటీ' అనే మాటకు తెలుగుపదం 'ఆందోళన' అవుతుందో, కాదో నాకు తెలియదు. భయానికి చెందిన ఓ స్థితి ఇది. ఈ యాంగ్జయిటీలో లేనిది ఊహించుకోవటం జరుగుతుంది. ఈ గదిలో ఏమీ ఉండదు. ఓ పెద్ద పాము ప్రవేశించి ద్వారానికడ్డంగా నిలబడుతుందేమో అనిపించవచ్చు. అలాగే మీరు సీలింగ్ ఫ్యాన్ క్రింద కూర్చున్నారు. అది ఊడి మీ తలమీద పడుతుందేమో అని భయం కలగవచ్చు. అలాంటి ఆలోచన వస్తే మీరింకే మాత్రం ఫ్రీగా ఉండలేరు. ఆందోళనతో మీరు చిత్రమైన మానసిక ప్రవృత్తికి లోనుకావచ్చు. అంటే లేనిదాన్ని ఉన్నట్లుగా ఊహించుకొని భయపడటాన్ని 'యాంగ్జయిటీ'గా చెప్పుకోవచ్చు. ఇది రోగానికి చెందిన లక్షణమే'' అన్నారు డాక్టర్ వరుణ్.

''ఒక్క చిన్న విషయమండి. లేనిది ఊహించుకోవటం గురించి ఉదాహరణకు పాము ఉంది. అది కరిస్తే చావటం వాస్తవం. అలానే సీలింగ్ ఫ్యాన్ పొరపాటున ఊడటానికి అవకాశం ఉంది. అలానే రోడ్డు మీదమనం నడుస్తున్నాం. ప్రమాదం జరగటానికి అవకాశం ఉంది. ఇవన్నీ లేనివికాదుగదా. వీటికి ప్రపంచంలో అస్తిత్వం ఉందికదా... అంటే భౌతికంగా ఈ వస్తువులో, విషయాలో మన ముందున్నవే కదా?'' అన్నాడు మధు.

''నిజమే... ఈ ప్రపంచంలో మనం చూడని వాటిని గురించి ఊహించటం వేరే విషయం. దేవుణ్ని దెయ్యాన్ని ఎవరూ చూడకపోయినా, మన రచయితలూ, సినిమావారు రూపాన్నే తయారు చేశారు. ఇంకోమాటలో అవన్నీ మానవుడినో, జంతువుల్నో పోలి ఉంటాయి. అయినా కూడా వాటిని ఊహించుకుంటారు. మీరన్నట్లు రోడ్డు మీద ప్రమాదం జరిగే అవకాశం ఉంది. దానికోసం జాగ్రత్తగా ఉండడం కూడా అవసరమే. అయితే రోడ్డు మీద నడుస్తున్న వారంతా చనిపోతుంటే అది సహజ విషయం అవుతుంది. ఇంకో విషయం ఈ గదిలో ఇప్పుడు పాము లేదు. అంటే అర్థం దేశంలో ఎక్కడా లేవనికాదు. ఇక్కడ లేనిదాన్ని ఊహించుకొని, భయపడటాన్నీ ప్రవర్తించటాన్నీ యాంగ్జయిటీ అంటాం. ఫాలో అవుతున్నారా?'' అన్నాడు డాక్టర్ వరుణ్.

''అర్థమైంది డాక్టర్. నాక్కావలసిన పాయింట్ ఏమిటంటే ఏంగ్జయిటీ లేక అనవసర ఆందోళన అనేది ఓ రకంగా రోగలక్షణమే. అయితే మనసులో ఇలాంటి భావాలు వస్తున్నాయంటే ఆధారం ఎక్కడో ఉందని. అదివారి అనుభవం కావచ్చు. లేదా విన్నదో, చదివిందో, చూసిందో కావచ్చు- అంతేగా''

''ఖచ్చితంగా. మనం ఆ ఆందోళన వెనకున్న విషయాన్ని గ్రహించగలగటమే ఇందులో గొప్ప విషయం అవుతుంది. ఇంక మూడోది 'ఫోబియా' అంటారు. అంటే 'భీతి'. అనమంజసమైన 'భీతి'ని మనం ఫోబియా అనవచ్చు. మరోసారి చెబుతున్నాను. తెలుగు అనువాదంతో కొంచెం ఇబ్బందికరంగా ఉంటుంది. ఇదంతా ట్రూటాన్స్‌లేషన్ కాదు. ఇర్రేషనల్ ఫీలింగ్స్ అన్నమాట. ఈ ఫోబియాలగురించి చెప్పాలంటే పది, పదిహేను రోజులు పడుతుంది. అసలదో పెద్ద సబ్జెక్ట్.

'ఫోబియానే'కాదు. 'యాంగ్జయిటీ'గానీ 'ఫియర్'గానీ అంతే. ఈ ఫోబియాల్లో ముప్పై అయిదు రకాల దాకా ఉన్నాయి. 'క్లాస్ట్రోఫోబియా', 'ఎగరోఫోబియా', 'ఆల్గోఫోబియా', 'హెమోఫోబియా', ఇలా రకరకాలు. ఇంకా వివరంగా చెప్పాలంటే కొంతమందికి ఏకాంతంగా ఉండాలంటే భయం. ఏకాంతంగా ఉంటే వారింకేమాత్రం స్థిమితంగా ఉండలేరు. కొంతమందికి రక్తం చూస్తే చాలు కళ్ళు తిరిగిపోతాయి. అందుకే వారు రక్తానికి దూరంగా ఉండాలనుకుంటారు. కొందరికిఎత్తయినప్రదేశాలంటే భయం. అక్కడ నుండి దూకి చచ్చిపోవాలనిపిస్తుంది. అయితే వీటన్నింటినీ మన ఇంగితం కంట్రోల్ చేస్తుంది. చచ్చిపోవాలనుకున్నప్పుడు... చావటం ఏమిటి? జీవితం చాలా విలువైనది. అసలు నువ్వు చచ్చిపోయావనుకో నీ కుటుంబ పరిస్థితి ఏమిటని తన జ్ఞానం తనని నిలదీస్తుంది. అప్పుడు ఆ భావనలోనుండి బయటకొస్తారు. అలాగే చీకటి గురించో, మరోటి గురించో భయపడుతుంటారు. ఈ ఫోబియా కలవారు అలాంటివాటికి దూరంగా ఉండాలని ప్రయత్నిస్తారు''




"ఈ ఫోబియాలకు గురైనవారికి ఉన్మాదం అదే పిచ్చివచ్చే అవకాశం ఉన్నదా?" అన్నాడు మధు.

"పిచ్చి అనేదివేరు. దానికీ, దీనికి సంబంధంలేదు. అయితే ఓ విషయం ఏమిటంటే ఫోబియా అనేది ఓ వ్యాధి. అలాగే వ్యాధికాదు" అన్నారు డాక్టర్ వరణ్.

మధు సారధికేసి చూశాడు. సారధికూడా జ్వరం గురించి ఇలానే చెప్పాడు.

"ఫోబియా" అనేది మరో వ్యాధి లక్షణంగా బయటపడవచ్చు. లేదా 'ఫోబియా'నే ఓ వ్యాధిగా రావచ్చు. ఫోబియా అనేది 'డిప్రెషన్'కు చెందిందయితే డిప్రెషన్‌కు మందులు వాడతాం. అలాగే 'స్కిజోపేర్నియా'కు చెందిందైతే దానికి మందువాడతాం. మీరు నిన్న అడిగారు ఇలాంటి వ్యాధులన్నీ మందులకు తగ్గుతాయా అని. చాలా మంచి ప్రశ్న. కొన్ని వ్యాధులకు డ్రగ్స్ వాడుతుంటాం. దాంతోపాటు 'సైకోథెరఫి', 'బిహేవియర్ థెరఫి' 'రిలాక్సేషన్ థెరఫి' ఇంకా చాలా పద్ధతులున్నాయి. ముందే చెప్పినట్లు వేటికవే ప్రత్యేకమైనవి. ఇంటర్ లింక్ ఉన్నవికూడా. అవన్నీ వివరంగా చెప్పటం సాధ్యంకాదు. రోగి, రోగం, అతని గత చరిత్ర, మానసిక స్థాయి, శారీరక నిర్మాణం ఇవన్నీ వైద్యం దృష్టిలో తీసుకోవాల్సిన అంశాలే. కొంచెంసేపు సబ్జెక్ట్‌కు దూరంగా మాట్లాడతాను" అన్నారు డాక్టర్ వరుణ్.

"చెప్పండి"

" ఈ వృత్తిలో ఉండి ఇలా మాట్లాడటం సమంజసమా అని ఎవరైనా అంటారేమో! ఈ దేశంలో మా ప్రొఫెషన్ నథింగ్‌బట్ బిజినెస్ అయింది. వైద్యం వ్యాపారంగా వృద్ధి చెందుతూంది. ఈ దేశంలో ఉన్నన్ని మందులూ, టానిక్కులూ ఏ దేశంలోనూ వాడరు. కేవలం రెండువందలలోపు డ్రగ్స్‌మాత్రం భారతదేశంలో వచ్చే వ్యాధుల్ని నయం చెయ్యగలవు. బలంకోసం అని చెప్పబడే టానిక్స్‌లో ఉన్న కంటెంట్‌కూ, వాటిధరకూ అసలు సంబంధమేలేదు. అయినా మేం టాబ్లెట్స్ రాస్తున్నాం, టానిక్స్ ఇస్తున్నాం. పెద్దపెద్ద దేశాలు ప్రమాదం అని వారి దేశాల్లో నిషేధించిన మందుల్ని ఇక్కడ అమ్ముతుంటే చూస్తున్నాం. ఓ రకంగా మా వృత్తిలో తొంభై తొమ్మిది శాతంమందిమి రోగియొక్క జబ్బుమీదే బతుకుతున్నామనేది నగ్నసత్యం" అన్నారాయన.

మధుకు ఎందుకో మనోహర్ గుర్తొచ్చాడు.

చివరిరోజున వాడి ఆవేదన గుర్తొచ్చింది.

ఒకటి మాత్రం నిజం!

ఎవరు ఏ వృత్తిలో ఉన్నా ఎలా సంపాదిస్తున్నా ఎలా జీవిస్తున్నా ఏదో ఒకరోజు తమ జీవితాన్ని జీవన విధానాన్ని సమీక్షించుకు తీరతారు.

"ఇదంతా ఎందుకు చెబుతున్నానంటే" అని తిరిగి ప్రారంభించాడు డాక్టర్ వరుణ్.

"మీరు మెడిసిన్స్‌కు ఈ రోగాలు తగ్గుతాయా అని అడిగారు. తగ్గుతాయి. తగ్గవు. కొన్ని తగ్గేవి ఉన్నాయి. మరికొన్ని తగ్గవు. అయితే ముఖ్యంగా రోగియొక్క మానసిక ఆరోగ్యం విషయంలో కూడా డాక్టర్ తగినంత శ్రద్ధ తీసుకోవాలి"

"భయానికి చెందిన విషయాల్లో ప్రకృతికి ఏమైనా సంబంధం ఉంటుందా?" అన్నాడు మధు.

"ఎందుకుండదు. మీరు నడిచివస్తున్నారు. అకస్మాత్తుగా తుఫాన్‌వచ్చింది. అందులో మీరు చిక్కుకుపోయారు. అప్పటినుండి మీకు తుఫాన్ అంటే భయం. అలానే వానకురుస్తుంది. మీరో చెట్టుక్రిందకు వెళ్ళారు. మీ కళ్ళఎదుటే ఓ పిడుగుపడింది. జీవితంలో మీకు వానంటే భయం కలగవచ్చు. అలాగే ఒక్కసారే గాఢాంధకారం ఏర్పడితే భయంరావచ్చు. ఇలా కొన్ని భయాలకి ప్రకృతిలో మార్పులు కూడా కారణం కావచ్చు"

"ఇంకో చిన్న ప్రశ్న"

"అడగండి"

"భయానికి ఆర్థిక పరిస్థితులు కారణం కావచ్చా?"

"వైనాట్... ఎందుకు కాకూడదు. భయానికి ఏదైనా కారణం కావచ్చు"

మధుకు ఈ వివరణ ఎందుకో తృప్తినివ్వలేకపోయింది. ఇంకా ఆ విషయం గురించి ఆయన వివరిస్తే బాగుండుననిపించింది.

తిరిగి ఆయనే మొదలుపెట్టారు.

"ఈ రోజుల్లో చిత్రమైన ప్రవృత్తి కలవారుంటారు. వారికి ఏ రోగం వచ్చినా మందుబిళ్ళలివ్వాలి. టానిక్‌లివ్వాలి. ఇంజెక్షన్లు చేయాలి. ఇవి అవసరంలేదని చెప్పామనుకో. డాక్టర్‌నే నమ్మరు. రోగాన్ని డబ్బు చేసుకోవటం ఓ పద్ధతి. అయితే ఇలాంటప్పుడు రోగి స్థితిని బట్టి వ్యవహరించకపోతే బోర్డ్ తిప్పుకోవాల్సిందే. రోగిని ముందు మన కంట్రోల్‌లోకి తెచ్చుకోవాలి. అంటే రోగి చెప్పేది వినాలి. ఈ దేశంలో ఎక్కువ పేదరికం ఉంది. దాంతో అజ్ఞానమూ ఉంది. తమ బాధ ఏమిటో వారికే స్పష్టంగా తెలియదు. ఏదేదో చెబుతుంటారు. ఇద్దరు ముగ్గుర్ని విన్నాక డాక్టర్‌కు విసుగుపుడుతుంటుంది. ఇందులో ఒకర్ని అనాల్సిన పనిలేదు. కొన్నిదేశాల్లో ప్రతి నాలుగయిదు వందలమందికి ఓ డాక్టర్ ఉంటాడు. మరి మనకు అలాంటి స్థితి ఎప్పుడు వస్తుందో. అంతేకాదు వారంతా రోగాలు వచ్చే పరిస్థితులకు వ్యతిరేకంగా పోరాడుతున్నారు. ఈ దేశంలో డాక్టర్లు చాలరు. ఉన్నవారికి పనిలేదు. ఈ దేశంలో అడుగడుగునా రోగాలే ఉన్నాయి. అదే చిత్రం. సరే విషయానికొస్తాను.

"అలాంటి రోగులు ఉన్నప్పుడు వారి తృప్తి కోసం తప్పకుండా డ్రగ్స్ ఇస్తాం. అయితే వీటికి మించినవి ఇందాక నేను చెప్పిన చికిత్సా విధానాలు. మీరు గ్రహించాల్సిందేమిటంటే ఈ విధానాలకు ఏ మతంతోనూ సంబంధంలేదు"

మధుకు ఇప్పుడు ఉత్సాహం వచ్చింది.

"మతపరంగా వ్యాధుల్ని నయం చేయవచ్చా?" అన్నాడు.

"నయం చేయవచ్చని వారంటారు. అలా అనేవారంతా మా దగ్గరకొస్తుంటారనేది ఓ వాస్తవం. రెండోది ముక్కుమూసుకొని తపస్సు చేయటమే అన్ని సమస్యలకు పరిష్కారం అని చెప్పేవారున్నారు. అంటే అలానే చెప్పారనికాదు. ఆ నడుమ ఒకాయన తన యోగమహిమతో అంతరిక్షంలోనే స్కైలాబ్‌ను ధ్వంసం చేయగలనని ప్రకటించాడు. అది సముద్రంలో కూలిపోవటానికి తన ప్రతిభే కారణం అని ఆయన నమ్మవచ్చుకూడా. అలాగే ఈ దేశంలోనూ, ప్రపంచంలోనూ అనేక వైద్యవిధానాలున్నాయి.

అల్లోపతి, హోమియో, ఆయుర్వేదం, యునానీ, నాటువైద్యాలు, చేపపిల్లల వైద్యాలు... ఇంకా ఆక్యుపంచర్, హిప్నాటిక్ పద్ధతులు... ఇంకా రకరకాలుగా... మేం నయం చేస్తాం ఎలాంటి రోగాన్నయినా అంటూ ఓ డాక్టర్‌గారి ప్రకటన... నా దీర్ఘరోగం ఫలానా డాక్టర్ చిటికెలో మాయంచేశాడు అని రోగి హామీ... ఇవన్నీ రోజూ చూస్తున్నాం కదా" అన్నారు డాక్టర్ వరుణ్.

మధు, సారథి నవ్వారు.

"మనం మరీ ఓ డ్రై సబ్జెక్ట్‌మీద చర్చ జరుపుతున్నాంకదా. కొంచెం రిలాక్సవుదాం. మీరు కాఫీనా కూల్‌డ్రింక్సా ... ఏం తీసుకుంటారు?" అన్నారాయన.

"మేం వచ్చేముందు తాగివచ్చాంసార్" అన్నారు.

"జస్ట్ ఫార్మాలిటీ... అంతే"

"కాఫీ" అన్నాడు మధు.

"ఒరేయ్ గోపీ... మూడు కాఫీపట్రా" అన్నాడు డాక్టర్.

"అవునూ ... ఈ సబ్జెక్ట్‌మీద మీకెందుకు ఇంట్రెస్ట్ కలిగింది?" అన్నారాయన. మధు ముందు నవ్వాడు. ఆ తర్వాత సర్దుకొని చెప్పాడు–

"నా కుటుంబానికి చెందిన సమస్య. అసలా మాటకొస్తే నేను చూస్తున్న వ్యక్తుల్లో ఎందరినో ఈ భయం పీడిస్తోంది. నా భార్య పైకిచెప్పదు. కానీ ఆమె భవిష్యత్ గురించి భయపడుతోంది. ఆమె మందులు వాడదు. డాక్టర్‌కి చూపించుకోమంటే చూపించుకోదు. మరి సమస్యను ఎలా పరిష్కరించాలనేది నా బాధ. అందుకే మిమ్మల్ని కలుసుకున్నాను. మీరు చెబుతుంటే, లోతులకెళ్తుంటే ఇదేం సామాన్య విషయంలా కనపడటంలేదు" అన్నాడు మధు.

"ముందు నా మిత్రుడొచ్చి నాతో మాట్లాడాలంటున్నారు అంటే ఏ నవలలో రాస్తున్నారనుకున్నా. ఈ నడుమ మన రచయితలు ఇన్‌ఫర్




మేటిక్ నవలలు రాస్తున్నారు కదా... అలా ఏమైనా ఇంటర్వ్యూకి వచ్చారేమో...నా ఫొటో కూడా పేపర్లో పడుతుంది కదాని సంతోషించా ను'' అన్నాడు నవ్వుతూ.

గోపి కాఫీ అందించాడు. సిప్ చేస్తూ అన్నా రాయన–

''తర్వాత ఈ విషయంగురించి నిన్ననే మాట్లాడేద్దామనుకోండి. బట్ నేను ప్రిపేర్‌కావా లికదా. అందుకే ఈ రోజు రమ్మన్నాను'' అన్నా రాయన.

ఆయన ఫ్రాంక్‌నెస్ వారిద్దరికీ నచ్చింది.

''ఏదియేమైనా ఓ డాక్టరుకుగాని, మరో ప్రొఫెషన్ ఉన్న వ్యక్తులకిగాని ఓ సోషల్ అవుట్‌లుక్ ఉండాలండీ. మా దగ్గర చూ పించుకోవటానికి పదిరూపాయలు అప్పు తెచ్చుకున్న వ్యక్తికి చక్రకేళీ అరటిపళ్ళు తిను. పాలు సంపూర్ణ ఆహారం అని చెప్పామ నుకోండి మన రేడియోల్లో ఉదయమే చెప్పే సూక్తిముక్తావళిలా ఉంటుందికదూ'' అన్నారా యన.

తిరిగి నవ్వారు.

''మన ఎన్విరాన్‌మెంట్ ఐ మీన్ ప్రకృతి లోనే కాదు సోషల్ కండీషన్స్‌లోనూ చాలా ఛేంజెస్ వస్తున్నాయండీ. ఓ డాక్టర్‌గా వీట న్నింటినీ మేం పరిశీలించాలి. ఆపరేషన్ థియేటర్, ఆ హాస్పిటల్ మించి ప్రజల జీవి తంతో ఏ సంబంధం లేకపోయినా డాక్టర్‌గా ఎదగటం కష్టం. ఐ మీన్ అతనో డాక్టర్ అంతే. గుడ్ డాక్టర్ మాత్రంకాదు. అందుకే ప్రతి డాక్టర్ ఓ సైకాలజిస్ట్‌కూడా. మీరు వచ్చారు– వ్యక్తిగతంగా నాకెంతో సంతోషంగా ఉంది. ఒక్క భయాన్ని గురించేకాదు ప్రతి విషయం గు రించి మనం చర్చించాలి. వాటి డెప్త్‌లోకి వెళ్ళాలి. నిర్ణయాలకు రావాలి. ఏమంటారు?'' అన్నారాయన.

''మీరు స్టూడెంట్ లైఫ్‌లో ఏమైనా యూని యన్స్‌లో పనిచేశారా?''

''లేదండి ... ఒక్కోసారి బాధపడుతుంటా నుకూడా. కానీ ఈ నడుమ తెలుసుకోవాలనే ఆరాటం కలుగుతోంది. ఎనీహౌ – మనం కొంచెం రిలాక్సయ్యాంకదా సబ్జెక్ట్‌లోకి వెళ్దాం'' అన్నారాయన.

''రోగాల్ని నయం చేయటంలో ఏ విధానం మంచిదనేది అనవసరమైన చర్చ. ఎవరి పద్ధ తులు వారివి, ఎవరి నమ్మకాలు వారివి. ఇప్పు డు వివిధ చికిత్సా విధానాల్ని గురించి మాట్లా డుకుందాం. వీటన్నింటికి రకరకాల పేర్లు న్నాయి. ఆ పేర్లు చెప్పుకుంటూపోతే గందరగో ళంగా ఉంటుంది. అందుకే కొన్ని చికిత్సా విధానాల గురించి పేర్లు లేకుండా చెబుతాను.

భయాన్నుంచి పారిపోవటానిక్కాక భయా న్ని ఎదుర్కోవటానికే మేం కొన్ని పద్ధతులవ లంబిస్తాం. రోగాల విషయంలోనేకాదు జీవి తంలో ఏ రంగానికి చెందైనా పారిపోవటంకాక ఎదురుగా నిలబడటం మనిషికి అవసరం. చిన్న ఉదాహరణలు చెబుతాను.

''ఓ వ్యక్తికి కుక్కంటే భయం అనుకుందాం. అతను సాధ్యమైనంత వరకూ కుక్కను చూడ కుండటానికే ప్రయత్నం చేస్తుంటాడు. అలాంటి వ్యక్తికి ముందుగా పదిమీటర్ల దూ రంలో కుక్క బొమ్మను చూపించుతాం. అప్పటి కీ భయపడితే ఇంకొంచెం దూరంలో పెడతాం. రెండు మూడురోజులుగానీ, ఆ వ్యక్తి ఆ దూ రంలో కుక్కను చూసి భయపడనంతవరకు గానీ ఆ దూరంలో అదే బొమ్మను చూపించటం జరుగుతుంది. ఆ తర్వాత మరికొంచెం ముందుకు జరుపుతాం. అక్కడ కొంతకాలం ఉంచుతాం. ఆ తర్వాత మరికొంత ముందుకు– అలా ఆ బొమ్మను క్లోజప్‌లోకి తెస్తాం. తర్వాత నిజమైన కుక్కతో ఇదేవిధంగా ప్రయోగం చేయటం జరుగుతుంది.

ఇదికాక కుక్క అనేది స్వతహాగా దుర్మార్గ మైనది కాదనీ, అది మానవులకు విశ్వాసం చూపించే జంతువనీ, తనకు కుక్కలమీదున్న భయం కేవలం అసమంజసమైనదనీ, ఇదివ రకు కుక్కల్తో భయానక అనుభవాలుంటే అవి అంతవరకే అనీ, అన్ని కుక్కలు అలానే చేయవనీ చెబుతాం. అలా క్రమంగా కుక్క లంటే భయాన్ని పోగొట్టటానికి ప్రయత్నించే స్తాం.

ఇలాంటి పద్ధతులు రకరకాలు.

అందరికీ ఇలా చేయంగానీ ఓ వ్యక్తికి

బల్లులంటే భయం అనుకుందాం. ఆ వ్యక్తి మీద ఒక్కసారిగా ఓ పది బల్లుల బొమ్మల్ని విసురుతాం. ఈ ట్రీట్‌మెంట్ అయ్యాక తిరిగి అలాంటి భయాలు రాకపోవచ్చు. అయితే పూర్తిగా రావనికూడా చెప్పలేం. అంతేకాదు ఈ ట్రీట్‌మెంట్‌లో మనం రోగిని కన్విన్స్ చేయగలగాలి.

ఈ ప్రపంచంలో జరిగే సంఘటనలకు ఓ క్రమం ఉందని వారికి చెప్పాలి. ఇవన్నీ సహజమైన విషయాలు. జీవితంలో భయం ఉంది. దానికి వ్యతిరేకం ధైర్యం. చీకటి ఉంది. దానికి ఎదురుగా వెలుగు ఉంది. అలాగే ప్రతీదీ. మనం రెండింటినీ చూడగలగాలి. ఏ ఒక్కదానితోనే ఆగిపోకూడదు. అసలు ఈ విధానంలో ముఖ్యం రోగి నుండి వివరాలు రాబట్టడం. వంశపారంపర్యంగా కొన్ని భయాలు వస్తుంటాయి. వాటన్నింటిని పోగొట్టే ప్రయత్నం చేయాలంటే వాటి రూట్స్ గురించి కూడా తెలుసుకోవాల్సి ఉంటుంది. ఇదంతా ఓ మహాసముద్రంలాంటిది.

అయితే ఒక్కోసారి మాకెప్పుడూ ఎదురవని కేసులు వస్తుంటాయి. ఎక్కువశాతం ఆందోళన, భీతికి చెందినవే. మేం కొద్దిగా భయపడతాం. ఈ కేసును టాకిల్ చేయటానికి మా అనుభవం చాలుతుందా అనే సందిగ్ధం. రోగితో పాటు ఒక్కోసారి మేం కూడా ఆందోళన చెందుతుంటాం. సమాజం రోజురోజుకు ఎంతగా మారుతుందో మా కొచ్చే రోగులవల్ల తెలుస్తుంది'' అన్నారు డాక్టర్ వరుణ్.

''చివరిగా ఓ విషయం చెప్పి ముగిస్తాను. ఓ జాతి ఉందనుకోండి ఆ జాతికి కొన్ని లక్షణాలుంటాయి. అలాగే ఓ కుటుంబం. వీరు అనేక విషయాల్లో ఒకే విధంగా ఆలోచిస్తారు. అలాగే జనంలోగాని, వ్యక్తుల్లోగాని ఎగ్రెసివ్ నేచర్ ఉంటుంది. అంటే దాన్ని తెలుగులో ఎలా చెప్పాలో తెలియటం లేదు. వైలెంట్ నేచర్ అంటే బాగుంటుందా? లేక తిరుగుబాటు తత్వం అందామా? దాన్ని మనం... అంటే అమ్మ, నాన్న ఉపాధ్యాయుడు...నాయకుడు ఓ క్రమంలో పెడితే అద్భుతమైన రిజల్ట్స్ ఉంటాయి. మహ్మద్ ఆలీ చూడండి. అతను గొప్ప బాక్సర్. అతని ముష్టిఘాతాల కోసం ప్రపంచం అంతా ఎదురుచూస్తుంది. ఇక్కడ ఎవరన్నా అలా ముఖాలు పగల గొడితే రౌడీలని అంటాం. భయాలు అంతే. అవి సహజం. భయాందోళనలు కల వ్యక్తిని మలచగలిగితే ఎన్నో అద్భుతాల్ని సాధించవచ్చు'' అన్నారాయన.

మధు కళ్ళు తృప్తిగా మెరిశాయి.

''చివరిగా ఓ ప్రశ్న అడుగుతాను''

తలూపారాయన.

''షాక్స్ ఇస్తుంటారు కదా...అది ఏమిటీ?''

''అదా – దాన్ని యి.సి.టి. అంటారు. అంటే ఎలక్ట్రోకన్వల్సివ్ థెరపీ. యి.సి.టి.ని ఫోబియాకి మాత్రమే అయితే ఇవ్వరు. డిప్రెషన్ కేసుల్లో యి.సి.టిని ఉపయోగిస్తారు.''

''చాలా సంతోషం డాక్టర్ గారూ. మేం చాలా విషయాలు తెలుసుకున్నాం. మరలా ఎప్పుడైనా కలుస్తాం'' అన్నాడు మధు లేస్తూ.

''మంచిది ... తప్పకుండా వస్తుండండి'' అన్నారాయన.

ఇద్దరూ బయటకు వచ్చాక మధు–

''డాక్టర్ భయం గురించి మాత్రమే చెప్పలేదు. ఆయన ఓ తత్వశాస్త్రం గురించి మాట్లాడారు. ఆయన మాటల్లో నాకు కావలసింది దొరికింది'' అన్నాడు తృప్తిగా.




శ్రీధర్ యువజన సంఘంలో ఓ సాధారణ కార్యకర్త. చదువు పూర్తయ్యాక అతనికి మరో కార్యక్రమం లేదు. అది అతని తండ్రి నుండి లభించిన వారసత్వం. ఆ కుటుంబం ఆర్థికంగా నిలదొక్కుకున్నదికాదు. తనకు ఇద్దరు అక్కలూ, ఓ అన్న ఓ తమ్ముడు ఉన్నారు. ఇంకా శ్రీధర్‌కు పెళ్ళి కాలేదు. అందరూ




# ఏరిన ముత్యాలు

★ జనంలోంచి మంచి మనుషుల్ని గుర్తించడం నేర్చుకోవాలి. మనుష్య స్వరూపాన్ని గుర్తిండమే సాహిత్యానికి కావలసిన నిజమైన సరంజామా.

-శరత్

★ 'సంస్కారం' అనే పదానికి అర్థం ఇతరులలో క్షమించతగ్గ లోపాన్ని అర్థంచేసుకోగల విశాల హృదయం.

— చలం

★ విరుద్ధ స్వభావాలుగల దాంపత్యమే చెక్కుచెదరకుండా వుంటుంది. ఒకే స్వభావంగల భార్యాభర్తల మధ్య ఏక్షణంలోనైనా తుఫాను చెలరేగవచ్చు.

— థియోడార్‌పార్కర్

★ ప్రేమ తరువాత మానవ హృదయంలోని దైవాంశ- సానుభూతి.

— షేక్స్‌పియర్

★ నిద్రలో జీవితమే సౌందర్యమయం అని కలగన్నాను. అయితే మెలకువ వచ్చాక జీవితం బాధ్యతలమయమని తెలుసుకున్నాను. బాధ్యతను ధైర్యంగా ఎదుర్కొంటే, అది క్రమేణా సౌందర్యంగా మారుతుందని వివేకంతో గ్రహించాను.

- ఎలన్

★ పురుషుడు స్త్రీ లేకుండా జీవించనూ లేడు. ఆమెతో కలిసి మెలిసి ఉండనూ లేడు.

-- ఆస్కార్‌వైల్డ్

★ సౌందర్యం గొప్పదేకాని ఆ సౌందర్యాన్ని ఆరాధించగల సహృదయత ఇంకా గొప్పది.

— కాల్టన్

★ నీముందు ఇతరులను నిందించేవాడు ఇతరుల ముందు నిన్ను నిందిస్తాడు.

-- షేఖ్‌సాదీ

★ డబ్బు ఒక అట్టడుగు లేని మహాసముద్రం. దానిలో గౌరవం, నీతి, నిజాయితీ, సత్యం- అన్నీ మునిగిపోతాయి.

— కోజ్‌వే

★ ఎదుటివారిలో నీకేది అయిష్టమైనదో అది నీలో ఉంటే సరిదిద్దుకో.

— స్టాట్

★ ప్రేమ కష్టాల్ని తేలికపరుస్తుంది. దుఃఖాన్ని మధురవంతం చేస్తుంది.

— ఆంగ్లసామెత

సేకరణ: **నల్లబెల్లి శ్రీమన్నారాయణ**

శ్రమిస్తుంటారు. ఆ ఇంట్లో తనొక్కడే గ్రాడ్యుయేట్. మిగతావారెవరూ చదువు మీద శ్రద్ధ చూపలేదు.

మొదటి నుండి శ్రీధర్ తండ్రి పెద్దగా చదువుకోకపోయినా రాజకీయాల్తో అనుబంధం పెంచుకొన్నాడు. గాంధీగారిని కొంతకాలంపాటు అభిమానించాడు. ఆయన అడుగుజాడల్లో నడిచాడు. దేశం ఆంగ్లేయుల నుండి విముక్తి చెందాక ఆయన అభిప్రాయాలు మారాయి. అప్పటినుండి ఆయన తన గ్రామంలో తను అభిమానించే పార్టీని ఓ శక్తిగా మలచటానికి ప్రయత్నంచేస్తూ వచ్చాడు.

ఆ గ్రామంలో ఎవరికేం సమస్య వచ్చినా అందరికీ తలలో నాలుకలా ఉండేవాడాయన. అలాంటి కుటుంబంనుండి వచ్చిన శ్రీధర్ తన తండ్రి ఆదర్శాన్ని అందుకొన్నాడు. ఈ నడుమే శ్రీధర్ తండ్రి మరణించాడు. అప్పుడు జానకి, మధు కూడా వెళ్ళారు. ఆయన సంస్మరణ సభలో మధు కూడా మాట్లాడాడు.

శ్రీధర్ ఎప్పుడూ ఆ గ్రామంతోపాటు జిల్లాకు చెందిన యువజన సంఘంలో బాధ్యతలు తీసుకున్నాడు. అతనికి పేపర్ వేయటం నుండి ఎన్నో పనులు. ఇంకా ఏమైనా సందర్భాలప్పుడు పుస్తకాలు తెస్తుండేవాడు.

"అక్కా... ఇది చదువు. నువ్వు తప్పకుండా చదవాలి. మీ స్త్రీల కోసం రాసిందిది. నువ్వు కూడా మహిళా సంఘంలోకి రావాలి అక్కా" అంటుండేవాడు.

జానకి నవ్వి చెప్పేది:

"ఏమో బాబు... ఈ పుస్తకాలు నాకు అర్థం కావు"

"ముందు అలానే అనిపిస్తాయి. నీకెందుకు పదిపేజీలు చదువు. తెలియకపోతే బావగారితో చెప్పించుకో. ఈసారి నేను వచ్చినప్పుడు నన్నడుగు అక్కా- నేను చెబుతాను"

"ఏమో బాబూ... ఇవన్నీ నాకు తెలియదు. నేను నా కుటుంబం వరకే పరిమితం. మా పిల్లలకు చదువులు చెప్పించి వారిని కన్నందుకు ఏమైనా చేయగలిగితే చాలు"

"చేయాలనుకో అక్కా... అలా చేయాలన్నా నువ్వు పుస్తకాలు చదవాలి. ఈ పుస్తకం చదువు. తప్పకుండా చదువుతావు కదూ" అనేసి ఇచ్చివెళ్ళాడు.

ఎందుకో శ్రీధర్ అంటే జానక్కి అభిమానం. తనను అక్కా అని పిలవటం, పిలవటమేకాక అంతటి ఆప్యాయతను చూపించటం వల్లనూ, తనకూ తమ్ముళ్ళు లేని కారణంగానూ శ్రీధర్‌ను అభిమానిస్తుంది. చదవాలనే ఆ పుస్తకాలు తీస్తుంది. అర్థంకావు. ఓసారి శ్రీధర్‌తోనే చెప్పింది:

"పత్రికల్లో నవలలు వస్తున్నాయి కదా. అలాంటి పుస్తకాలు ఎప్పుడూ తీసుకురావేమిటి? అవయితే బాగా అర్థమౌతాయి. మీకు రాసేవారంతా అలా రాస్తే బాగుంటుంది కదా?"

శ్రీధర్ నవ్వి అనేవాడు:

"రాస్తే బాగానే ఉంటుంది"

అలాంటి శ్రీధర్ రెండురోజులు కన్పించలేదు. పేపర్ కూడా రాలేదు. బిల్లు కట్టనప్పుడు పేపర్ రాకపోవటం మామూలే. అదే కాబోలు నని సరిపెట్టుకుంది. అప్పుడు మధు ఇంటిదగ్గర కూడా లేడు. మధు వచ్చాక తెలిసిన విషయం శ్రీధర్‌కు యాక్సిడెంట్ అయిందని.

ఉదయాన్నే పేపర్ వేస్తున్న శ్రీధర్‌ని లారీ గుద్దేసింది. ప్రాణానికి అపాయం లేదు. ముందు టైర్ ముంజేతి మీదుగా వెళ్ళింది.

అదృష్టం ఏమిటంటే చేతివేళ్ళు మాత్రం టైర్ కిందపడ్డాయి.

ఆపరేషన్ చేశాక మధ్యలో మూడు వేళ్ళు తీసివేశారు.

బెడ్ మీద పడుకున్న శ్రీధర్‌ను చూడగానే జానకి కళ్ళలో నీళ్ళు తిరిగాయి.

"ఎందుకక్కా బాధపడ్తావు. నాకేం కాలేదు. నా చెయ్యి తీసివేయలేదు. మూడు వేళ్ళేగా పోయింది. ఇంకో నెలరోజుల్లో నీకు రాసి చూపిస్తా" అన్నాడు నవ్వుతూ.

నిజంగానే శ్రీధర్ ఇప్పుడు రాస్తున్నాడు. సైకిల్ తొక్కుతున్నాడు. తిరిగి పేపర్ వేస్తున్నాడు. తన భుజానికి తగిలించుకునే సంచిలో సాహిత్యం తెస్తున్నాడు.

"అక్కా... ఇది ఉప్పల లక్ష్మణరావుగారి పుస్తకం "అతడు - ఆమె". నువ్వు నవలలు





కావాలన్నావని తెచ్చాను. బాగుంటుంది. ఇది మరో నవల... చదువుతావు కదూ" అంటూనే ఉన్నాడు.

శ్రీధర్... తన తమ్ముడు... ఎంత ధైర్యంగా తిరిగి జీవితం కొనసాగిస్తున్నాడు. తన్ని చూస్తుంటే ఎంత సంతోషం కలుగుతుందో.

"ఏం శ్రీధర్ ఏమిటి విశేషాలు?"

"ఏముంది బావా... నా పెళ్ళికదా కార్డ్ అందివ్వాలని వచ్చాను" అన్నాడు అందిస్తూ.

"ఓ... ఇంతకుముందు చెప్పావుకదా" అని కార్డు చూసి-

"కొంపముంచావు కదయ్యా స్వామి. ఈరోజు మావాడి పెళ్ళి ఉందిగా"

"అదేం నాకు తెలియదు. అక్కా, నువ్వు తప్పకుండా రావాలి"

"అది కాదయ్యా ఇంపార్టెంట్ పెళ్ళి. తప్పకుండా వెళ్ళాలి. అయితే ఓపని చేస్తాం. మాలో ఒకరం నీ పెళ్ళికి వస్తాం"

"అంతేనంటావా బావా?"

"తప్పదు మరి. ఎడ్జస్ట్ చేసుకోవాలి"

"బావా... నువ్వుగానీ, అక్కగానీ తప్పకుండా రావాలి. ఇంకేదో కారణం చెప్పకూడదు- సరేనా?"

"తప్పకుండా. ఏం జానకీ మీ తమ్ముడికి కొంచెం కాఫీ ఇవ్వకూడదూ"

"లేదు బావా. ఇంకా చాలామందికి కార్డులివ్వాలి. నేను వెళ్ళొస్తాను. వస్తా అక్కా" అని సైకిలెక్కి వెళ్ళిపోయాడు.

★ ★ ★

"జానకీ... ప్రశాంతంగా నిద్రలోకి వెళ్ళు. ఎలాంటి ఆలోచనలనూ రానీకు... మంచి కలలు కనటం నేర్చుకో... జీవితంలో మనం ఎలాంటి స్థితినయినా ఎదుర్కొనే శక్తిగలవాళ్ళం... ఇది నువ్వు ఎప్పుడూ గుర్తుంచుకో... మరి నేను నా ప్రపంచంలోకి వెళ్తున్నాను. గుడ్‌నైట్. స్వీట్ డ్రీమ్స్" మధు చెప్పాడు.

నవ్వుతూ చూసింది. పదినిముషాల తర్వాత మధుకేసి చూసింది. అప్పుడే నిద్రలోకి జారిపోయాడు. "ఎంత అదృష్టవంతుడో" అనుకొంది. ఒకసారి ఎందుకో అతన్ని ముద్దు పెట్టుకోవాలని అనిపించింది. అంతలోనే సిగ్గుపడింది.

నిజమే. చాలాకాలం తర్వాత మధు మాట్లాడాడు. అసలు ఎప్పుడు మాట్లాడినా అలానే మాట్లాడతాడు. వినటానికి ఎంతో బాగుంటుంది. కాకపోతే ఒకటే అనిపిస్తుంది. అన్నీ తన తప్పులుగానే చెబుతాడు. అలా చెప్పగల నైపుణ్యం ఉంది. తిరిగి తను జవాబు చెబుతుంది. మరలా ఏదో చెబుతాడు. అదినరే. ఆయనన్నట్లు తనకి తన లోపాల గురించి ఎవరైనా చెబితే బాధగానే ఉంటుంది. దాన్నుండి బయటపడాలి. అసలు ఆయనకు ఆ విషయంలోనే తగాదా అంతా. ఇంకా చాలా విషయాలు తను చెప్పలేదు. చెబితే ఈ జీవితంలో ఎప్పుడూ వాళ్ళను క్షమించలేదుకూడానేమో. అవన్నీ తనకు గుర్తున్నాయి. ఆ బాధ తనకూ ఉంది. కానీ అది ఆయన గుర్తించడు. ఇప్పుడేగా ఏ ఆలోచనలు లేకుండా పడుకో అని చెప్పాడు... పడుకోవాలి. ఇంక ఏ ఆలోచనలు లేకుండా నిద్రపోవాలి అనుకొంది జానకి.

బలవంతంగా కళ్ళుమూసుకొంది. తిరిగి ఏవో ఆలోచనలు... అవును... తను ఎందుకింతగా భయపడుతుంది?!

ఆయన ఊరికివెళ్తే వచ్చేదాకా ఎందుకో ఆందోళన... రాకపోతే ఏమవుతుంది? నాలుగు రోజులపాటు ఊరికి వెళ్ళాడు. తిరిగి వస్తారని ఎదురు చూస్తుంది. అలానే ఎదురు చూడొచ్చు కదా? నిజంగా ఆయన లేకపోతే ఏం? దేశంలో ఆయనకేమైనా జరిగితే తనకే మొదటిసారి జరిగినట్లుకాదుగదా? మరెందుకు? ఎందుకు? అప్పుడు... తన చిన్నప్పుడు...

ఎవరెవరో బిగ్గరగా ఏడ్చారు. తను పరిగెత్తుకొచ్చింది. అమ్మ గుండెలు బాదుకుంటూ ఏడుస్తోంది. నాన్నకూడా మొఖానికి చేతులు అడ్డం పెట్టుకున్నాడు. నాయనమ్మ "ఇదేంట్రా భగవంతుడా" అని ఏడుస్తోంది. తనకూ ఏడుపొచ్చింది. ఏడ్చింది కూడా. తర్వాత తెలిసింది. బావ చనిపోయాడని!

అక్కావాళ్ళు దూరంగా ఉన్నారు. ఏడుస్తూనే ప్రయాణం ఆరంభించారు. బస్సుల్లోనూ, రైలు

లోనూ ప్రయాణం జరిగింది. వెళ్ళాక అక్క తమందరినీ చూసి ఏడిచింది. ఎందుకో ఇదంతా ఏమీ బాగుండలేదు. తాము వెళ్ళాక బావయ్యను తీసుకువెళ్ళిపోయారు. రెండురోజుల తర్వాత అక్కడ అంతా కొత్తగా ఉంది. చాలా లోటుగా కూడా ఉంది. అక్కకు తన కంటే చిన్న పిల్లలు ముగ్గురు. అమ్మా, నాన్న వంటరిగా కూర్చుని ఏవేవో మాట్లాడుకున్నారు. తను వెళ్ళలేదు. కొద్దిరోజుల తర్వాత తమతోపాటు ఇద్దరు పిల్లలు వచ్చారు. వరసకి వాళ్ళు తనకు కొడుకులవుతారు. వాళ్ళు ఇక్కడే ఉండి చదువుకోవాలని అక్క అనుకొంది.

అందుకే తమతోపాటు పంపించింది. అందరూ తిరిగి వచ్చారు. జానకికి ఎందుకో ఆనాటి ఏడుపులు గుర్తొచ్చాయి. మనిషి చనిపోవటం, చనిపోయిన వెంటనే తీసుకువెళ్ళటం. వారికోసం ఏడవటం. నాలుగు రోజుల తర్వాత తిరిగి మామూలు జీవితంలోకి రావటం ఈ క్రమాన్ని ఆ లేత మనసు అర్థంచేసుకోలేకపోయింది.

ఇందులో తనకు నచ్చంది మరణం అన్న విషయం ఇప్పటికీ జానక్కి తెలియదు. మరణం సహజమైనదనే విషయం కూడా గుర్తించదు. ఆ మరణం అక్క ఇంట్లో ఓ మార్పు తెచ్చింది. బిడ్డలు తనకు దూరమయ్యారు. అప్పటివరకూ కేవలం గృహిణిగా మాత్రమే బాధ్యతలు తీసుకొన్న అక్క ఆ ఇంటికి తనే పెద్ద అయింది. అక్కడ ఏవో కొద్దిపాటి పొలాలున్నాయి. వాటి విషయం మాట్లాడటానికి నాన్న వెళ్ళాల్సివస్తుండేది. అప్పటివరకూ అక్క ఎంతో అందంగా, కళకళలాడుతున్నట్లు ఉండేది. బావ మరణంతో అక్క మొఖంలో వెలుగు ఆరిపోయింది. ఇంకేమాత్రం తను మనిషిన కానట్టూ, తనకంటూ ఎలాంటి అనుభూతులు లేనట్లు ఆమె ప్రవర్తించేది. ఇందుకు కారణం ఏమిటో తనకు అర్థమయ్యేదికాదు.

అంతకంటే జానికిని కలచివేసిన సంఘటనలు వేరు. అమ్మను విడిచిపెట్టడానికి అందులో ఒకడు అంగీకరించలేదు. అసలు వాడికి నాన్న మరణించాడనే వాస్తవం భరించగలిగే వయసూ కాదు. అంతేగాక తన ఊరి పరిసరాలు బాగా ప్రభావం చూపించి ఉండటంతో ఆ వేళ మనసులో ఎప్పుడూ ఆ దృశ్యాలే. అందుకే అక్కడికి వెళ్ళాలనే ఆరాటం. ఒకటి, రెండుసార్లు చెప్పకుండా వెళ్ళాడు కూడా. తన పిల్లల గురించి అక్క ఆందోళన చెందుతుండేది.

జానక్కి స్పష్టమైన విషయం అదే.

మృత్యువు తల్లీ, బిడ్డల్ని విడదీస్తుంది. మృత్యువే కాక ఇంకా విడదీసేవి చాలా ఉండొచ్చు. కానీ ఈ ఎడబాటు మాత్రం భరించలేనిది.

మొదటిసారిగా మానవసంబంధాలు ఎలా ఉంటాయో ఆ మృత్యువు తర్వాతే తనకు తెలిసింది.

తమ ఇంట్లోకి అక్క పిల్లలు రావటం వల్ల అమ్మకు కొంచెం ఇబ్బందిగా ఉండేది. చాలా కాలం తర్వాత ఆ విషయం తను తెలుసుకోగలిగింది. మొదట్లోగానీ, తను తెలుసుకునే నాటికిగానీ ఈ భావాల్ని అమ్మ పైకి చెప్పలేదు. చెప్పదుకూడా! కానీ అమ్మ ఆ ఇష్టాన్ని అనహ నాన్ని కూడా జానకి తెలుసుకోగలిగింది.

జానకి ఆ ఇంట్లో అందరికంటే చిన్నది. అందుకే అందరినీ పరిశీలించే అవకాశం కలిగింది.
జీవితంలో జానకి తీసుకున్న మొదటినిర్ణయం... తను ఇద్దరు పిల్లల్ని మాత్రమే కనాలి. అంతకంటే మరో బిడ్డను కననుగాక కనను అనుకొంది.

ఇరువురిమీద సమాన ప్రేమ చూపించలేని పరిస్థితుల్లో ఒకరికే పరిమితం కావాలని కూడా భావించింది.

ఇలాంటి ఆలోచనలే తనకు చదువుపట్ల ఏమాత్రం శ్రద్ధ కలిగించలేకపోయాయి. తన కళ్ళముందు నలుగురు అక్కల, ఓ అన్న పెళ్ళి జరిగింది. అందులో స్పష్టమైన మరో అంశం ఏమిటంటే తన తండ్రి మొత్తం నలుగురికీ ఎంత ఇచ్చాడో... ఒక్క కొడుక్కే అంతవచ్చింది. అంటే అది తమకు ఉంటుందని కాదు. ఆ బేరసారాల్లోని తేడా తనకు అవగతం అయింది. అదృష్టవశాత్తూ నలుగురూ మంచి వ్యక్తులు దొరికారు. వాళ్ళు ఎంత ఇచ్చారనేది పాయింట్‌గా పెట్టుకోలేదు.




కుటుంబం యొక్క స్థితిని మాత్రం చూశారు. పిల్లల్లోని క్రమశిక్షణ, ఇంటిని తీర్చిదిద్దుకోవటం వారికి నచ్చాయి. తర్వాత కాలంలో కొద్దిపాటి ఘర్షణలు రాకపోలేదు.

అంతలోనే మరో షాక్...

తీవ్రంగా జబ్బుపడి మరో అల్లుడు చనిపోవటం... ఓ రకంగా ఆ కుటుంబంలో అదో శాపంగా పరిణమించింది. ఈ రెండుమరణాలూ తమజీవితాల్లో కలిగించిన సంచలనం సామాన్యమైందికాదు. అదంతా అనుభూతమైంది జానక్కి.

తమ పిల్లల భవిష్యత్‌కోసం అక్కలు ఎంతగానో తల్లడిల్లారు. అప్పుడే జానకి తల్లిద్వారా ఓ కఠోర సత్యం తెలుసుకొంది.

"ఓసారి పెళ్ళయ్యాక ఆడపిల్లలు తమ బిడ్డలు కారు. వారికి చెందిన బాధ్యతలుగానీ, వారి పిల్లలకు చెందిన బాధ్యతలుగానీ తన మీద ఉంచకూడదు. ఆ కష్టనష్టాలు వారుపడాలి. అంతేగాని ఎటువంటి పరిస్థితుల్లోనూ తమ పుట్టింటి దిశకు చూడకూడదు. సంవత్సరానికోసారి రావటం, రెండురోజులుండటం, నెలకో కార్డురాసి క్షేమసమాచారాలు తెలియచేయటంలాంటివి చెయ్యాలి"

కాగా జీవితంలో ఎప్పుడూ పుట్టింటికి వెళ్ళే సమస్య రాకూడదని అనుకునేది జానకి. జానకి దగ్గరకు వచ్చేటప్పటికి పరిస్థితులు చాలా మారాయి. కట్నాలు విపరీతంగా పెరిగిపోయాయి. కాగా తనకున్నది మొత్తం ఇస్తేగాని మంచి సంబంధం దొరకదు. మంచి సంబంధం అంటే రెండు మూడు ఎకరాలున్నవాడు లేదా ప్రభుత్వ ఉద్యోగమైనా ఉండాలి. ఇందుకు వారు సిద్ధంగా లేరు.

ఈ పెళ్ళిచేసి తాము సన్యసించాలనుకోవటంలేదు. తామిద్దరూ బతకాలి. తమతోపాటు నాయనమ్మ ఉంది. కాగా ఎవరో ఒక యువకుడు కావాలి. వాడు మంచివాడై ఉండాలి. జానకి చాటుగా అనేకసార్లు తన పెళ్ళి గురించిన మాటలు వింటూనే ఉంది.

అనేకసార్లు ఆడపిల్లగా పుట్టినందుకు బాధ కలిగింది. అందులోనూ ఓ మధ్యతరగతి కుటుంబంలో చివరి పిల్లగా పుట్టాల్సిరావటం మరెంతో దురదృష్టంగా భావించింది. తనను ఎలా వదిలించుకోవాలా అనే వారి ఆందోళన జానకిని ఓ రకమైన నిర్లిప్తతకు గురిచేసింది.

ఆ సమయంలో జానకి వదినకు తన తమ్ముడు కనిపించాడు. వాడు తండ్రిలేనివాడు. వెనక ఏ ఆస్తిలేనివాడు. అసలు రేపెలా అన్నసమస్య పీడిస్తూంది. తమ్ముడుకాక ఇంకోడు. పిన్ని ఇంటర్ పూర్తిచేసి తన బావ దగ్గర కొంతకాలం పనిచేసి, ప్రస్తుతం ఓ కాంట్రాక్టర్ దగ్గర పనిచేస్తున్నాడు. వారయితే వింటారు. పిన్నితో మాట్లాడితే ఆమెను ఒప్పించవచ్చు అనుకొంది . భార్యాభర్తలు ఆలోచించారు. యశోద రాయబారానికి వెళ్ళింది. పాపం వదినగార్కి కూడా మరదలి పెళ్ళి విషయంలో బాధ్యత ఉంది కదా. ఆవిడకు మాత్రం జానకి గుండెలమీద కుంపటి కాకుండా ఎలా ఉంటుంది. ముందామెను ఈ ఇంటినుండి పంపిస్తేగాని తనకు మనశ్శాంతి ఉండదు. అప్పటికి ఈ ఇంటికి చెందిన బరువులన్నీ తొలగిపోతాయి.

యశోదకు మధు గురించి స్పష్టంగా తెలుసు. మధుకు ఏదైనా ఉద్యోగం వస్తే తన తమ్ముణ్ని చదివించుకోవాలి. తన అమ్మను పోషించుకోవాలి. తన తమ్ముడికి కనీస విద్య అందించాలి. ఆ తర్వాత వాడి జీవితానికి ఓ ఆధారం లభిస్తుంది. కానీ ఇవేం యశోదకు గుర్తురాలేదు. ఓ గొప్ప సమావేశంలో చెప్పింది.

"పిన్నీ... నువ్వు ఆలోచించుకో. మేం వాడికో ఉద్యోగం చూసుకుంటాం. మా పిల్లకోసం మేం చూసుకుంటాం. నువ్వు బయటి సంబంధాలకెళ్ళావనుకో వచ్చే అమ్మాయి ఎలా ఉంటుందో. జానకి నిన్ను పువ్వుల్లో పెట్టి చూసుకుంటుంది. ఓ అరఎకరం ఇస్తారు. అందులో వడ్లు వస్తాయి. ఉద్యోగం వస్తే రాజాను కూడా చదివించుకోవచ్చు. జానక్కి నలుగురు అక్కలూ, ఇద్దరు అన్నలూ ఉన్నారు. ఎంత అండ. ఆలోచించుకో. వాడికి నువ్వు చెబితే వింటాడు. నేను చెబుతున్నా ఇది మంచి అవకాశం"

జానక్కి తన పెళ్ళి గురించి మాట్లాడుతున్నారని తెలిసింది. అప్పుడే ఈ విషయాలు తెలిశాయి. మొదట్లో చాలా ఆశ్చర్యపడింది.

ఇంతవరకుచూసిన సంబంధాలలో ఇదే ఘోర మైనది. పెళ్ళికొడుకు తమ బంధువు అనేది ఒక్కటే ఇందులోని సుగుణం.

అతన్ని తనెప్పుడూ చూడలేదు. చూసినా గుర్తులేదు. వాళ్ళ కుటుంబం చితికిపోయింది. అత్తయ్యను మాత్రం రెండు మూడు సార్లు చూసిన గుర్తుంది. ఆమె చాలా మంచిది. అంతవరకు వాస్తవమే. కానీ 18 సంవత్సరాలు నిండిన ఓ యువకుడ్ని వెనకాల ఏమీలేని ఏ ఆధారంలేని వ్యక్తిని, ఏ ఉద్యోగమూ లేని వాడ్ని ఇంకా తన వెనకాల బాధ్యతలున్న వ్యక్తిని తన భర్తగా నిర్ణయించారు. మామూలుగా ఆ ఇంట్లో నిర్ణయాలు జరగటమేగానీ ఎవరూ వ్యతిరే కించరు. ఓ రకంగా ఆ ఇంట్లో తనే ఎక్కువ కాలం పెళ్ళి కాకుండా ఉంది. తన కంటే రెండు మూడు సంవత్సరాలకు ముందే అంద రూ పెళ్ళిళ్ళు చేసుకొని వెళ్ళిపోయారు. ఇంకా ఎక్కువకాలం ఉంటే అందరూ తన దురదృ ష్టాన్ని నిందించవచ్చు.

ఆ ఇంట్లో ఓ పద్ధతి ఉంది. తక్కువ సందర్భాలలో మొఖాన అంటారు. మిగతా సందర్భాలు మామూలే. ప్రపంచం దృష్టిలో తమ కుటుంబం అపురూపమైంది. క్రమశిక్షణా యుతమైంది. ఇందుకు కారణం ఎవరి తిండి వారు తిని, అందరూ కనీస జీవితం గడపటం. ఆ కుటుంబాల్లో సంక్షోభం వచ్చినప్పుడు తనకు పరిస్థితులు అర్థమయ్యాయి.

అది ఈతరానివాడ్ని ఈదుకుంటూ బయట పడు లేదా చావు అనే క్రమశిక్షణ.

వాస్తవానికి ఆ ఇంట్లో జానకి మాత్రమే అయిదువేల రూపాయలు విలువచేసే ఓ అర ఎకరం కట్నంగా తీసుకుంటుంది. అందరూ రెండు మూడు వేలకు వచ్చినవారే. కాగా జానకి అప్పుడే ఓ నిర్ణయానికి రావటం జరి గింది.

ఓ కోపిష్టి, పేద భర్తతో తను జీవితాన్ని పంచుకోవాలి. మిగతావారి విషయాల్లో మధ్యలో అనుకోని సంక్షోభాలు వచ్చాయి. అది కూడా మృత్యువు రూపంలో. కానీ ఇక్కడ సంక్షోభమే ఆరంభం. ఎదుర్కోవడానికి తను సిద్ధంగా ఉంది. లేకపోతే ఇరవైరెండు సంవ త్సరాలు దాటిన తన అన్నకు అవసరం లేని పెళ్ళి అతనికి మాత్రం ఎందుకు? పోనీ అతనే మైనా పెళ్ళికోసం ఆరాటపడుతుంటే అది వేరే విషయం. నాకు ఉద్యోగం లేదు. నేనెలా బత కాలి అంటున్న ఓ యువకుడ్ని బలవంతంగా ఈ పెళ్ళికి ఒప్పించటంలో స్త్రీని ఎంత బరు వుగా భావిస్తున్నారో స్పష్టం కావటం లేదా!

అందుకే జానకి తన పిల్లల్ని అమితంగా ప్రేమించగలిగింది. పెళ్ళి అయిపోయింది. ఏదో ఒక ఉద్యోగం చూడాలి. ఎవరు చూడాలి? తెలిసిన వారికి చెప్పి చూశారు. వారి వలన ఏ విధమైన ఉపయోగం కనిపించలేదు. ఈ లోగా హైదరాబాద్‌లో ఉద్యోగం రావటం జరి గింది. ఊపిరి పీల్చుకున్నారు. ఓ ప్రధానమైన బరువునుండి వారు తప్పించుకున్నారు. అయితే ఆ సంతోషం, ఆనందం ఎక్కువ కాలం నిలువలేదు. ఎవరూ ఊహించని విధంగా చేస్తున్న ఉద్యోగం రాజీనామా చేసి రావటం జరిగింది. ఇప్పుడు ఉద్యోగం చూడట మంటే మాటలా? మరో అర ఎకరం అవు తుంది! అందుకు ఎవరూ సంసిద్ధంగా లేరు. ఇద్దరికీ జీతం సరిపోయేది. మధు అలా రావ టాన్ని తీవ్రంగా ఖండించాడు పెద్దన్న.

మొదటి బిడ్డతో అయిదు నెలలు ఉండాల్సి రావటం, ఆ సమయంలో ఏ ఉద్యోగం లేని తన భర్త నడి రోడ్డు మీద నిలబడ్డాడనే వాస్తవం - అనుక్షణం గుర్తింపచేసిన ఇంట్లో తనుంది. మధు కూడా ముందు కొచ్చి ఏం చేద్దామనే విషయాన్ని ఎవరితోనూ సంప్రదించ లేదు. అందుకే అన్నయ్య కడుపుమంట.

"ఏం చూసుకొని ఆ టెక్కు... ఆ గర్వం... తల మీద రూపాయి పెడితే పది పైసలకి కొనేవాడు లేదు. వాడికి ఎక్కడలేని అహంకారం" అన్నాడు.

నలుగురిముందు అన్నాడు.

జానకి కృంగిపోయింది. తనెప్పుడూ ఎవర్ని ఎదిరించి ఎరగదు. తన భర్తకు ఆవేశం ఉండొచ్చు. నిజంగానే అతను తప్పుచేసి ఉండవచ్చు. జాగ్రత్తగా ఆలోచిస్తే అతను చే సిందాంట్లో ఏ తప్పూలేదు.

ముందు నుండి తనేం చెబుతున్నాడో అదే చేశాడు. తన తమ్ముడు, అమ్మ ముఖ్యం అని





చెప్పాడు. అందరికీ తన జీతం చాలదని తేలినప్పుడు బయటకొచ్చాడు. అది ఆయనకు నచ్చకపోవచ్చు. అందుకే బలవంతంగా గొంతు పెగుల్చుకొని అంది...

"ఆయన కానీ విలువ చెయ్యడని ముందు నుండీ మీ అందరికీ తెలుసు. అయినా మీరు నాకు ఆయన్ని కట్టారు. అందుకు ఏడుస్తున్నా" అనేసి వెళ్ళిపోయింది.

తన మనస్సు చాలా గాయపడింది. తను పెళ్ళి చేయమని ఏడవలేదు. వారే అంతగా ఆరాటపడ్డారు. ఈ రోజుకూ ఎక్కడైనా వారు చెప్పినవిధంగా ఉద్యోగం చూస్తే తన భర్తతో చేయిస్తుంది తను. అలాంటిదేం లేకుండా అంతంత మాటలెందుకు?

రేపు తనకూ ఓ ఆడపిల్ల ఉందిగా... తన పట్ల ఎలా ప్రవర్తిస్తాడో ఈ కళ్ళతోనే చూస్తాను" అనుకొంది జానకి.

తన భర్తకు కోపం ఉంది. అంతే. మోసం చేయటం తెలియదు. తనేం జూదగాడు, తాగు బోతుకాదు.

అందుకే ఎప్పటికైనా భవిష్యత్ ఉంటుందని గట్టి నమ్మకం.

మధు కిళ్ళీ కొట్టులో చేరటంతో మరో మలుపు తిరిగింది జీవితం.

కొంతకాలం ఆ క్రమానికి అలవాటు...తిరిగి మరో మార్పు...

ఈసారి తన జీవితంలో అత్యంత దయనీయమైన సన్నివేశం.

ఒకే ఊరిలో ఉంటున్న తన అక్క ఇంటికి వచ్చి తనను చూడకుండా వెళ్ళే అన్న...

ఏనాడూ తన మొఖం చూపించని అమ్మ...

ఈనాడు తిరిగి పిల్లల్తో ఆ ఇంటికే వెళ్ళాల్సి వచ్చింది.

పెళ్ళికావటంతోనే అమ్మ నాన్నలు కేవలం బంధువులే అనే విషయాన్ని ఏనాడో చెప్పింది అమ్మ.

జానకి పూర్తిగా నలిగిపోయిందక్కడే.

జీవితం మహాకర్కశమైంది. వెళ్ళక తప్పలేదు.

ఆరు నెలల కాలం తన జీవితకాలంలో అనుభవించిన మానసిక వేదన బయటకు చెప్పుకోలేనిది.

తిరిగి మరలా బయటకు వెళ్ళారు.

రెండున్నర సంవత్సరాల తర్వాత తమ కంటూ ఇప్పుడు ఓ జీవితం! ఇది శాశ్వతమేనా?

ఏ క్షణమైనా బుడగలా పేలనుందా?

అందులోనూ తమ రెండు కుటుంబాల్లోనూ మరణాలే తమ జీవితాల్ని శాసించాయి. తన చిన్నతనంలో తండ్రిని కోల్పోయాడు మధు. నలుగురి పిల్లల్తో జీవితాన్ని ఈడ్చుకొచ్చిన అత్తయ్య, ఒక్కోసారి తనకెంతో అద్భుతంగా అనిపిస్తారు.

అదే సమయంలో వారు అనుభవించిన క్షోభ గుర్తుకు వస్తుంది. దీనికి అంతం ఎప్పుడు? తమ పిల్లలు కూడా అలానే అవమానాలు భరించాలా? ఇప్పుడు తమకు ఇబ్బంది లేదు. ఇప్పుడు ఆయనకేమైనా అయితే...అందులో ఆయన మిత్రుడు...ఇంకా మరికొన్ని వార్తలు...

తనకు జీవితంలో ఒకే కోరిక ఉంది. అది బతకటం కోసం తన పుట్టింటికి వెళ్ళకూడదు. తన బిడ్డలు దీనమైన మొఖాల్తో వారి ఇంటి ముందు నిలబడకూడదు. మాకిది చెయ్యండని వారిని ప్రాధేయపడకూడదు. అంతకంటే తనేం కోరుకోదు.

తనకు లక్షలాది రూపాయలు అవసరంలేదు. బంగారు నగలూ అవసరం లేదు. ఈ కోరిక నెరవేరితే చాలు.

అది సాధ్యమౌతుందా? గతంలోలా తిరిగి అక్కడికే వెళ్ళాల్సివస్తే...?

జానకి అటూ, ఇటూ పొర్లుతుంది.

పక్క మంచం మీద చిన్ని హాయిగా నిద్రపోతున్నాడు. వాడుగానీ, పెద్దవాడుగానీ అప్పట్లో తమను ఎంత ఇబ్బంది పెట్టారో! ఇబ్బంది పెట్టారనటం కంటే వారికి సరైన ఆహారం ఇవ్వలేకపోయారు. సరైన పోషణ ఇవ్వలేకపోవటంతో వారు అనారోగ్యం పాలయ్యారు. ఇప్పుడు బాగానే ఉంటున్నారు. బొద్దుగా ఉండకపోయినా అనారోగ్యంగా మాత్రం లేరు. ఇద్దరిలోనూ తాము కోరుకునే లక్షణాలు ఉన్నాయి.



తమ కిది కావాలని అడగరు. ఇంట్లో ఏది ఉంటే అది తింటారు. ముఖ్యంగా ఇద్దరికీ పట్టుదల ఉంది. అందుకే మధు అంటాడు-

"జానకీ... నాకు జీవితంలో నా గురించి భయాలెప్పుడోపోయాయి. చిన్ని గాడు పుట్టిన ప్పుడు నాకు భలే చిరాకేసింది. ఆడపిల్ల పుడితే బాగుండుననుకున్నాను. ఆడపిల్ల కోసం ఇంకొరిని కనాలనుకున్నాను. అంత తెగింపు వచ్చింది. ఇప్పుడు నా పిల్లల్ని చూసు కుంటే నాకు గర్వం కలుగుతుంది. వాళ్ళు గొప్ప చదువులు చదవకపోవచ్చు. గొప్ప ఉద్యో గాలు చేయకపోవచ్చు. కానీ గొప్ప ఆత్మ విశ్వా సంతో బతుకుతారు. వారికి మన నుండి లభించేది ఆ ఆస్తి. వాళ్ళు ఏ దరిద్రాన్న యినా భరించటం పుట్టుకతో నేర్చుకున్నారు. నాకు పోతాననే భయం లేదు. నా కిప్పుడు ఇంకో నమ్మకం కూడా ఉంది. నువ్వూ, నా పిల్లలు ఇంకే మాత్రం బతకటం కోసం మన వారిని ఆశ్రయించవనిలేదు. చూస్తూండు. పిల్లలు నిన్ను ఎంతో ఆరాధిస్తారు. నీ కోసం ఏ పని చేయమన్నా చేస్తారు."

జానకి నిద్రపోతున్న చిన్నిని ముద్దు పెట్టు కొంది. ఏమిటో ఈ రోజు అందర్నీ హృదయాని కి దగ్గరగా తీసుకోవాలనిపిస్తుంది. ఏవో కొత్త ప్రపంచపు వాకిళ్ళు తెరుచుకుంటున్నట్లని పిస్తుంది. తను ఇంతకాలం అనవసరంగా భయపడిందేమో! మరీ తన కుటుంబం, తన పిల్లలు ఈ పరిధిని మించి ఆలోచించటా నికే ఇష్టపడక పోవటం నుండి మొద లైందేమో!

నిజమే. తన పరిధి మరీ సంకుచితంగా ఉంది. తను ఆలోచించే విషయాలు ఇంత చిన్నవైనప్పుడు తన గత జీవితపు నీడలన్నీ విషాదమయం అయినప్పుడు భయం కాక ఏంమిగులుతుంది?

ప్రపంచంలో ఆలోచించాల్సిన విషయాలు ఇంకా చాలా ఉన్నాయి. అందుకే కాబోలు శ్రీధర్ అంటాడు. 'పుస్తకాలు చదువక్కా. మంచి పుస్తకం మంచి స్నేహితుడిలాంటిది. మంచి పుస్తకాలు చదవటం వలన నీకు ఎన్నో అనుమానాలు తీరుతాయి. ఎన్నెన్నో విషయా లు తెలుస్తాయి."

నిజమే ఇంతవరకూ తను పుస్తకాలు చదవ లేదు. ఏవో కొన్ని సాధారణ నవలలు తప్పించి, మిగతా వారివలె తనకు సినిమాల మీద కూడా కోరిక ఉండదు. అంతదాకా ఎందుకు మంచి చీరలు కట్టుకోవాలని, బాగా అలంకరించుకో వాలని అనిపించదు. ఇంతవరకు 'రెండు రూపాయల' మల్లెపూలు తను పెట్టుకోలేదు. ఎందుకో జీవితంలో ప్రతి విషయం పట్ల అలాంటి నిర్లిప్తత తనలో ఏర్పడింది. వాస్తవాని కి తాము అనుభవించిన దరిద్రం వీట న్నింటిని తమ మీద రుద్దింది.

అలాంటివాటి ప్రభావం నుండి ఇంతవ రకూ తను బయటపడలేకపోతుంది. ఇంకా ఇలానే ఉంటడం చాలా కష్టం. తాను చాలా మారాలి. ముందసలు ఈ ప్రపంచంలో ఏం జరుగుతుందో గమనించాలి. ఓ విషయం మాత్రం వాస్తవం. ఈ సమాజంలో అనేకమంది కంటే తాము బాగా జీవిస్తున్నారు. తమకంటే దురదృష్టవంతులయినవారు ఈ భూమ్మీద అడుగడుగునా ఉన్నారు. వారంతా ఏదో ఒక భయంతో ఆందోళన చెందుతూనే ఉన్నారు.

వెనకింటి వదినగార్కి గుండెనొప్పి. ఈ భయాలు చాలా చిత్రమైనవి. అందరికీ ఒకేలా భయాలుండవు. కానీ అందరికీ ఉండేదొకటే భయం. ఏదో రూపంలో అది ఉంటుంది. అది నిరంతరం మనుష్యుల్ని వెంటాడు తుంటుంది. భయానికి వ్యతిరేకంగా ప్రతిక్షణ మూ శక్తుల్ని కూడదీసుకోవాలి. లేదా భయం మనల్ని మింగేస్తుంది.

ఆలోచిస్తుంటే ఎన్నెన్ని కొత్త ఆలోచనలు కలుగుతున్నాయి. ఇంతకుముందెన్నడూ ఇలాంటి ఆలోచనలు కలిగేవికావు. అలా అను కోవటంకంటే తను తన ఇంటికి పరిమితమైపో యింది. ఉదయాన్నే లేవటం, నీళ్ళుపట్టుకో వటం, పిల్లల్ని బడికి పంపించటం, బట్టలు గుంజుకోవటం, వండటం, తినటం, సర్దుకో వటం... తిరిగి సాయంకాలం ఇవే పనులు. ఇంతకుమించి ఈ జీవితానికి ఏముంది? ఏమీ లేదు.

ఏమీలేదనే ఆలోచన ఇప్పుడు కలుగు తోంది. అసలు జీవితమంటే ఇదికాక మరేదో





ఉందనే అనుమానం వస్తూంది. అదేమిటో తెలునుకోవాలి. జానక్కి ఇప్పుడు నిద్రపట్టకపో యినా ఆందోళనగాలేదు. తనలోకి ఏవేవోశక్తు లు ప్రవేశిస్తున్నట్లుంది. ఇంక తను పాత జానకిలా మారుతుంది కొన్ని విషయాల్లో. తమ జీవితపు అనుభవాల్ని మరో కోణంనుండి చూ స్తుంది తను.

అవును. తనకు భయంఏమిటి? తనకు ఇద్దరు మొగపిల్లలున్నారు. వారికి కట్నాలు ఇవ్వాల్సిన పనిలేదు. తమకే ఆడపిల్ల ఉంటే తమ ఆలోచనలు ఎలా ఉండేవో... ఆ విషయం గురించి తను ఆలోచించదు. ఓ రకంగా తమకు ఆడపిల్లలు పుట్టాలని కూడా కొందరు ఎదురుచూశారు. ఒక్కొక్కరిది ఒక్కో రకం కసి. పుట్టినా ఇంతే. తమ పిల్లలు తమలా కష్టాలు ఎదుర్కొంటారు. మధు అంటాడు-

" ఈ ప్రపంచంలో మనం తెలిసి ఎవరికీ అన్యాయం చేయలేదు. చేయం కూడా. అయితే మనమీదకు ఎవరైనా దాడిచేస్తే భరించగలిగే సహనం నాకులేదు. మనం స్నే హంకోసం, బాధ్యతకోసం ఇతరుల దగ్గరకు వెళ్తాం. అంతేగానీ అవసరాలకోసంకాదు. మన ప్రేమను ఎదుటివారు ఎంతగా అపార్థం చేసు కోనీగాక... మనల్ని విడిచి వెళ్ళనీగాక... వారంతా తిరిగి మన దగ్గరకొస్తారు. తప్ప కుండా వస్తారు. ఎందుకంటే మనం స్నేహాన్ని ప్రేమిస్తాం కాబట్టి"

నిజం! ఎంత వాస్తవమో!

ఓ రకంగా ఆ రోజులు ఎంతో బాగున్నాయి. అంత సంఘర్షణలోనూ ఒకరినొకరు భుజం తట్టుకోవటం. బంగారు భవిష్యత్‌గురించి కల లు కనటం. అవన్నీ ఈనాడు వాస్తవరూపం దాల్చటంలేదూ! మరి ఇంకెందుకు తనలో ఈ భయాలు... ఈ సందేహాలు... ఇవన్నీ అనవస రమైనవి. ఈ ఆలోచనలు తనను ఇంకేమా త్రం భయపెట్టవు. భయపెట్టలేవు.

కళ్ళు మూసుకుంది జానకి. ఓ చెయ్యి తన భర్తమీద వేసింది. మరో చెయ్యి తనబిడ్డమీద వేసింది.

ఆదేరకమైన అపురూప అనుభూతి కలి గిందాక్షణం.

పెదవులమీద చిరునవ్వులు వెలు స్తుండగా... ఒకేసారి చిన్ని మధు ఆమెను చుట్టేసుకొని ముడుచుకు పడుకున్నారు.

అవును ఆమె తల్లి...

ఆమె భార్య...

ఆమె 'స్త్రీ'

★ ★ ★

పెళ్ళిపందిరిలో అటూ ఇటూ తిరుగుతున్న అరుణ జానకిని చూడగానే వచ్చింది. "ఏం అక్కా, బాగున్నావా? ఎంతకాలం అయింది నిన్ను చూసి" అంటూ.

అరుణ హోమియో డాక్టర్‌కూడా. జానకి కంటే బాగా చిన్నది. మొదట్లో చదువు పూర్తి చేశాక కొంతకాలం ఖాళీగా ఉంది. ప్రాక్టీస్ పెట్టడానికి అరుణ వాళ్ళాయన ఎందుకో అంగీకరించలేదు. తర్వాత అంగీకరించాడు. అరుణ ఈ నడుమే ప్రాక్టీస్ ఆరంభించింది. మధు వెళ్ళి చూసివచ్చాడుకూడా.

"ఏంటక్కా ఏమిటి విశేషాలు? ఈ నడుమనే ఆరోగ్యం బాగుండటంలేదని మావయ్య చెప్పా డే" అంది అరుణ.

"ఆయన అలాగే చెబుతారు. నాకేం నేను బాగానే ఉన్నాను" అంది జానకి.

"అది కాదక్కా రాత్రిపూట సరిగ్గా నిద్రపట్ట లేదని అంటున్నావని, చేతులు నెప్పులు అంటున్నావని మావయ్య అన్నాడు"

"అదా ఎప్పుడన్నా అలా అనిపిస్తున్నాయి"

"అదికాదక్కా మనం ఎక్కడైనా కూర్చుందాం. నీతోపాటు మావయ్యవస్తే బాగుండేది"

"ఈరోజు అక్కడ ఓ పెళ్ళికి తను వెళ్ళాల్సి వచ్చింది. నాతోపాటు మా వదినగారు వచ్చారు. అందుకోసం నేను రావలసివచ్చింది"

"అది సరే అమ్మమ్మ చెప్పారు. మీ ఇంటికి రావాలంటే నీళ్ళతో ఇబ్బంది అని. మావయ్యా ను కొంచెం నీళ్ళు పట్టమని చెప్పకూడదూ. వ్యాయామంలా ఉంటుంది తనకి. నీకు చేతు లనొప్పి తగ్గుతుంది"

"మీ మావ ఆ పనిమాత్రం ఛస్తే చేయడు తల్లీ"



"చేయదంటే ఎలా? చేయించగలగాలి" అంది నవ్వుతూ.

"ఇంతకూ ఏమిటి విశేషాలు... ఎలా ఉంది ప్రాక్టీస్"

"ఏం ప్రాక్టీసో ఏమిటో నాకు భయంగా ఉంది. ఓసారి వచ్చిన పేషెంట్ మరలా రావటంలేదు. తగ్గిపోయిందని రావటంలేదా? నా అప్రోచ్ బాగుండక రావటంలేదా అనేది అర్థంకావటంలేదు" అంది అరుణ. ఆ మాటలు అంటున్నప్పుడు ఆమె కళ్ళు చిన్నవయ్యాయి.

"అయన్తో పోట్లాడి ప్రాక్టీస్ పెట్టానక్కా... అయన ఏమీ అనకపోయినా కనీసం అద్దెలవరకయినా రావాలికదా. లేకపోతే రేపు నవ్వుతూ ఏదైనా అన్నా మనకు బాధగా ఉంటుంది"

"అయితే మొత్తానికి డాక్టర్లకు కూడా భయాలుంటాయన్నమాట"

"డాక్టర్లు మనుషులు కాదా? మానవులందరికీ భయాలు ఉంటాయి. మనకేకాదు జంతువులకీ ఉంటాయి. పామంటే మనకెంత భయమో, మనమన్నా పాముకీ అంతభయం ఉంటుంది"

"మీ దగ్గరకి భయాలకు చెందినవారు వస్తుంటారా?"

"రకరకాల కేసులు వస్తుంటాయి. నాకింకా అంత ప్రాక్టీస్ లేదనుకో. వచ్చే కేసుల్లో ఎక్కువగా ఊరికే భయపడేవారు. పిల్లల పెళ్ళిళ్ళు కావని, మొగుడు బయట తిరుగుతున్నాడని, ఇలా రకరకాలుగా. ఇవన్నీ మా దగ్గరదాకా రానవసరంలేదు. పరిష్కరించుకోవచ్చు"

"మరి మీకు మాత్రం ప్రాక్టీస్ ఉండొద్దూ. మీ భయాలనుండి మిమ్మల్ని బయటపడేయాలి కదా" అంది జానకి.

"అచ్చా... అది నిజమే అనుకో ఇంకేమిటి విశేషాలు"

"ఏముంది అరుణా మా ఇంటిపక్క వదినగార్ని తీసుకొచ్చాను. ఆవిడకు గుండె నొప్పని అనుమానం"

"నిజమక్కా... ఈ అనుమానాల్తో, భయాల్తో ఛస్తామనుకో. నీకేం జబ్బులేదని చెప్పినా ఛస్తే నమ్మరు. నాకు చాలా చిత్రమైన కేసులు తగులుతాయి. ఇంట్లో భార్యాభర్తల ప్రవర్తనల వల్ల పిల్లల ఆలోచనలూ, జీవితం రూపుదిద్దుకుంటాయి. మన కుటుంబాల్లో అనేక విషయాల్లో జాగ్రత్త తీసుకోం. వాళ్ళముందే పోట్లాడుకుంటాం. వాళ్ళముందే సరసాలు. ఆ తర్వాత కాలంలో ఇవన్నీ రకరకాలుగా ప్రభావం చూపిస్తాయి. సెక్సువల్‌గా సమస్యలు ఎదుర్కొనే స్త్రీలు నా దగ్గరకు వచ్చారు. చిన్నప్పటినుండి మనం కొన్ని పరిధుల్లో పెరిగాం... పెరుగుతున్నాం. మనకు అన్నీ తప్పులే. ఇటుచూస్తే జీవితంలోనూ, సమాజంలోనూ వేగంగా మార్పులొస్తున్నాయి. ఆ వేగాన్ని అందుకుచావలేం. ఏదన్నా చేయాలంటే సవాలక్ష అనుమానాలు, భయాలు. ఏమిటోలే నాకనిపిస్తుంటుంది ఈ ప్రపంచంలో ఎప్పటికయినా భయం అనే భావంపోతుందా అని. నాకు అలాంటిది జరగదనే నమ్మకం" అంది అరుణ.

"ఏమిటోయ్ - ఇద్దరూ కూర్చుని కబుర్లు చెప్పుకుంటున్నారు. ఏదైనా పని చూడగూడదూ. అవతల జనం భోజనాలకోసం తొందరచేస్తున్నారు. వారికి అన్నీ అందుతాయో... అందవో" అని ఓ అత్తగారు అనేసి వెళ్ళిపోయింది.

"అదీ సంగతి - మనంకూడా వెళ్ళి కొంచెం ఉప్పువేస్తేగాని జనం బూతులు తిట్టరు. ఆవిడకి ఊరికే కంగారు. అందర్నీ చేయమంటుంది. మనం ఆ పనుల దగ్గరకెళ్తే రభస తప్పితే ఇంకేం ఉండదు. ఏం చేస్తాం. పెళ్ళిళ్ళలో అత్తలకు ప్రత్యేక హక్కులుంటాయి. వారు విసుక్కుంటారు. తిడుతుంటారు - తప్పదు" అంది నవ్వుతూ అరుణ.

"అదికాదోయ్... ఈ అత్తలమీద కసి తీర్చుకోవటానికయినా ఇంగ్లీష్ డాక్టరవి కాకపోతివి. వరసగా అందరికీ ఇంజెక్షన్లు చేసేదానివి"

అరుణ బిగ్గరగా నవ్వింది.

"ఏంటమ్మాయ్ నవ్వుకుంటున్నారు" అంటూ వచ్చారు భరద్వాజ.

"ఏముందన్నయ్యా లోకాభిరామాయణం. మా వదినగారు మాత్రం హడావిడిగా తిరుగుతున్నారు. ఓచోట ప్రశాంతంగా కూర్చోదు.





ముందనలు 'మదర్' ఆశ్రమంలోనికి మా వదిన్ని పంపించాలి" అంది జానకి.

"మదర్ చెంతకు పంపించటం అంటే సామాన్యమా తల్లీ... ముందు తనని తాను సమర్పించుకోవాలి. మీ వదినకు ఈ ప్రపంచం తప్ప మరేటి అవసరంలేదు"

"అదేంటన్నయ్యా వదిన్ని మీరు మార్చవచ్చుగా"

"వచ్చు... ఏదైనా చేయవచ్చు. కానీ అటు నుండి ప్రయత్నం ఉండాలికదా! గుర్రాన్ని చెరువువరకు నడిపించగలంగానీ నీరు తాగించలేం. మీ వదిన పరిస్థితి అంతే. నా వరకు ఎవరికి అవసరమైతే వారికి ఉపయోగపడటమే" అన్నారాయన.

"మీరు చదివిన పుస్తకాలవల్ల ఉపయోగం ఏమిటి?"

"ఒక ఉపయోగం ఏమిటమ్మా మనను ప్రశాంతంగా ఉంటుంది. మన మనను వేరే ఆలోచనల మీదకు, తుచ్ఛమైన కోరికలమీదకు వెళ్ళదు. మనకో ఆధ్యాత్మిక ప్రపంచం ఏర్పడుతుంది. దాన్లో మనం విహరిస్తాం. మనం రోజురోజుకు ఎదుగుతుంటాం. మానవ జీవిత పరమావధి ఏమిటో తెలుసుకదా... మనం క్రమంగా మదర్‌లో ఐక్యం కావాలి. అప్పుడే ఈ లోకంలోకి వచ్చినందుకుగానూ మన కర్తవ్యం పూర్తవుతుంది"

"అన్నయ్యగారూ... మనం మదర్‌ను ఆరాధించామనుకోండి. మనకు మాత్రమే ముక్తి కలుగుతుందా లేక పిల్లలకూ, భర్తకూ కూడా కలుగుతుందా?"

"ఇదేమీ ఆస్తికాదమ్మా పంచుకోవటానికి. ఇది ఎవరికివారు తమ నమ్మకంద్వారా, సాధనద్వారా సాధించుకోవాల్సిందే. అంతేగాని నావల్ల నా కుటుంబానికి రాదు"

"అన్నయ్యా ఇంకోటి అడుగుతాను"

"అడుగమ్మా"

"మీ పిల్లల్లో ఎవరికైనా నీ భావాలు వచ్చాయా?"

"ఎక్కడమ్మా- దాదాపు లేనట్లే. కాకపోతే ఇప్పటివరకూ నా మాటలు వింటున్నారు. రేపు వింటారా అంటే సందేహమే"



"మరి మీరెందుకు వారిని మార్చే ప్రయత్నం చెయ్యలేదు. వదిన అంటే పెద్దది. పిల్లలు మొదటినుండీ మీతోనే ఉంటున్నారు కదా?"

"మన చేతుల్లో ఏముంది తల్లీ. మనం ప్రయత్నం చేస్తాం అంతే. నీ కర్తవ్యం నిర్వర్తించటంవరకే నీ బాధ్యత. ఫలితాలకోసం ఎదురు చూడవద్దు. అంతే" అన్నారాయన.

ఈలోపు ఎవరో వచ్చారు. వారితో మాట్లాడటం ఆరంభించారాయన.

జానకి అక్కడ అందరితో మాట్లాడుతుంది గానీ... ఆలోచనలు... ఒకటే ఆలోచనలు...

తనకు భగవంతుడంటే విశ్వాసం ఉంది. ఎందుకు ఉందో, భగవంతుడంటే ఏమిటో తనెప్పుడూ ఆలోచించలేదు. తనకు నమ్మకం. అది చిన్ననాటినుండి ఉంటూ వచ్చింది. ఆ భక్తి అంత సీరియస్‌గా లేదు. ఎప్పుడయినా నమస్కరించటం. పండగలప్పుడో పూజించటంమించి తనేం ఎక్కువగా పట్టించుకున్నదీ లేదు. పెళ్ళయిన తర్వాత చాలావరకు తగ్గిపోయిందికూడా. ఎక్కువగా తను సంక్షోభంలో ఉన్నప్పుడు మాత్రమే భగవంతుణ్ణి తలిచింది. ముఖ్యంగా పిల్లలకు జబ్బుచేసినప్పుడు తగ్గాలని ఎంతగానో కోరుకునేది. తమ జీవితంలో చిత్రమైన విషయం ఒకటుంది.

మధు పెళ్ళి విషయంలో తన తండ్రి ఓ మొక్కు మొక్కారు. మధు పిల్లవాడిగా ఉన్నప్పుడు ఏదో పెళ్ళికి అందరూ తిరుపతి వెళ్ళారు. అప్పట్లో మధుకు చిన్నబిడ్డ నొప్పులు వస్తుండేవి. ఆరోజూ వచ్చింది. ఈ నొప్పులు రావటం ఆగితే వీడిపెళ్ళి తిరుపతిలోనే చేస్తాం- అని మొక్కటం జరిగింది. ఇప్పుడు అదే అబ్బాయికి తన అమ్మాయినిచ్చి తన ఇంట్లోనే పెళ్ళిచేయడం జరిగింది. తమ పెళ్ళి వాస్తవంగా తిరుపతిలో జరగాలి. అందుకాయన అంగీకరించరు. కనీసం పెళ్ళి అయినా కయినా తిరుపతి వెళ్ళిరావాలట. ఇంతవరకూ తిరుపతికాదు- ఎక్కడికీ వెళ్ళలేదు ఈ నడుమ అంటున్నారు.

"జీవితంలో మరీ రొటీనెస్ ఎక్కువయింది. నెలకు రెండువందలు తీసి పక్కన పెట్టు. సంవత్సరానికొకసారి మనందరం కలసి ఎక్కడికైనా టూర్ వెళ్దాం"

"తిరుపతి తీసుకెళ్తారా?"

"ఎందుకు తీసుకువెళ్ళను. నువ్వు అక్కడ శ్రీనివాసుల్ని చూడు. నేను తిరుమల కొండల అందాలు చూస్తాను"

"ఇప్పుడు ఈ మాటల్నిబట్టి చూస్తుంటే భక్తి వ్యక్తిగతమే. అందుకే భక్తికి మించిందేదో కావాలి- కనీసం తన పిల్లలకూ, భర్తకూ ఉపయోగపడేదేదైనా! అప్పుడే బాగుంటుంది" అనుకొంది. జానకి జీవితం ఆ క్షణం మరో మలుపు తిరిగింది.

ఆమె ఇంకేమాత్రం భరద్వాజ ట్రాన్స్‌లో పడదలుచుకోలేదు.

ఆమెకిప్పుడు ఇంకేదో కావాలి. ఏంకావాలో స్పష్టంగా తెలియదు. అంతవరకు వాస్తవం.

ఈ పెళ్ళికి మామయ్యనూ తీసుకొచ్చారు.

ఆయన అందర్నీ చూసి కళ్ళనీళ్ళు పెట్టుకున్నారు. తనకిప్పుడు అందర్నీ చూడాలనిపిస్తుందనీ, తనెటూ కదలలేదు కాబట్టి వీలు చూసుకొని చూసిపొమ్మని అందరితోనూ చెప్పారు. జానకితో ప్రత్యేకించి కొన్ని విషయాలు చెప్పారు.

"చూడమ్మా జానకి. నేను ఎంతోకాలం బతకను. ఆ విషయం నాకు తెలుస్తూనే ఉంది. నేను చచ్చిపోతే ఓ పని చెయ్యండమ్మా. బ్రాహ్మడ్ని మాత్రం పిలవొద్దు. మీరందరూ వస్తారు కదా. అందరూ కలిసి నాలుగు రోజులు మాఇంట్లో ఉండండి. అంతేకాదు నా దినానికి ఊర్లో వారందరినీ పిలవద్దు. అయినా నేనేమాత్రం గొప్పవాడినని అందరినీ పిలిచి చేయటం. ఇప్పటిదాకా ఖర్చుపెట్టింది చాలమ్మా. వాళ్ళు నామాట వినరు. నేనేం వాళ్ళకు ఇవ్వలేకపోయాను. పైగా వాళ్ళందరూ నేను చచ్చిపోయాక కూడా ఎందుకు ఖర్చుపెట్టడం" అన్నారాయన.

"అదేంటి మామయ్యా అంత నిరాశగా మాట్లాడతావేమిటి? నీకేంకాదు. నీకు త్వరలోనే తగ్గిపోతుంది. నువ్వు ఇంకా చాలా కాలం మాముందుంటావు. అయినా పిల్లలకు చదువు చెప్పించావు. ఎవరి బతుకులు వారు





బతుకుతున్నారు. ఇంతకంటే నువ్వేం ఇవ్వాలి? నీకు ఖర్చుపెట్టడం వారి బాధ్యత. ఈ విషయం గురించి ఎక్కువగా ఆలోచించి జబ్బు ముదరపెట్టుకుంటున్నావు. నలుగురు ఆడపిల్లలకు పెళ్ళిళ్ళుచేసి పంపించటం, నలుగురు పిల్లలకు చదువులు చెప్పించటం అంటే మాటలుకాదు. మేం ఇద్దరు పిల్లలకే భయపడి ఛస్తున్నాం. మీకాలవు వారిని తలుచుకుంటేనే మాకు అద్భుతంగా ఉంటుంది. అసలు ఇంతమందిని ఎలా పోషించారా అనేది గొప్ప విషయం'' అంది జానకి

తను మాట్లాడుతుంటే ఆయన కళ్ళు సంతోషంతో మెరిసాయి.

"ఇంకా ఎన్ని రోజులుంటారమ్మా''

"ఎక్కడ మామయ్యా రేపు వెళ్లిపోవాలి. అక్కడ పిల్లలకూ, ఆయనకూ ఇబ్బంది కదూ''

తిరిగి ఆయన కళ్ళు చిన్నబోయాయి

"అవును కదూ వెళ్లాలి. తప్పకుండా వెళ్లాలి. మీ అత్తయ్య లేకుండా నేను కొద్దిసేపు కూడా ఉండలేను. చూడు జానకీ...నువ్వు తప్పకుండా నన్ను చూట్టానికి వస్తుండాలమ్మా. మీ అందర్నీ చూస్తుంటే నాకెంతో ధైర్యంగా ఉంటుంది'' అన్నారాయన.

జానక్కి అది వాస్తవమే అనిపించింది. తనుధైర్యం చెబుతుంటే ఆయనలో మార్పు స్పష్టంగా కనపడింది. ఆయనకు నిజంగా ఇప్పుడు కావలసింది ధైర్యం చెప్పటం.

చిత్రంగా తనెంత ధైర్యంగా మాట్లాడిందో తలుచుకుంటే ఆశ్చర్యం కలుగుతూంది. తనే రోజూ భయంతో గిజగిజలాడుతోంది. అయినా తనకంటే ఎంతో పెద్ద అయిన మామయ్యకు ధైర్యం చెప్పగలిగింది. తలుచుకుంటే నవ్వొచ్చింది.

ప్రతిమనిషికీతన అనుభూతుల్నీ కష్టాల్నీ వినటానికీ, తమను వెన్ను తట్టడానికీ, అభినందించడానికో ఓ మనిషి అవసరం. బహుశా మామయ్యకు తను నచ్చి ఉంటుంది. అందుకు కారణం ఏమిటి? ఇదివరలో కొందరు బంధువులు తమను ప్రశంసించటం బాగా గుర్తు.

"మీఇద్దరినీ చూస్తే మాకు సంతోషం కలుగుతుంది జానకీ. మీకు జీవితం గురించి భయం లేదు. మీరు ఈ సమాజంలో ఎలాబంకాలో తెలుసుకున్నారు. రెండువందల్లో, ఇన్ని సంవత్సరాలూ ఎన్నో సమస్యల్లో నెట్టుకొచ్చారు. మాకు ఇంత జీతం వస్తుంది. పొలాల మీద ఆదాయం వస్తుంది. చాలటం లేదు. మీ విజయ రహస్యం చెప్పండి''

మామయ్య ఈ విషయంలో మరీ పొగిడేవారు. తమకుటుంబంలో జరిగే విషయాలన్నీ వారికి తెలియకపోయినా కొన్ని తెలుస్తాయి. ఇన్నిసంవత్సరాలూ తాము ఒంటరిపోరాటం సాగించారనే విషయం అందరికీ తెలును. తాము కూడా ఏదశలోనూ ఎవరైనా ఇస్తే బాగుండునని మాత్రం అనుకోలేదు. కానీ కొద్దిపాటి సానుభూతిని, ప్రోత్సాహాన్ని మీరు ముందుకు వెళ్లారు అనే ఆశాభావాన్ని వ్యక్తంచేయటాన్ని మాత్రం ఆశించేవారు.

తమకు ఎలాంటి సహాయం చేయకుండా విమర్శించే వారివల్ల ఎక్కువగా తమదృష్టి ఉండేది. మరీ ముఖ్యంగా మధుకి. జీవితంలో తను వేరెవరికంటే తనభర్తనుండే ఏమైనా ఆశించింది. ఆయనకు తనవంట నచ్చితే, తనను ప్రశంసిస్తే తనకెంతో సంతోషం కలుగుతుంది. ఆయనకూ అంతే. తనముందు వదేవదే చెప్పకపోయినా, తన స్నేహితుల ముందు, బంధువులముందు తననో అద్భుత వ్యక్తిలా చిత్రిస్తాడు. ఇంతకాలం తాము అన్ని సమస్యల్ని ఎదుర్కొనబట్టే తనకుగానీ, ఆయనకుగానీ గౌరవం లభిస్తూంది.

తను ఈ భయం నుండి విముక్తం కాకపోతే తన పరిస్థితి కూడా ఇలానే అవుతుంది. అందరూ తమ గతం కంటే ఈ విషయం గురించే మాట్లాడుకుంటారు. అందరి కళ్ళూ తనను జాలిగా చూస్తాయి. ఇవి తను భరించలేదు. భరించదు. అయినా తను ఎందుకు భయపడాలి? భయపడదు. తను వ్యక్తిగతంగా గర్వించతగ్గ గతం ఉంది. ఇక ముందు ఉండాలి- ఉంటుంది.''

* * *

"ఈరోజు శ్రీధర్ తన శ్రీమతితో వస్తున్నాడు. నువ్వు పెళ్ళికి రాలేదు కాబట్టి ఆ అమ్మాయిని నీకు చూపించాలనుకుంటున్నాడు.



సాయంకాలం వస్తారు. ఏమైనా చేసి ఉంచు" అన్నాడు మధు.

"సర్లేండి" అంది జానకి.

మధు సాయంకాలం ఇంటికి వచ్చి, బట్టలు మార్చుకుంటుండగా శ్రీధర్ నవ్వుతూ వచ్చాడు. వెనక శ్రీధర్ శ్రీమతి నిలబడింది.

"రండి" అంటూ ఆహ్వానించారు.

"అక్క జానకిగారు, నీకు చెప్పాను కదా. బావగారు. పెళ్ళిలో చూశావు కదా" శ్రీధర్ పరిచయం చేశాడు.

ఆ అమ్మాయి నమస్కరించింది.

"లక్ష్మి" అన్నాడు శ్రీధర్ జానకి కేసి చూస్తూ.

జానకి నవ్వి "కూర్చోండి" అంది కుర్చీలు చూపిస్తూ.

కూర్చున్నాక జానకి ప్లేటుల్లో స్వీటు అందిస్తూ-

"కబుర్లు చెబుతూ తీసుకోండి"అంది.

"ఏంటక్కా ఇవన్నీ పెట్టుకున్నావు?" అన్నాడు.

"నిక్కాదులేవయ్యా మా మరదలు అక్కడ కొస్తే మాకు పెట్టాలిగా" అంది జానకి.

ఆ అమ్మాయి సిగ్గు పడింది.

"మీ పెళ్ళికి నేను రాలేకపోయాను. రాగానే మీ బావగారు చెప్పారు. చాలా మంది ఉపన్యాసాలు చెప్పారట.

మా పెళ్ళి అలానే జరిగింది. అది సరే ఇంతకూ ఈ అమ్మాయి కూడా నీతోపాటు జెండాలు పట్టుకొని వస్తుందా?" అంది జానకి.

ఆ అమ్మాయి తిరిగి నవ్వి తలదించుకొంది.

"లేదక్కా లక్ష్మి ఇంకా నా రూట్లోకి రాలేదు. వాళ్ళ ఇంట్లో జెండాలు పట్టుకునే వారు లేరు. అయితే నాన్నంటే మావయ్యకు అభిమానం. లక్ష్మి కూడా నీ అంతే చదువుకుంది. లక్ష్మిని మెల్లగా నా దారిలోకి తెచ్చుకోవాలి. మొదటగా 'లక్ష్మి'కి "అమ్మ" పుస్తకం ఇచ్చాను అన్నాడు శ్రీధర్.

"మొదటి రోజు నుండే భయపెడుతున్నావన్నమాట" అని తర్వాత అంది.

"ఏం చేస్తాం? మిమ్మల్ని కట్టుకున్నాక మీతో పాటు నడవాలికదా. మీ పుస్తకాలు చదవాలి. మీ వెంట రావాలి."

"ఏమిటక్కా నువ్వేనా ఇలా మాట్లాడుతున్నది. ఉండు ఈరోజే ప్రారంభించుదాం" అని సంచిలో నుండి ఓ పుస్తకం తీసి అందించాడు.

"ఏం పుస్తకం?"

"'స్త్రీ' సామాజిక పరిణామ క్రమంలో స్త్రీ గురించి రాశారు. చాలా బాగుంటుంది. తప్పకుండా చదువక్కా"

జానకి ఆ పుస్తకాన్ని అనుభూతితో అందుకొంది.

"ఏంటమ్మాయ్...నువ్వు కూడా ఏమైనా మాట్లాడు. ఈ ఇల్లు మీదే, కొత్తేం లేదు" అన్నాడు మధు.

లక్ష్మి నవ్వింది.

"అదేం లేదు. మీరు మాట్లాడుతుంటుంటే వింటున్నాను."

ఆ అమ్మాయిని చూస్తుంటే జానక్కి చాలా ముచ్చట కలిగింది. కారణం ఆ అమ్మాయిలో తనకు కావలసిందేదో ఉంది.

లక్ష్మితో తనను పోల్చుకుంది జానకి.

తన పరిస్థితి భిన్నమైంది. మధు శ్రీధర్‌లా పనిచేసి ఉండలేదు. మధుకి చిన్న నాటి నుండి జీవితమే ఓ సమస్య. ఏమైనా చేయాలనుకుంటున్నప్పుడే అమ్మకోసం మరో రకమైన జీవితంలోకి వచ్చాడు. ఆ అసంతృప్తి తనలో బాగా ఉంది. అది అనేక రూపాల్లో బయటకొస్తుంది. తాము దరిద్రం తెచ్చే సమస్యల్ని అనుభవించారు. శ్రీధర్ దరిద్రాన్నే కాక ఇంకా చాలా అనుభవించాలి. ఎందుకో లక్ష్మిని చూస్తూంటే జాలి కలుగుతోంది. చక్కగా ఉంది. పెళ్ళికళ ఇంకా ఆ మొఖంలో కనపడుతోంది. శ్రీధర్ కూడా కొత్తగాకనిపిస్తున్నాడు. తను చూస్తున్న దృష్టిలో ఏమైనా మార్పు వచ్చిందా? ఏమో! శ్రీధర్ గురించి ఇంకా చాలా విషయాలు చెప్పాడు మధు.

మధు శ్రీధర్‌తో నిర్మొహమాటంగా చెప్పాడు.

"చూడు శ్రీధర్ నువ్వు ఇదివరకటిలా ఒక్క





డివికావు. నీతోపాటు మరో వ్యక్తి ఉంది. నీ పద్ధతులు మార్చుకోవాలి. నువ్వు షాపు పెట్టావు. ఎందుకు పెట్టావు? దాంట్లో పది రూపాయలు వస్తే కుటుంబం గడుస్తుందని. అంతే గాని బయట నుండి అప్పులు తెచ్చి షాపు నడవటం కంటే కట్టేయటం మంచిది. ఇప్పటికే ఆలస్యం చేశావ్'' అన్నాడు.

''లేదు బావా... ఇప్పుడు నీకు చెబుతున్నానని కాదు. ఇక నుండి లక్ష్మి షాపులో ఉంటుంది. త్వరలోనే అన్ని బాకీలు తీర్చేస్తాను'' అన్నాడు శ్రీధర్.

''ఏమిటి మా మరదల్ని షాపులో పెడతావా?'' అంది జానకి.

''అదే బాగుంటుంది. అమ్మాయయితే జాగ్రత్తగా ఉంటుంది. కనీసం లాభాలు రాకపోయినా నష్టాలు రావు.'' అన్నాడు మధు.

జానక్కి పైకి అనటం బాగుండదేమోనని ఊరుకుంది గాని ఈ అమ్మాయి షాపులో ఉండి వ్యాపారం చేయగలదా అనిపించింది.

''మేం వెళ్ళొస్తామక్కా'' అన్నాడు శ్రీధర్.

''ఉండండి'' అంటూ లేచి లక్ష్మికి బొట్టుపెట్టి ఓ జాకెట్‌గుడ్డ ఇచ్చింది.

''వద్దండి'' అంది లక్ష్మి.

''అలా అనకూడదమ్మా. మొదటిసారి మా ఇంటికొచ్చావు- నా తృప్తికోసం'' అంది జానకి.

''మీరిద్దరు కలసి మా ఊరు రావాలి. పిల్లల్ని తీసుకొని'' అన్నాడు శ్రీధర్

''వెళ్ళొస్తాం వదినా'' అంది లక్ష్మి.

వారిద్దరూ వెళ్తుంటే ముచ్చటగా అనిపించింది జానక్కి.

* * *

''నాన్నగారు ఏదో ప్యాకెట్ తెస్తున్నారు'' అన్నాడు చిన్ని

మధు టేబుల్ మీద ఉంచాడు.

''బెడ్ లైటమ్మా'' అన్నాడు చిన్ని ఆనందంగా

బెడ్‌లైట్ మాడిపోయి ఎంతకాలమైందో. అది ఉన్నా ఎక్కువగా తాము ఉపయోగించరు. మధుకి చీకటంటే ఇష్టం. చీకట్లో ఉండటానికి బాగా ఇష్టపడతాడు మధు. ఇంట్లో ఉంటే తలుపులు మూసుకోవాల్సిందే. రాత్రి పూట కూడా బెడ్‌లైట్ వద్దంటాడు. తాముండేచోట దోమలు బాగా ఉంటాయి. దోమ తెరలు కడదామంటే మధ్యలో పిల్లలు లేస్తుంటారు. అప్పుడు ఏ రెండు మూడు దోమలో వస్తాయి. ఇంక అక్కడనుండి మధుకి చిరాకు. అరుస్తుంటాడు. లైటు వేద్దామంటే ఆ వెలుగులో దోమలు తమను ఇంకా బాగా కుడతాయని మధు సిద్ధాంతం. అందుకని రాత్రి పూట చీకట్లో పడుకోవటమే ఆయన కిష్టం. జానకికి అలా బాగుండదు. ఏదైనా అవసరమొస్తే అంతా తడువు కోవాలి. పిల్లలు కూడా చీకటికి అలవాటు పడ్డారు. అసలు సామాన్యంగా పడుకుంటే మళ్ళీలేవరు.

మధు ఉన్నప్పుడు లైట్ లేకపోవటం అంత ఇబ్బంది అనిపించదు. మధు ఊళ్ళో లేనప్పుడు ఆ చీకటి ఎంతో ఇబ్బంది పెడుతుంది. పీడకలలు వస్తాయి. కళ్ళు తెరిస్తే ఆ కల కన్నా భయంకరంగా కన్నుపొడుచుకున్నా కనిపించని చీకటి. ఈ ప్రపంచమంతా చీకటి ప్రళయంలో కలిసిపోతుందనే భావన. ఎక్కడి నుండో కుక్కల అరుపులో, రోదనో వినిపిస్తుంటుంది. తమ ఇల్లు రైలుస్టేషన్‌కు దగ్గర కావటంతో ఏ బండి కూతో చెవుల్ని తాకుతుంది. అప్పుడే కునుకు పట్టబోతుంటే 'టక్' 'టక్' మంటూ ఘుర్కా చేసే శబ్దం. ఒక్కసారిగా మువ్వలనవ్వడి. ఏదో రిక్షా ఇంటి ముందు ఆగినట్లుగా... బయట తను వేసిన తాళాన్ని ఎవరో తీస్తున్నట్లుంటుంది. ఆ చీకట్లో ఎవరైనా తమ మీదకు దాడిచేస్తారేమో అనిపిస్తుంది. పిల్లల దగ్గర ముడుచుకు పడుకుంటుంది. ఎప్పుడు తెల్లవారుతుందా అని ఎదురు చూస్తుంది. తూర్పున వెలుగు రేకలు రావటంతో బయటకు వస్తుంది. క్రమంగా సూర్యుడు పైకొస్తాడు. తన పనిలో తాను అన్నీ మరిచిపోతుంది.

''ఏమిటి ఈరోజు బెడ్‌లైట్ తెచ్చారు'' అంది జానకి

''ఏంలేదు. రాత్రి పూట చీకటిగా ఉంటుంది కదా. నువ్వు చాలాకాలం నుండి చెబుతున్నావ్. అయినా నేను పట్టించుకోలేదు. ఎప్పటికప్పుడు తేవాలనుకుంటూనే నిర్లక్ష్యం

చేయటం జరిగింది. ఈరోజు తేవాలనుకున్నాను. తెచ్చాను." అన్నాడు మధు.

"ఈ నడుమ మీలో చాలా మార్పు వస్తోంది" అంది జానకి.

మధు నవ్వాడు.




మధు, సారథి కూర్చున్నారు

"బిహేవియర్ థెరపీని ఇంట్లో ఆరంభించానోయ్. ముందు నాలోని బలహీనతల్ని ఒక్కొక్కటే తొలగించుకోవటం మొదలు పెట్టాను. తర్వాత గానీ జానకిని మార్చే ప్రయత్నం మొదలుపెట్టను." అన్నాడు మధు.

"అది సరే. ఇంతకూ ఆవిడ పరిస్థితి ఎలా ఉంది?"

"ఎలా ఉంటుంది, మామూలే. అయితే ఇటీవలికాలంలో కొద్దిగా మార్పు కనిపించింది. మన ప్రయత్నం ఇంకొంచెం ముందుకు వెళ్ళిన కొద్దీ ఫలితాలుంటాయి"

"అసలు ఆమె దైనందిన కార్యక్రమం ఎలా ఉంటుంది?"

"ఉదయం లేస్తుంది, ఎనిమిది గంటలదాకా నీళ్ళు పట్టడం...వంట చేయటం...పిల్లలు తొమ్మిది గంటలకల్లా తినేసి బడికి వెళ్తారు. మరో అరగంట తర్వాత నేను బయలుదేరతాను."

"ఆ తర్వాత?"

"ఆ తర్వాత ఏముంటుంది. బట్టలు గుంజుకుంటుంది. ఇంకేమైనా చిన్నచిన్న పనులుంటే చేసుకుంటుంది"

"నువ్వూ, పిల్లలూ మధ్యాహ్నం వస్తారా?"

"నేను భోజనానికి వెళ్తాను- పిల్లలిద్దరూ ఉదయమే భోంచేసి టిఫిన్ తీసుకెళ్తారు"

"నువ్వెంతసేపు ఇంట్లో ఉంటావు?"

"మహాఅయితే ఓ గంట"

"ఆ తర్వాత ఆమె ఏంచేస్తారు?"

"కొంచెంసేపు నిద్రపోవచ్చు, లేదా పక్కింటి వారు వస్తే వారితో మాట్లాడవచ్చు"

"సాయంకాలం పని ఏమిటి?"

"సాయంకాలం పెద్ద పని ఉండదు. పిల్లలు రాగానే స్నానం చేసి ట్యూషన్ కెళ్తారు. ఆమె అన్నం, కూర వండటంతో పని అయిపోతుంది"

"ఆ తర్వాత ఆమె పనేమిటి?"

"ఏముంటుంది, పక్కవారితో కబుర్లు"

"నువ్వు వెళ్ళేసరికి ఎన్నిగంటలవుతుంది?"

"ఎనిమిది కావచ్చు"

"నువ్వు వెళ్ళాక ఏంచేస్తావ్?"

"స్నానం చేసి భోంచేస్తాను. కొద్దిసేపు ఏదైనా పుస్తకం చదువుతాను. కొంచెంసేపు మాట్లాడుకొంటాం. ఆ తర్వాత పడుకుంటాం. ఏమిటింత వివరంగా అడిగావు?"

"ఏంలేదు... ఆమె దైనందిన కార్యక్రమం ఎలా ఉంటుందో తెలుసుకోవటానికి అడిగాను. అది సరే. పని సమయంలో ఆమె ఎలా ఉంటుంది?"

"ఆ విషయంలో తను ఓ మోడల్ అనుకోవచ్చు. వాళ్ళ నాన్న శ్రమైక జీవనం తనకి వచ్చింది. ఏమంటే మాత్రం ఛస్తే ఊరుకోదు. ఎంతపనయినా లెక్కచేయదు. చాలామంది ఆడవాళ్లు రాత్రి అంట్లు తెల్లారాక తోము కుంటారు. మా ఇంట్లో ఎప్పటికప్పుడు అయిపోవాల్సిందే. బట్టలు కూడా అంతే. ఏ రోజువి ఆరోజే. ఒక్కోసారి నాకు కోపం వస్తుంటుంది. మాకు నీళ్ల తొట్టి ఉంది. దాన్నిండా నీళ్లుపడుతుంది. రెండు మూడు రోజులకోసారి వాటిని తీసి తొట్టి కడుగాల్సిందే. అలాగే మంచినీళ్ల కోసం ప్రత్యేకంగా ఓ బిందె నీళ్లు పడుతుంది. తిరిగి వాటిని ఉదయమే తొట్టిలో పోస్తుంది. ఎందుకీ శ్రమ అంటాను. వినదు. తన పని తనదే. మాకు పనివాళ్లు దొరకరు. దొరికినా





పెట్టుకోదు. ఆఖరుకు బట్టలు కూడా తానే ఉతుక్కుంటుంది. ఓపికున్నా లేకపోయినా ఇవన్నీ జరగాల్సిందే. మహా అయితే ఎప్పుడన్నా దుప్పట్లు మాత్రం చాకలికి వేస్తుంది. ఇదయ్యా బాబు ఆవిడపని''

''రోజూ ఉదయం నువ్వెన్ని గంటలకు లేస్తావు?''

''ఏడు గంటలవుతుంది. లేచాక కాఫీ తాగుతాను. పేపర్ చదువుతాను. పిల్లల విషయం రెగ్యులర్‌గా చూడనుకానీ ఎప్పుడో ఓసారి చూస్తాను'' అన్నాడు మధు.

''అయితే ఆమె పనిలో తమరి సహాయం ఏమీ ఉండదా?''

''సహాయమా? అంటే...?''

''ఉదయాన్నే నీళ్ళు పట్టడం, అన్నం వండటం, పిల్లల్ని పంపటం అన్నీ ఏకకాలంలో జరగాల్సిందేగా?''

''దాదాపు అంతే''

''అంటే ఆ రెండు మూడు గంటలకాలంలో శారీరకంగా, మానసికంగా ఆమె ఎంత వత్తిడికి గురవుతుందో ఆలోచించావా? నువ్వు ఉదయాన్నే లేవవు. ఇక్కడి నీళ్ల పరిస్థితి నీకు తెలును. మనం ఉంటున్న కొంపల్లో ఒకసారే నీళ్ళు పట్టుకునే అవకాశాలుండవు. ఎవరి వంతు ఎప్పుడు వస్తుందా అని ఎదురుచూడాలి. ఈలోగా అన్నం, కూరలు మాడుతున్నాయేమో అని పరిగెత్తుకురావాలి. అదే సమయంలో నీకు కాఫీ ఇవ్వాలి. స్నానానికి నీకూ, పిల్లలకూ నీళ్లు తోడాలి. ఆ మనిషి ఎంతగా అలసిపోతుంది. ఆ పనిలో నుండి ఆమెను కొద్దిగానైనా విముక్తి చేయాలికదా. నువ్వు నీళ్లు ఎందుకు పట్టకూడదు?'' అన్నాడు సారథి.

ఈ విషయంలో తను మహాబద్ధకస్తుడు. కనీసం బాత్‌రూంకి వెళ్లాలన్నా ఎవరో ఒకరు నీళ్లు తేవాల్సిందే. తలచుకుంటే మధుకి సిగ్గు కలిగింది.

''ఇంతవరకూ నేను ఈ విషయం ఆలోచించలేదు''

''తర్వాత మీ ఇంట్లో టి.వి. ఉందా?''

''లేదు... ఇంకా కొనలేదు''

''పోనీ రేడియో ఉందా?''

''ఉంది''

''ఆమెకేమైనా రేడియో వినటంలో ఆసక్తి ఉంటుందా?''

''పెద్దగా లేదు''

''మరి ఆమెకు వినోదం ఏమిటి? ఐమీన్ సినిమాలకు వెళ్తారా?''

''ఎప్పుడైనా''

''మీరిద్దరూ కలిసివెళ్తారా?''

''లేదు... నేను ఎప్పుడైనా వెళ్తుంటాను. ఆమె కూడా పక్కింటివారితో వెళ్తుంది. అయితే చాలా రేర్''

''మీ ఇంట్లో కూరలూ, అవీ బాగా వండుకుంటారా?''

''ఫర్వాలేదు... ఏమిటోయ్ ఇంత డీప్‌గా అడుగుతున్నావు .

నీ ఆలోచన ఏమిటో చెప్పు?''

''ఏం లేదు. మన కుటుంబ జీవితాన్ని అప్పుడప్పుడు సమీక్షించుకోవాలి. లేకపోతే నిస్సారంగా ఉండిపోతుంది. ఒకనాడు మీ జీవితంలో కొన్ని ఎడ్జస్ట్‌మెంట్స్ తప్పనిసరి. అప్పటి పరిస్థితుల్లో మీకు సినిమాలనో, కొత్త బట్టలనో, మరోటనో ఆలోచనలు రావు. వచ్చినా వాటిని లెక్కలోకి తీసుకోరు. ఇప్పటి పరిస్థితి కొంచెం భిన్నమైంది. మీరు ఇదివరకటి పరిస్థితుల నుండి బయటపడ్డారు. అంచేత మీ కోరికల్ని మీరు దాచుకోవలసిన అవసరం లేదు. కొద్దిపాటి మార్పుల్ని మీరు చేసుకోవాలి. అంతేకాదు. ఒకసారి ఆవిడ్తో సరిగ్గా మాట్లాడు. ఆమెకేం కోరికలున్నాయో తెలుసుకో. ఆమెకు పెద్దకోర్కెలు ఉండకపోవచ్చు. అవి తీర్చటానికి ప్రయత్నం చెయ్యి. రోజువారీ జీవితంలో కూడా మార్పులు తీసుకురా. ఇవన్నీ నేను మీకు చెప్పాల్సిన అవసరంలేదు. మీ ఆదాయాన్ని బట్టి జీవితాన్ని మల్చుకొనే నైపుణ్యం మీ చేతిలోవుంది. నేను అనుకునేది ఒకటే. మీ ఇంట్లో ఓ రకమైన స్తబ్దత ఉంది. రొటీన్‌నెస్ ఉంది. అందుకే ఇవన్నీ ముందు నీ శ్రీమతిని నీ ట్రాన్స్‌లోకి తెచ్చుకోవాలంటే నువ్వు నీ ఇంటి వాతావరణాన్ని మార్చాలి. ఇందులో నీకే ఎక్కువ బాధ్యత ఉంది''

"మరీ ముఖ్యంగా నీ శ్రీమతికి వినోదవరమైన ప్రపంచమేలేదు. ఒకనాడు అది సరిపోవచ్చు. ఇప్పుడు ఆమె ఒకసారి వెనక్కి తిరిగి చూసుకుంటే ఏం మిగులుతుంది? దాదాపు ఓ దశాబ్దంపైగా ఏం అనుభవించారు మీరు? అందుకే ముందాలోటు భర్తీ చెయ్యి మధూ. పైకి ఎన్ని కబుర్లయినా చెప్పవచ్చు. ఈ దేశంలో గాంధీలు ఒకరో అరో ఉంటారు. వారే దేశంకోసం అన్నీ త్యాగం చేయగలరు. మనం మానవులం. మనకు ఎన్నెన్నో ఆశలూ, కోర్కెలూ ఉంటాయి. అవి మన మనసు అట్టడుగు పొరల్లో ఉంటాయి. ప్రతిక్షణమూ మన మనసులో ఘర్షణను సృష్టిస్తాయి. వాటిని అణచి ఉంచినంతకాలం బయటపడటానికే ప్రయత్నం చేస్తుంటాయి. నీకు అర్థమైందనుకుంటాను" అన్నాడు.

"అర్థమైంది. అర్థంచేసుకుంటున్నాను. నిజమే. ఇన్ని సంవత్సరాలుగా మాకు సంఘర్షణ తప్పితే సంతోషం లేదు. నావరకూ అది అలవాటే. నా ఎనిమిది సంవత్సరాల వయసులో నాన్న మరణించాడు. అదే మా మంచిరోజులకు తెరపడినరోజు. కానీ జానకి విషయం వేరు. ఆమె ఇన్ని సంవత్సరాలు నన్ను అనుసరించింది. నాకోసం, మా పిల్లలకోసం తాను చేయగలిగినంత చేసింది. ఇది మాకు అలవాటుఅయింది. నిజం. మేం కొత్త జీవితం ప్రారంభిస్తాం."

దృఢంగా అన్నాడు మధు.

★ ★ ★

మధు తన మిత్రుడితో ఇటీవలకాలం అనుభవాలు వివరించాడు.

"గుడ్... ఓ క్రమంలోకి వచ్చారు. ఇప్పుడు మనం జాగ్రత్తగా ఆలోచించాల్సిన విషయం ఒకటుంది. ఇంతకుముందు నువ్వోమాట అన్నావు- గుర్తుండే ఉంటుంది. నిజంగా మేం తీవ్రమైన బాధల్లో, సంఘర్షణల్లో ఉన్నప్పుడు ఆమెకే భయాలూ లేవు. ఇప్పుడే కలుగుతున్నాయని... అవునా?"

"అవును... నాకు బాధ కలిగించేది అదే"

"నాకొకటి అనిపిస్తుందోయ్. అప్పట్లో ఆమెకు ఆలోచించే తీరిక లేదు. ఎందుకంటే మీ పెద్దవాడు పుట్టిందగ్గర్నుంచి ఆలోచించు. వాడికి పాలు, స్నానం, నిద్ర, ఇతర అవసరాలు చూసుకోవాలి. వాడు నిద్రపోగానే చకచక తన పనులు చూసుకోవాలి. కనీసం అలా మూడు సంవత్సరాలపాటు ప్రతిక్షణం తన దృష్టిని పిల్లవాడిమీద ఉంచాలి. కొద్దిగా తీరిక లభిస్తుందనుకున్నప్పుడు రెండోవాడు. నువ్వు చెప్పినదాని ప్రకారం పిల్లలు కేవలం మీదగ్గరే పెరిగారంటున్నావు కాబట్టి ఆమెకు తీరిక లేదు. ఆమె మానసిక ప్రపంచమంతా పిల్లలే నిండివుంటారు. ఏ కొద్ది తీరిక లభించినా ఎలా ఎడ్జస్ట్ కావడం అనే విషయంమీద ఆలోచించి ఉంటుంది. అందుకే ఆమెలో భయాలు నీకు కనిపించలేదు. అంతే ఆ రోజుల్లో ఆమెలో భయాలు లేవనికాదు... తప్పకుండా వున్నాయి. కానీ అవన్నీ డిప్రెస్ అయ్యాయి. భయాన్ని మించిన ఆచరణ అక్కడ అవసరమైంది. అంటే ఆమెకో ప్రపంచం ఉంది"

"మరి ఇప్పుడు ఆవిడకు ప్రపంచం అంటూ లేదా?"

"ఉంటుంది. భయమే ఇప్పుడామె ప్రపంచంగా వచ్చింది. వివరంగా చెప్పాలంటే ఈ నడుమకాలంలో అన్ని పరిస్థితులూ మారాయి. పిల్లలు పెద్దవారయ్యారు. ఇంక వారిపట్ల ఇదివరకటిలా ఆమె వెంటబడాల్సిన పనిలేదు. ఎవరి పనులువారు చేసుకుంటున్నారు. అలాగే ఇంటికి చెంది గతంలోలా సంక్షోభం లేదు- మీకు వచ్చే ఆదాయం మీకు సరిపోతుంది కాబట్టి. ఎలా అనే ఆలోచనల్తో కాలం గడపాల్సిన అవసరం లేదు. ఉదయాన్నే మీరు వెళ్ళాక... మధ్యాహ్నం... రాత్రి ఆమెకు విశ్రాంతి లభిస్తుంది. గతంలో ఆమె ఈ కాలమంతా శ్రమతోనే గడిపేది. ఇప్పుడు ఆమెకు తీరిక లభించడంతో అంటే ఆమెకు ఏవిధమైన మానసిక శ్రమ లేకపోవడంతో ఆమె మనసులో గూడుకట్టుకున్న భయాలు తలెత్తుతున్నాయి. అవి కొత్తకొత్త భయాల్ని ఆమె ముందుకు తెస్తున్నాయి. అందుకే ఆమెలో రెండు రకాల భావాల సంఘర్షణ జరుగుతూంది. తాము ధైర్యంగా జీవించిన రోజులు గుర్తొస్తాయి. అదే సమయంలో భయాల ప్రేరణ ఉంటుంది. ఖచ్చితంగా చెప్పాలంటే నీ శ్రీమతి ప్రవృత్తిరీత్యా తనకో







ప్రపంచాన్ని ఏర్పాటుచేసుకోలేదు. నీ మాటల ప్రకారం ఆవిడకి సినిమాల మీద ఇంట్రెస్ట్ లేదు. సాహిత్యంమీద లేదు. ఇతరుల్తో ఎక్కువ మాట్లాడాలనిపించదు. కేవలం వ్యక్తిగతమైన పరిధికి తననుతాను అంకితం చేసుకొంది.

కాగా ఆమె మానసిక ప్రపంచం ఓ రకంగా శూన్యంగా ఉంది. ఆ ఖాళీని ఆలోచనలూ భయాలూ పూడుస్తున్నాయి. కాగా ఇందుకు పరిష్కారం ఏమిటి? ఆమే కాదు. అనేకమంది భయాలకు ఇవే కారణాలు. వారి మానసిక ప్రపంచంలో ఎక్కడో ఖాళీలున్నాయి. వారికి వృత్తి మాత్రమే వుంది ప్రవృత్తి లేదు. ప్రవృత్తి రీత్యా కూడా వారు శ్రమైక జీవనానికి లోనయినప్పుడు మాత్రమే వారు భయాలకు దూరమౌతారు. భయం అంటే సోమరితనం. పనిచేయకపోవడం. అది శారీరకంగా కావచ్చు; మెదడుతో కావచ్చు. ఎవరికైనా పనిచేసే క్రమంలోనే భయాలు పోతాయి. అంటే నేను చెప్పదలుచుకుంది ఏమిటంటే మనం ఆలోచనల్తో కాలం గడుపుతున్నంతకాలం భయాల్ని పారద్రోలలేం. ఆచరణ మాత్రమే భయాన్ని తొలగిస్తుంది"

"అంటే కొత్త భయాలు ఇంక పుట్టవా?"

"ఎందుకు పుట్టవు... ప్రతిక్షణమూ పుడుతుంటాయి. కొత్త భయాలకు కొత్త ఆచరణే పరిష్కారం. కొత్త భయాలు వస్తున్నప్పుడు కంగారుపడటమో, కృంగిపోవడమో కాకుండా వాటిని అధిగమించడానికి ముందుకు రావడమే వాటినుండి విముక్తికి మార్గం"

"వా... ఎంత చక్కగా చెప్పావయ్యా. నిజమే- కాగా ఇప్పుడు చేయాల్సింది జానక్కి మరో ప్రపంచం ఏర్పడేటట్లు చూడటం... అదెలా?"

"అది ఆమె మాత్రమే చేయాలి. అందుకు తగ్గ వాతావరణం, ప్రేరణ నువ్వు కలిగించాలి. అర్థమైందికదా. మన థెరపీ పనిచేస్తుంది కదూ...!"

"పనిచేయటమేకాదు. ఇది నాలో ఉన్నరోగాలకూ మందు అందిస్తుంటేనూ" అన్నాడు మధు.

★ ★ ★

శ్రీధర్ సైకిల్స్టాండ్వేసి రావటం గమనించింది జానకి. ముఖంలో అలసట కనపడుతూంది.

"రా... రా... రెండురోజుల్లో తెస్తానన్నావు కదూ పుస్తకాలు" అంది నవ్వుతూ. లేటయిందద

క్కా.ఇంకోనెలలో ఎన్నికలొస్తున్నాయికదా... మా ఊర్లోనూ, చుట్టుపక్కలా మనవాళ్ళు పోటీచేస్తున్నారు. అందుకని ఆ పనులమీద తిరుగుతున్నాను. ఈ నెలరోజులూ అసలు తీరికఉండదు. అందులో నువ్వు చదువుతానన్నాక ఆలస్యం చేయటం బాగుండదు. అందుకే తీరిక చేసుకొని వచ్చేశాను" అన్నాడు.

ఇప్పుడు పూర్తిగా పాపు బాధ్యత తీసుకొంది. నేను ఉదయాన్నే విడిచిపెట్టడం, రాత్రికి తీసుకువెళ్లటం. ఎప్పుడన్నా ఖాళీదొరికితే వెళ్తున్నా.

"మొత్తంమీద నీభార్య మంచి ధైర్యవంతురాలయ్యా" శ్రీధర్ నవ్వాడు.

"నీ గురించే చెబుతుందక్కా. నువ్వంటే మొదట్లోనే ఓ మంచి అభిప్రాయం ఏర్పడింది. నిన్ను మా ఇంటికి తీసుకువెళ్లాలని ఆరాటం మరి ఎప్పుడొస్తున్నావు?"

"వస్తాం...కొద్దిగా వీలుచూసుకొని వస్తాం"

"బావ ఆఫీస్‌కు వెళ్లాడా?"

"అవును"

"సర్లే...నేను వస్తానక్కా"

"కొంచెం కాఫీ తాగి వెళ్దువుగాని" అంది జానకి.

"లేదక్కా పనుంది-ఏమనుకోకు" అని వెళ్ళిపోయాడు.

శ్రీధర్ అటువెళ్లాడో లేదో పెద్దగా కేకలు వినిపించాయి. ఈ ప్రాంతంలో అదేమంత విచిత్రమైన అంశంకాదు. ఎప్పుడూ పోట్లాటలు జరుగుతూనే ఉంటాయి. ఇంతకాలం తను వాటిగురించి పట్టించుకునేదికాదు. ఎవరిగొడవలు వారివి. వాళ్ళే తన్నుకుంటారు. తిరిగి కలిసిపోతారనుకునేది. వాస్తవం కూడా అంతే.

కానీ కొందరు ఆ తగాదాల్ని పెంచి పోషిస్తుండేవారు. ముఖ్యంగా ఈ విషయంలో జానకి చాలా ఖచ్చితంగాఉండేది. ఏ తగాదాకు చెందిన విషయమో, మరెవరిమీదైనా చాడీలు చెప్పే విషయమో ప్రస్తావనకు వస్తే ఖండితంగా చెప్పేది-

'దయచేసి అలాంటి విషయాలు నాకు చెప్పకండి. వాటిమీద నాకంత ఇంట్రెస్ట్ లేదు. ఇంకేదైనా విషయం గురించి మాట్లాడుకుందాం' అని.

కొంతమందికి జానకి అంటే అందుకే అసంతృప్తి. అయితే వారికో అభిమానం కూడా ఉండేది. తాము చెప్పేమాటలు విన్నా వినకపోయినా, తమతో మరి చనువుగా ఉండకపోయినా అవసరం వచ్చినప్పుడుమాత్రం ఆదుకునేది. తిరిగి ఆ చనువుతో ఏదైనా చెప్పబోతే...

"అలాంటి విషయాలు నాకొద్దబ్బా" అనేది.

కొంచెంసేపు చూసింది సర్దుకుంటుందేమోనని. ఏమాత్రం తగ్గేలాకనిపించలేదు. చేస్తున్న పని ఆపి బయటకు వచ్చింది. ఒకావిడ మహదానందంగా వింటూంది. కళ్ళు తన్మయత్వంతో మూసుకుపోతున్నాయి. ఇంకోవారంరోజులవరకూ ఆమెకు విందే. ఆ తగాదాను గురించి కథలుకథలుగా చెప్పుకుంటారు. తన్మయత్వంలోనే జానకినిచూసి ఉలిక్కిపడింది.

అదేక్షణం విసురుగా ఏదోవస్తువు బయటపడింది. సూట్‌కేస్ మూతఊడిచీరలు బైటపడ్డాయి.

"వెళ్ళు...నా ఇంట్లో ఉండేహక్కు నీకులేదు పో-ఇంట్లోకి వచ్చావా వళ్ళు రాలగొడతా" భీకరంగా కనిపిస్తున్నాడాయన.

వదినగారిలో తెగింపు కనపడుతోంది.

"ఎట్టారాలగొడతావో చూస్తాను" అందికోపంగా. ఆయన పరిగెత్తుకుంటూ వచ్చి జుట్టుపట్టుకున్నాడు. పక్కన నవ్వబోయి చెయ్యి అడ్డం పెట్టుకొంది చూస్తున్నావిడ. జానక్కి అసహ్యం కలిగింది. అంతలోనే తనకు తెలియకుండా ఆవేశం వచ్చింది.

"ఆగండి" అరిచింది.

ఆయన బిత్తరపోయి జుట్టు వదిలేశాడు.

"ఏంటన్నయ్యగారూ ఇదంతా? పెద్దవారు. చదువుకున్నారు... ఉద్యోగం చేస్తున్నారు- ఇదేం బాగుండలేదు" అంది.

"అది కాదమ్మా... ఇది" అంటూ చెప్పబోయాడు.

"మీకేమైనా సమస్యలుంటే ఇంట్లో మాట్లాడుకోండి. ఇంట్లో తగాదా ఆడుకోండి. ఇద్దరూ కొట్టుకోండి. అంతేగాని ఇంటినుండి వెళ్లమంటే ఆవిడ ఎక్కడికెళుతుంది చెప్పండి.




ఇంట్లోవుండే హక్కు మీ భార్యకు కాక ఎవరి కుంటుంది. మీరు సూట్‌కేసు విసరటం, జుట్టు పట్టుకు ఈడ్చటం... నలుగురూ చూస్తుండగా ఆవిణ్ణి అవమానించటం నాకేం నచ్చలేదు. వదినగారూ మీరు సూట్‌కేసు లోపలికి తీసుకెళ్లండి. అన్నయ్యగారూ మీరు బజారుకెళ్లి ఓ కాఫీ తాగిరండి. తర్వాత మాట్లాడుకోవచ్చు" అనేసి వచ్చింది.

వదినగారు బట్టలు సర్దుకుని లోపలకు వెళ్లింది. అయిదు నిమిషాల తర్వాత ఆయన బయటికి వెళ్లటాన్ని కిటికీనుండి చూసింది.

ఏమిటి తనేనా ఇలా మాట్లాడింది? తన కెందుకింత ఆవేశం వచ్చింది. ఇవన్నీ రోజు వారీ సంఘటనలేగా? అయినా ఆవిడ అలా నవ్వుతుందేమిటి? సాటి స్త్రీని కొడుతుంటే నవ్వు రావాలా? రేపు తనను తన భర్త అలా కొట్టవచ్చునే ఆలోచన రాలేదెందుకు? నిజంగానే ఆవిడది తప్పు అయివుండవచ్చు. అంతమాత్రానే సూట్‌కేసు విసిరిపామ్మంటే ఏమిటి? ఇన్ని సంవత్సరాలు తనకు వండిపెట్టి, సుఖాలందించి పిల్లల్ని కన్నందుకు ఫలితమా ఇది? ఆయన చేస్తున్న ఉద్యోగంనుండి అలానే తన్నితగలేస్తే ఊరుకుంటాడా? రిటైర్ అయితే వాళ్లకు పింఛన్ కావాలి. పి.ఎఫ్. కావాలి. ఇంకా ఏమేమో కావాలి. అందుకోసం అరుస్తారు. రోడ్డుమీదకొస్తారు. కానీ ఇంటిదగ్గర పెళ్లానికి మాత్రం ఏం హక్కులు లేవు. ఏం మొగవాళ్లో" అనుకుంది.

ఆలోచనల్లో ఉండగానే బయటినుండి నీరసంగా పిలుపు వినబడింది. బయటకు వెళ్లింది. వదినగారు నిలబడివుంది.

"కొంచెం గుండెనొప్పిగా అనిపిస్తుందమ్మా... హాస్పటల్‌కు వెళ్దాం వస్తావా?" అంది తలవంచుకుంటూ.

"వదినగారూ... మీరెలా అనుకున్నా ఓమాట చెబుతాను. మీరు అనవసరంగా ఆలోచించి గుండెనొప్పులు పెంచుకోకండి. ఆయన్తో గట్టిగా పోట్లాడండి. ఫర్వాలేదు. పోట్లాడక నొప్పి వచ్చిందంటూ పడిపోతే ఆయనకు అలుసండీ. అయినా మీకేం గుండెనొప్పి లేదని డాక్టర్లు చెబుతున్నారు. మీరేం వర్రీ కాకండి. కొంచెంసేపు ప్రశాంతంగా ఉండండి. అయినా మీరెందుకు అంత బాధపడుతున్నారు. మీ అబ్బాయున్నాడు. అతను చూడడా! అతను చూడకపోతే మీ అమ్మాయిలున్నారు. వాళ్లు చూస్తారు. ఈ విషయం గురించి పదేపదే ఆందోళన చెందకండి. అసలు మీకంటే ఆయన ఆందోళన చెందాలి. అనవసరంగా మీరు ఆలోచించి ఆరోగ్యం చెడగొట్టుకుంటున్నారు" అంది జానకి. ఆమె ఆశ్చర్యంగా చూస్తోంది.

"మీరు కూర్చోండి- కొంచెం కాఫీ తాగి వెళ్దురుగాని" అంటూ వెళ్లి కాఫీ తయారుచేసి ఇచ్చింది. ఆమెకు కొంచెం గుండెదడ తగ్గింది.

"నువ్వు అనబట్టి ఆగిపోయారమ్మాయి. ఏరోజూ మాట్లాడనిదానివి నిన్ను చూసి ఆయనకు నోటివెంట మాట రాలేదనుకో. అసలు నువ్విటువచ్చావ్ మాట్లాడితే ఒట్టు. వచ్చి బట్టలు వేసుకుని వెళ్లిపోయాడు" అంది వదినగారు.

"ఏ విషయమైనా మీవరకు పరిమితమైతే బాధలేదండి. మీ ఇంట్లో మీరు తగవులాడుకుంటే నేను వచ్చి కల్పించుకోవటం బాగుండదు. కానీ ఆయన మిమ్మల్ని రోడ్డుమీదకీడ్చటం ఏమిటి? మీ విషయం బజారుమీదకొచ్చింది. అప్పుడు ఎవరో ఒకరు కల్పించుకుంటారు. అయినా నేను మాట్లాడేదాన్ని కాదేమో... ఈరోజు ఎందుకో నాకు తెలియకుండానే నేనలా అరిచాను- ఆయన ఏమనుకున్నారో" అంది జానకి.

"ఇందులో అనుకుంటానికి ఏముంది జానకీ... బాగా గడ్డిపెట్టావు. ఈసారి అరిచేటప్పుడు గుర్తొస్తుంది" అంది వదినగారు.

"మీరు కూడా ఆయన్తో పదేపదే చర్చలకు దిగకండి. ఆయన పోట్లాటకోసం కూర్చున్నాడు. అసలు మీరేం లెక్కచేయనట్లు ఉండండి- ఆయనే దారికొస్తారు" అంది జానకి.

వదినగారు వెళ్లిపోయింది.

మరలా ఆపూట తన దగ్గరకు రాలేదు!

జానక్కి ఆశ్చర్యం కలిగింది.

వదినగార్కి ఈరోజు గుండె నొప్పి రాలేదు.



ఏదో కొత్త సత్యం తెలుస్తున్నట్లుగా అని పించింది.

"ఇప్పుడు ఆయన వస్తే ఎంత బాగుండు ను?" అని ఎదురుచూసింది. మధు ఎందుకనో ఆలస్యంగా వచ్చాడు. అప్పటికి తొమ్మిది గంట లవుతూంది.

ఎందుకు రాలేదా అనే ఆలోచన జానక్కిరా లేదు. త్వరగా వస్తే బాగుండునే అనిమాత్రం అనిపించింది.

స్నానంచేసి భోజనానికి కూర్చున్నప్పుడు మెల్లగా ఉదయం జరిగిన సంఘటన చె ప్పటం ఆరంభించింది. తింటూ విన్నాడు. అంతా అయ్యాక అన్నాడు మధు....

"అసలు నీకెందుకమ్మా? మా మొగుడూపె ళ్ళాల నడుమ మాట్లాడటానికి నువ్వెవరివి? నీ సంగతి నువ్వు చూసుకో అన్నాడనుకో... ఏం చేసేదానివి?"

జానక్కి ఏంచేసి ఉండాలో వెంటనే తట్టలే దు. కొంచెంసేవయ్యాక అంది-

"ఆయనలా అనిఉంటే ఏంచెప్పేదాన్నో ఇప్పుడు చెప్పలేను. అయితే మాత్రం అప్పు డు నాకు కోపం వచ్చింది. ఆయనలా అని ఉంటే ఇంకా బాగా కోపం వచ్చి ఉండేది. అప్పుడు వదినగారితో వెళ్ళి పోలీస్ రిపోర్ట్ ఇచ్చేదాన్నేమో?"

ఈసారి నోరు తెరిచాడు మధు.

★ ★ ★

"మానాన్నకు ఉత్తరం రాశాను. తిరుపతి వెళ్తున్నామని" అంది జానకి.

తిరుమల ఎక్స్‌ప్రెస్‌లో వారు ప్రయాణం చేస్తున్నారు. పిల్లలిద్దరూ బెర్త్‌మీద నిద్రపోతు న్నారు.

"ఆయనకు చాలా సంతోషం కలిగి ఉంటుంది"

"అవును... మీ పెళ్ళి అక్కడే చేయిస్తానని మొక్కుకున్నారటకదా. ఇదివరకోసారి మీరు తిరుపతి వెళ్తే బాగుంటుందమ్మాయ్ అన్నారు. మీకు నేను చెప్పలేదనుకోండి" అంది జానకి.

"అంటే మనం ఇన్ని కష్టాలువడటానికి తిరుపతి వెళ్ళకపోవటం కారణమా?"

"సరే... ఎవరి అభిప్రాయాలు వారివి. మి మ్మల్ని రమ్మని నేను బలవంతం చేయలేదు కదా?"

"అదికాదోయ్ ఆయన అభిప్రాయం అదా అని అడిగాను"

"అది సరేలెండి... ఇంతవరకూ నేను తిరు పతి రాలేదు. నిజంగా నాకు ఈరోజు చాలా సంతోషంగా ఉందండి. ఈరోజేకాదు ఈమధ్య ఎందుకో సంతోషంగానే ఉంటూంది. ఇదివరకు మరీ బోర్‌కొట్టేది. ఒక్కోసారి అసలు జీవితమంటే వండుకు తినటమేనా అని పించేది"

"మరి పల్లెల్లో చాలామంది బతుకుతున్నా రు కదా...వారందరూ ఎలా బతుకుతున్నారు? వారికి మాత్రం ఏంకొత్తదనం ఉంది?"

"నిజమే అనుకోండి... వారలా అలవాటు పడిపోయారు. అయినా కూడా ఇదంతా మారా లండి. జీవితంలో ఏఆనందమూ, ఏదీ లేక పోతే ఏం బాగుంటుంది?"

"ఏదీ అంటే" అన్నాడు మధు.

జానకి వెంటనే చెప్పలేకపోయింది.

"ఏదంటే ఎలా చెప్పాలో నాకు తెలియ టంలేదు. మొన్నటిదాకా నాకో కోరిక ఉండేది. ఏనాటికయినా నిలకడ అయిన సంసారం ఏర్పాటుచేసుకోవాలని. అలాగే మిమ్మల్ని చూసి నవ్వినవారందరికీ జవాబు చెప్పాలని. ఆతర్వాత మన పిల్లల్ని బాగా చదివించాలని, బుద్ధిమంతుల్ని చెయ్యాలని"

"అలాంటివి అందరికీ ఉండవని ఎందుక నుకుంటున్నావు?"

"ఉండవని కాదండి... ఉంటే బాగుంటుందని"

"అంటే నువ్వు గమ్యం గురించి చెబుతు న్నావు. మనిషికి గమ్యం తప్పకుండా అవ సరం. అయితే చాలామంది ఆడవారికి, మొగ వారికి కూడా కుటుంబాన్ని నిర్వహించుకోవ టమే గమ్యంగా ఉంటుంది. అయితే ఆ కర్తవ్యం పూర్తయితే మరో రంగంమీద గమ్యం ఏర్పాటుచేసుకోవచ్చుగదా"

జానకి మాట్లాడలేదు.

అది తనను ఉద్దేశించి అంటున్నదే అని





స్పష్టంగా తెలుస్తోంది. ఇప్పుడు తనేం గమ్యా న్ని ఎన్నుకోవాలి? అందులో తను ఏరకంగా ఉండాలి? ఏ పాత్ర నిర్వహించాలి? అసలు తన గమ్యం ఏమిటి?

మధు చెప్పాడు-

"అది కాదురా మొన్న పక్క వదినగారి విషయంలో నువ్వు ముందుకు వెళ్ళావు. ఆ ప్రభావం ఎంతో పనిచేసింది. ఆ సమయంలో నీకేమనిపించింది. చాలా తృప్తి కలిగింది. అంటే నీకు తెలియకుండానే ఓ సామాజిక అన్యాయం మీద పోరాటం జరిపావన్నమాట. దాని తాలూకు ఫలితం నిన్నెంతో ఆనందానికి గురిచేసిందన్నమాట.

అందుకే పదిమందికి ఉపయోగపడటం అనే దాన్ని గమ్యంగా పెట్టుకున్నామనుకో... ఎలా ఉంటుంది?"

"అంటే ఏ మొగుడూ – పెళ్ళాం అరుచు కున్నా నేను వెళ్ళి అరిచి రావాలా?"

"ఛ...ఛ... అలాకాదు. మీ అందరికీ కొన్ని సమస్యలుంటాయి కదా మీ అందరూ కలిసి వాటిని తీర్చుకునే ప్రయత్నం. అలాగే మీరంద రూ ఉన్నారు. మధ్యాహ్నం కూర్చొని చెప్పుకునే కబుర్లు ఏమిటి? వాళ్ళమీద వీళ్ళు, వీళ్ళమీద వాళ్ళు చెప్పుకోవచ్చు. వీటివలన ఎవరికైనా ఏం ప్రయోజనం? అందుకే మీ పద్ధతుల్లో కూడా మీరు మార్పులు చేసుకోవాలి. మీ అంద రూ కలిసి చదువుకోవచ్చు. మీరు చదివిన పుస్తకాల మీద చర్చలు చేసుకోవచ్చు. అలాగే మీ అందరూ కలిసి కొత్త కొత్తవి నేర్చుకోవచ్చు. ఇలాంటివి. వాటివల్ల ఏమౌతుంది? ఉదాహర ణకు కొంతమంది ఆడవాళ్ళుంటారు. వారికి మొగుడు వదిలేస్తాడనే. పిల్లలు చూడరేమో అనే భయాలు ఉంటాయి. తమకంటూ ఏదో ఒక విద్యవస్తే అలాంటివారందరికీ తమ మీద తమకు నమ్మకం ఏర్పడుతుంది ఏమంటావ్?"

"అవుననుకోండి"

"అవుననుకోవటం కాదురా. ఇవన్నీ వాస్తవా లు. అందుకే మీరు ఓ పని చేయండి. ఏదో ఒకటి నేర్చుకునే ప్రయత్నం చేయండి. ప్రభు త్వం వారి దగ్గర వాటి కోసం కొన్ని నిధు లుంటాయి. ఆవెక్కువగా దుర్వినియోగం అవుతుంటాయి. అలాంటివన్నీ ఎలా సక్ర మంగా వంపిణీ చేయవచ్చో మీకే అర్థమౌ తుంది"

"ఏమో బాబూ ఈ తలకాయ నొప్పులన్నీ ఎవరు పడతారు?"

"తలకాయ నొప్పంటే ఎలానోయ్. నువ్వు పదిరూపాయలు సంపాదించి చూడు. ఎంత తృప్తి కలుగుతుందో. ఇది నేను స్వయంగా సంపాదించిన డబ్బు అనుకున్నప్పుడు కలిగే ఆనందం చాలా భిన్నంగా ఉంటుంది"

"సర్లెండి... మనం అలాంటి ప్రయత్నం చేద్దాం. నాకు నిద్రవస్తూంది. కొంచెం సేపు పడుకుంటాను" అంది జానకి.

"పడుకో"

జానకి నిద్రలోకి జారిపోయింది.

మధుపెదవుల మీద చిరునవ్వు వెలిసింది.

'మొత్తం మీద తన ప్రయత్నం ఫలిస్తూంది. జానకిలో కదలిక ఓ క్రమంలో ప్రారంభమైంది. ఇప్పటికే ఎన్నో ఊగిసలాటలు, అనుమానాలు, భయాలు ఉండొచ్చు. అయితే ఇదివరకటి 'యాంగ్జయిటీ' లేదు. పైగా ఉన్నదానిని ఉన్న ట్లుగా చూడటానికి అలవాటు పడుతోంది. అది తనకు ఎంతో ఉత్తేజకరమైన అంశం. అంతేకా దు. తనకెన్నో కొత్త విషయాలు తెలుస్తు న్నాయి. ఈ సమాజానికి చెందిందే భయం... భీతి... ఆందోళన... వీటికి కారణాలు తెలుసుకో గలగటమే సామాజిక డాక్టర్ల గొప్పతనం.

ఆ తర్వాత చికిత్స చేయాల్సిందెవరు?

అందరూ.

రచయితలు... కళాకారులు... భర్త... భార్య... అందరూ!

అప్పుడే ఈ వ్యాధుల నుండి బయటపడగ లిగేది.

కళ్ళు మూతలు పడుతున్నాయి.

ఈ నడుమ తనకంటే ముందుగా జానక్కే నిద్రపడుతోంది. ఇదో చిత్రమైన అనుభవం. అవును మరి. ఇంతకుముందెన్నడూ లేనివి ధంగా తను జానకి గురించి ఆలోచిస్తున్నాడు.

అంటేబాధ్యతలుకూడా ఆలోచనల్ని భయా ల్ని కలిగిస్తుంటాయన్నమాట...

బిగ్గరగా నవ్వాలనిపించింది.



"భయమా... నువ్వెంత గడుసుదానివే. నువ్వెప్పుడూ మానవుడి వెంటనే ఉంటావ్.... నీ ట్రాప్‌లో వద్దామా ప్రమాదమే" అనుకున్నాడు నిద్రలోకి జారిపోతూ.

★ ★ ★

లక్ష్మి షాపులో కూర్చుని ఉంది.

అంతకుముందు శ్రీధర్ ఇచ్చిన పుస్తకం చదువుతూ కూర్చుంది. ఎవరో వచ్చిన అలికిడి అయితే తలెత్తింది. అతని మొఖం క్రూరంగా కనిపిస్తోంది. మొఖంలో మొదట భయంకరమైన మీసాలు కనిపిస్తున్నాయి. తాగి వచ్చాడేమో కళ్ళు ఎర్రగా ఉన్నాయి.

"ఏమే శ్రీధర్ అంటెవడే" అన్నాడు.

లక్ష్మికి కోపం వచ్చింది. భయంతోపాటు "జాగ్రత్తగా మాట్లాడు" అంది "ఏంటే నీతో మాట్లాడేది" అన్నాడు.

శ్రీధర్ అంతకుముందే పక్కషాపుల దగ్గరకెళ్ళాడు.

జనమంతా అప్పటికే అక్కడకు చేరారు. ఎవరూ మాట్లాడటంలేదు.

"వాడేడే- చంపేస్తాం కొడుకుని" అరచి ముందుకొచ్చాడు.

లక్ష్మిచెయ్యివట్టుకొని 'బయటకురావే' అంటూ ఈడ్చాడు.

ఒక్క ఉదుటున వెళ్ళి రోడ్డుమీదపడింది.

అతను వెనక్కి తిరిగాడు.

అప్పుడే శ్రీధర్ కంగారుగా వస్తున్నాడు.

"ఏరా నాకొడకా... మామీదే పోటీ చేయించేటంత మొనగాడివయ్యావా?" అంటూ పొట్టలో ఓ గుద్దుగుద్దాడు.

"అమ్మా" అని అరిచాడు శ్రీధర్.

"నిన్ను నడిబజార్లో చంపుతాం- దిక్కెవడో చూస్తాం" అని మరో గుద్దుగుద్దాడు.

కొంతమంది భయంతో అక్కడినుండి పారిపోయారు.

మరికొందరు దూరం నుండి చూస్తున్నారు.

ఎవరూ ముందుకురావటంలేదు.

శ్రీధర్ దుమ్ములోపడిపోయాడు. అంతకు ముందు వేళ్ళుపోయిన చేతికి రాయి తగలటంతో గిలగిలలాడిపోయాడు.

లక్ష్మి ఒక్క ఉదుటున లేచి అతన్ని పట్టుకొంది.

"ఓసినీయమ్మ" అంటూ ఒక్క విసురు విసిరాడు.

తిరిగి అల్లంతదూరంలో పడింది లక్ష్మి.

కళ్ళవెంటనీళ్ళు... దుఃఖం ఉప్పెనలా విరుచుకుపడగా చీర అడ్డంపడింది. వెంట్రుకలు మొఖం నిండా చిందరవందరగా పడ్డాయి. పరిగెత్తుకువచ్చి అతను జుట్టుపట్టుకులేపాడు.

"నీ మొగుడిమీద నుండి బండిపోనిస్తానే" అంటూ తిడుతూ అటుగా వచ్చే లారీని ఆపి-

"ముందు వీడిమీద నుండి పోనివ్వు" అని అరిచాడు.

లక్ష్మి ఒక్కసారిగా విదిలించింది.

అతను తొట్రుపడి అంతదూరంలో పడ్డాడు.

అప్పటికి శ్రీధర్ లేచాడు.

"లక్ష్మి నువ్వెళ్ళు" అన్నాడు చేతులు అడ్డంపెడుతూ.

కింద నుండి లేచిన అతని చేతిలో కత్తి తళతళమెరిసింది.

తిరిగి జనంలో ఏదో కదలిక. అక్కడేదో జరగబోతూంది. అయినా ఎవరూ ముందుకు రావటంలేదు.

శ్రీధర్‌లో ఓ తెగింపు వచ్చింది.

తను మరణించటం ఎటూ ఖాయం అని తేలిపోయింది.

కనీసం లక్ష్మిని రక్షించాలి.

"వెళ్ళమంటే వెళ్ళవే" అంటూ లక్ష్మిని విసురుగా నెట్టాడు.

ఆమె దూరంగా పడిపోయింది.

మరలా వేగంగా లేచిరాబోయింది.

అదేక్షణం అతను శ్రీధర్ గుండెల్లో పొడిచాడు.

శ్రీధర్ అప్రయత్నంగా చేతులు అడ్డంపెట్టాడు.

వేళ్ళను కోస్తూ వెళ్ళింది.

అంతలోనే ఎవరో అరిచారు.

"పోలీసులు పోలీసులు" అంటూ





అయినా చివరి ప్రయత్నంగా డొక్కల్లో ఓ పోటుపొడిచాడు.

"అమ్మో" అంటూ ఆర్తనాదం చేశాడు శ్రీధర్.

రక్తంకారటం చూసిన లక్ష్మి వెర్రికేకవేసి పడిపోయింది.

అతను వెనక్కి తిరిగి పరిగెత్తాడు.

శ్రీధర్ కిందపడి గిలగిలలాడుతున్నాడు.

అక్కడ పరిస్థితి భీకరంగా ఉంది.

కొద్దిసేపటికి ఎవరో పరిగెత్తుకొచ్చారు.

క్షణాల్లో ఆసుపత్రికి చేర్చారు. పోలీసులు జీపులో వచ్చేశారు.

వెంటనే వార్త ఊరంతా పాకిపోయింది.

హాస్పటల్‌చుట్టూ జనం గుంపులుగుంపులుగా చేరారు. లోపల ఏం జరుగుతోందో ఎవరికీ అర్థంకావటంలేదు.

"నమ్మకం లేదంట" అన్నారెవరో.

"లేదు- డేంజర్‌కాదట"

"బాగా రక్తం పోయిందంటున్నారే"

"ఇంకానయం ఎవరో పోలీస్ అని అరిచారు. లేకపోతే ఇద్దరినీ పొడిచేవాడే"

"పాపం ఆ కుర్రాడు చాలా మంచివాడు. ఈ నడుమే పెళ్ళయిందట"

బయట ఓ బల్లమీద లక్ష్మి పడుకొని ఉంది. ఆమె పక్కన ఎవరో స్త్రీ కూర్చుని ఉంది.

శ్రీధర్ పార్టీ నాయకులు వస్తున్నారు.

లోపల పోలీసులు శ్రీధర్ స్టేట్‌మెంట్ రికార్డ్ చేసుకుంటున్నారు.

"జానకీ... మనం ఓసారి హాస్పిటల్‌కు వెళ్ళాలి" అంటూ వచ్చాడు మధు. "ఏమయిందండీ?" అంది జానకి.

"చెబుతా"

"శ్రీధర్‌ను ఎవరో పొడిచారట" దారిలో చెప్పాడు.

"పొడవటమా... ఎందుకు?"

"వాళ్ళకి ఎన్నికల్లో ఓడిపోతామని భయం పట్టుకొంది. అందుకే ఈ పనిచేశారు"

"ఏమిటి? ఏమైనా జరిగిందా?"

"కొద్దిపాటి గాయాలంటున్నారు. ప్రమాదం లేనట్లే అనుకుంటాను. పిరికి పందలు. ఇలాంటివాటితో ఏదీ ఆగదు"

"లక్ష్మి ఎక్కడ ఉంది?"

"అక్కడేఉంది. ముందు ఆ అమ్మాయిని బయటకీడ్చాడంట. అంతమందిముందు ఇద్దర్నీ హింసిస్తుంటే ఒక్కరూ ముందుకురాలేదట"

"ఒక్కరూ రాలేదా? అంతమంది మొగాళ్ళుండి"

"భయం జానకీ భయం. ఈ ప్రపంచంలో అన్యాయాలు, అక్రమాలు అన్ని సమస్యలకు కారణం భయమే. ఆ జనంలో ఏ నలుగురు ముందుకొచ్చినా ఈ దారుణం జరగదు. ఈ దాడి వెనకాల కూడా భయముంది. ఈ భయం ఇలా ఉన్నంతకాలం ఈ సమాజం ఇలానే ఉంటుంది"

జానకి మాట్లాడలేదు.

ఆమెకు మాత్రం ఇది చాలా అన్యాయంగా కన్పిస్తోంది.

ఓ స్త్రీని నడిబజార్లో అవమానిస్తుంటే ఎవరూ మాట్లాడకపోవటం, భయం పేరుతో నిలిచిపోవటం ఏమాత్రం నచ్చటంలేదు. ఒక్కసారిగా ఆవేశం, దుఃఖం వచ్చాయి.

రిక్షా హాస్పిటల్ ముందాగింది.

జానకి మధువెంట నడిచింది.

"నువ్వు లక్ష్మి దగ్గరుండు" అని పంపించాడు.

తను వెళ్ళేసరికి లక్ష్మిపిచ్చిచూపులు చూస్తోంది.

ఘటన ఇంకా మనసులో మెదులుతుందేమో.

తనను చూడగానే ఒక్క ఉదుటునలేచి 'వదినా' అంటూ చుట్టేసుకొంది.

ఇంతవరకూ శ్రీధర్ అమ్మగానీ, లక్ష్మివాళ్ళ తరపునగానీ ఎవరూరాలేదు. వారికింకా ఈ విషయం తెలియదు.

జానకి లక్ష్మిని భుజం తడుతూ అనునయించింది.

లక్ష్మిని అలా ఏడుస్తుండనిచ్చింది.



జానక్కి దుఃఖం పొంగిరావటంలేదు.

ఏదో ఆవేశం... ఎవరి మీదో కసి...

పది నిముషాల తర్వాత వచ్చాడు మధు.

"ఇప్పుడు శ్రీధర్‌ను చూడొచ్చు. వెళ్దాంరా"

అప్పుడే లక్ష్మి అమ్మవాళ్ళు ఏడుస్తూ వచ్చారు. తిరిగి లక్ష్మికి ఒక్కసారిగా దుఃఖం విరుచుకుపడింది.

బెడ్‌మీద పడుకొని ఉన్నాడు శ్రీధర్. చేతికి కట్టుకట్టారు. పొట్టదగ్గర బాండేజ్‌వేశారు. ఎవరెవరో ఏదో అడుగుతున్నారు. మెల్లగా చెబుతున్నాడు.

శ్రీధర్‌నుచూసి జానకి కళ్ల నీరుపెట్టుకొంది.

శ్రీధర్ జానకికేసి చూశాడు.

అప్పుడు తనకి దుఃఖం ఎగతన్నుకొచ్చింది. ఇంకేం మాట్లాడలేకపోయాడు. క్రమంగా గొంతుపూడుకుపోయింది. తర్వాత గొంతు నుండి రోదన వెలువడింది. వెక్కి వెక్కి ఏడ్చాడు.

"ఊర్కో... ఊర్కో... భయపడకు" అన్నారెవరో- చివాల్న అటు తిరిగాడు శ్రీధర్.

"భయంతోకాదు సార్ నేనేడుస్తున్నది' అన్నాడు.

ఎందుకో అక్కడున్నవారి శరీరాలు గగుర్పొడిచాయి.

శ్రీధర్ ఆ తర్వాత మాట్లాడలేదు.

"అతనికి కొంచెం గాలి తగలనివ్వండి" అంటూ ఒక్కొక్కర్ని పంపించారు.

జానకి కళ్ళతో చెప్పింది 'వెళ్ళొస్తా'మంటూ.

శ్రీధర్ నిశ్శబ్దంగా తలూపాడు.

వారిద్దరూ మౌనంగా బయటకు వచ్చారు.

"వస్తానమ్మా లక్ష్మి. రేపువస్తాం" అంది జానకి.

లక్ష్మి కళ్ళు తుడుచుకుంటూ తలూపింది.

ఇంటికొచ్చేంతవరకూ ఏంమాట్లాడలేదు జానకి.

★ ★ ★

ఇప్పుడిప్పుడే మారుతున్న జానకితో తిరిగి ఈ సంఘటన పాతభయాల్ని ముందుకు తెస్తుందా అనే అనుమానం వచ్చింది మధుకి. అలా అయితే తిరిగి మొదటినుండి ఆరంభించాలి. ఈసారి అసలు ప్రారంభం అంటూ ఉంటుందా? తనుకూడా పెదనాన్నలా అవుతుందా? అయితే తన పరిస్థితి ఏమిటి? తనూ, పిల్లలు జానకి లేకుండా ఎలా బతుకుతారు? తను జానకిని వదిలి కొంతకాలం బయట ఉండివస్తాడు. కానీ జానకి లేకుండా మాత్రం ఒక్కరోజు ఉండలేదు. అందుకే ఎక్కడికయినా వెళ్తానంటే ఎప్పుడొస్తావంటూ నాలుగుసార్లయినా అడుగుతాడు. ఒక్కోసారి జానక్కి కోపం వస్తుంటుంది.

"మీరెన్ని రోజులయినా తిరిగిరావచ్చు" అంటుంది. అలాంటిది తను లేకపోతే ఏమైనా ఉందా?

నో... జానకిని రక్షించుకోవాలి. ఎలా అయినా రక్షించుకుతీరాలి. పనంతా అయ్యాక జానకివచ్చి కూర్చుంది.

ముందు తనే మాట్లాడింది.

"ఆ అమ్మాయిని చూస్తే కడుపు తరుక్కుపోయింది. తన కళ్లముందే భర్తను చంపబోవటం చూస్తే ఏ స్త్రీ అయినా ఏం తట్టుకొంటుంది. అప్పటికే రెండుసార్లు అతనిమీదకు వెళ్ళిందంట. జుట్టుపట్టుకొని ఈడ్చాడంట.

...రాక్షసులు అంతకంటే ఏంచేస్తారు?"

"బహుశా వాళ్ళు ఇలాంటివాటిని ఊహించి ఉండరు"

మధు మాట్లాడలేదు.

"ఏదియేమైనా ఆ అమ్మాయి తేరుకుంటుందనుకోను. బాగా కంగారుపడింది. ఇంక అమ్మాయి ఆ షాపులో కూర్చోలేదు. నా అనుమానం ఆ అమ్మాయి బయటకు రావటానికి అంగీకరించదు. శ్రీధర్ బలవంతం చేసినా వాళ్ళ అమ్మవాళ్ళు మాత్రం అంగీకరించరు"

మధు అప్పటికీ మాట్లాడలేదు.

"పాపం చూడండి. ఇంకా ఆ పెళ్ళిరోజులు పాతబడిపోలేదు.

అప్పుడే ఇంత ఘోరం జరిగిపోయింది. ఇలాంటిది ఆ పొడిచినవాడి భార్యకూ జరగకూడదు"




మధు తలూపి మెల్లగా అన్నాడు-

"నువ్వు ఈ విషయం గురించి ఎక్కువగా ఆలోచించి మనసు పాడుచేసుకోకు-"

"శ్రీధర్ దురదృష్టవంతుడండి. మెల్లగా బాకీలు తీరుస్తాడనుకున్నాం. ఇప్పుడు చూడండి. ఆ షాపు ఎన్నిరోజులు కట్టేయాలో? కట్టేసినా అద్దెలు చెల్లించాలిగా...

ఎవరినైనా కూర్చోబెట్టేకంటే మూసెయ్యటమే మంచిది.

ఇప్పట్లో అతను తేరుకోడు."

ఆ తర్వాత ఎవరూ మాట్లాడలేదు.

ఉదయం పేపర్లో వార్త వచ్చింది. శ్రీధర్ ఫొటో వేశారు.

"ఓటమి భయమే ఈ హత్యాయత్నం"

మధు హాస్పిటల్‌కు వెళ్ళేటప్పటికి శ్రీధర్ ఉత్సాహంగానే కనిపించాడు.

"సాయంకాలం ఇంటికి వెళ్తున్నాం బావా. ఫర్వాలేదని చెప్పారు"

"సర్లే... నేనూ, జానకి మీఇంటికొస్తాం"

★ ★ ★

ఉదయం ఆఫీసుకు వెళ్ళగానే ఫోన్...

పెదనాన్న చనిపోయారు. వెంటనే రాగలవు!

ఆయన మరణం ఊహిస్తున్నదే. ఈ నడుమ ఆయన ఆరోగ్యం బాగా దెబ్బతింది. అయినా దుఃఖం వెల్లువలా వస్తోంది...!

ఇదేమిటి? ఈ సంఘటనలు ఇలా వెల్లువలా వస్తున్నాయి?

ఇవన్నీ జానకిని భయంలోకి నెట్టడం కాదు. తనను నెట్టేలా ఉన్నాయి. అన్నీ ఇప్పుడే జరగాలా? మరికొన్నాళ్ళు ఆగితే ఆమెలో మరి కొంచెం మార్పు వచ్చి ఉండేది. అప్పుడు ఇలాంటి వార్తలు చెప్పినా మామూలుగానే స్వీకరించగలిగేది.

కానీ ఇదంతా ఏమిటి?

తనకు పరిస్థితులు ఎదురుతిరుగుతున్నాయి.

అవును మరి... అన్నీ తనకు ఎలా అనుకూలంగా ఉంటాయి?

తను జానకి గురించి ఆలోచిస్తూ 'బ్యాలన్స్'

కోల్పోతున్నాడు.

నిజం... ఇవన్నీ వస్తేరానీ... వీటన్నింటికి వ్యతిరేకంగా ఈ రోజు కాకుంటే రేపు జానకి ముందుకొస్తుంది. ముందు తను నిబ్బరంగా ఉండాలి. శ్రీధర్ దగ్గరకు వచ్చాక వెళ్ళవచ్చు ననుకొని లీవ్ పెట్టి వచ్చేసాడు.

"ఏమిటి... అప్పుడే వచ్చేసారు. తలనొప్పిగా ఉందా?"

"లేదురా. మనకు ప్రయాణం పడింది. పెదనాన్న చనిపోయారంట" మామూలుగా చెప్పటానికి ప్రయత్నం చేశాడు.

"ఎప్పుడు?" అంది జానకి.

ఆమెకేసి చూడాలంటే భయం వేసింది.

"ఇప్పుడే- ఫోన్ చేశారు. వెంటనే వెళ్తే చివరిచూపు అందుతుంది"

జానకి వెంటనే సర్దటం ఆరంభించింది.

దారిలో చెప్పటం ఆరంభించాడు-

"ఇది మనం ఊహిస్తున్నదే. చివర్లో మరీ ఇబ్బందివడ్డాడు.

ఓ రకంగా ఆయనకు మరణమే సుఖాన్ని ఇచ్చిందేమో. ఆయన అనవసరంగా భయపడ్డారుగానీ పిల్లలందరూ సెటిలయ్యారు-"

జానకికి ఆయన తనమీద చూపిన ప్రేమ గుర్తొచ్చింది.

"మృత్యువు సహజం జానకీ... మన ఇంట్లోనే నా చిన్నప్పుడు... నువ్వు నీ చిన్ననాటినుండి మృత్యువుని చూస్తూనే ఉన్నాం. ఏదీ ఆగదు. కొంతకాలంపాటు బాధ ఉంటుంది. మరపు మనిషికి వరం. మనం ఎవరున్నా లేకపోయినా జీవిస్తుంటాం... జీవించాలి. అయితే మంచివారు చేయాల్సింది ఒకటే. మరణంతోనే అన్నీ అయిపోవు. ఆయా వ్యక్తుల కృషి ఉంటుంది, ఆశలుంటాయి, ఆశయాలుంటాయి. వారు ఈ ప్రపంచంలో వదిలి వెళ్ళేదేదో ఉంటుంది. దాన్ని మనం పూర్తిచేయగలగాలి. అంతేకాదు వ్యక్తుల్ని తలచుకొని కృంగిపోకూడదు. ఈ ప్రపంచంలో ఎవరూ శాశ్వతంకాదు. చిన్నతనం నుండి ఈ విషయాన్ని మనపిల్లలకు అర్థమయేటట్లు చెబుతుండాలి. అంటే మనం ధైర్యంగా ఉండాలి"

మధు చెబుతున్నాడు.

బస్ ప్రయాణం చేస్తూనే ఉంది.

ఎందుకో ఇద్దరికీ అనిపించింది.

"ప్రయాణం వాస్తవం. ఇందులోకి ఎందరో వస్తుంటారు పోతుంటారు. ఆగనిది ప్రయాణమే. అది నిరంతరం కొనసాగవలసిందే."

ఇప్పుడు పెద్దమ్మకు కావలసింది 'ఆయన లేకుంటే ఎలా?' అనే భావం కాదు.

'తను లేకుంటే పిల్లలు ఎలా?' అని.

అప్పుడే జీవితం మీద ఆశ కలిగేది...

అప్పుడే తనూ ప్రయాణంలో భాగం అయ్యేది.

★ ★ ★

ఇంటికి తిరిగి వచ్చారు.

జానకిలో ఓ రకమైన స్తబ్దత ఏర్పడింది. ఆమెలో ఇప్పుడు భయాలు లేవు. అలాగని ధైర్యమూలేదు. వరసగా జరిగిన సంఘటనలు ఆమెను మొద్దుబారేలా చేశాయి. ఆమె ఆలోచనల్లోకి చనిపోయిన మావయ్య వస్తున్నారు. ఆయన చేతులు పట్టుకోవటం గుర్తొస్తోంది. అంతలోనే శ్రీధర్ ... నవ్వుతూ తమ ఇంటికి రావటం ... వెనగ్గా లక్ష్మి ... అంతలోనే లక్ష్మిని జుట్టు పట్టుకొని నడిరోడ్డుమీదకు ఈడుస్తున్న దృశ్యం. దూరంగా చూస్తున్న జనం ... రక్తం కారుతూ కూలిపోయిన శ్రీధర్ ... ఇవే ... ఇవే ... రాత్రిపూట నిద్రపట్టడంలేదు.

లక్ష్మి మొఖం పదేపదే గుర్తొస్తోంది. అప్పటికి ఆ సంఘటన జరిగి వారం రోజులయింది.

"రేపు మనం శ్రీధర్ దగ్గరకు వెళ్దాం" అన్నాడు.

జానకి తలూపింది.

ముందు బస్‌లో వెళ్లాలనుకున్నారు. మధు తన మిత్రుడి దగ్గర మోపెడ్ తెచ్చాడు. జానకి మధు వెనక కూర్చుంది. తిరిగి ఆమెలో ఆలోచనలు.

శ్రీధర్ షాపుమీదుగానే వెళ్లాలి.

అప్రయత్నంగా అటు చూశాడు మధు.

తన కళ్లను తాను నమ్మలేకపోయాడు. బండి క్రమంగా స్లోఅయి షాపు ముందాగింది.

ఎందుకు ఆగిందా అని చూసింది జానకి...





ఒక్కసారిగా ఆశ్చర్యం...

నిజమే ... నిజమే!!

లక్ష్మి షాపులో కూర్చుంది. తమను చూడగానే రావదినా అంటూ వచ్చింది. తమకు కుర్చీలు వేశాక అక్కడున్న పిల్లవాడితో కాఫీలు తెమ్మని చెప్పి పంపింది.

జానకి ఇంకా ఆశ్చర్యంనుండి కోలుకోలేదు.

అయినా నేరు పెగుల్చుకొని అంది-

"శ్రీధర్ కెలాఉంది?"

"ఫర్వాలేదు వదినా! తను ఇంకా నాలుగురోజులు ఆగితేనేకాని బయటకు రాలేరు"

ఇంటిదగ్గర ఒక్కడే ఉంటున్నాడా?"

"అవును. మా అత్తయ్య ఉందిగా. సమస్యలేదు"

"సాయంకాలం ఎలా వెళ్తున్నావ్?"

"బస్‌లో..."

కాఫీ వచ్చింది. తాగారు.

అడగకుండా ఉండాలనిపించింది. అయినా అడిగేసింది-

"నీకు భయంగా లేదా లక్ష్మీ?"

"దేనికక్కా... నన్ను ఈ షాపునుండి బయటకు లాగినప్పుడే పోయింది. నన్ను జుట్టు పట్టుకున్నప్పుడే పోయింది. మేం ఇంటిదగ్గర కూర్చుని ఏడుస్తుంటే వాళ్లకు మరింత ధైర్యం వస్తుంది. అందుకే నేను వచ్చి షాపు తీస్తున్నాను. వాడు రెండు మూడుసార్లు ఇటు చూసుకుంటూనే వెళ్లాడు"

"అంటే ఇంకా అరెస్ట్ చేయలేదా?"

"చెయ్యలేదు" అంది లక్ష్మి.

"మొదటిరోజు నాకు చాలా భయం వేసిందక్కా. ఇలాంటివి జరగగలవని మేం అనుకోలేదు. ఆ తర్వాత నాలో ఓ తెగింపు వచ్చింది. జీవితంలో మనం రోజూ చావలేం ఒకసారే ఛస్తాం. ఆయన ఇవన్నీ తనకోసం చేయటం లేదు. మా మావయ్యా అంతే. అవి తలుచుకున్నప్పుడు ధైర్యం వచ్చింది. నిజానికి నేను ఈ షాపు తెరవటం ఆయనకు ఇష్టంలేదు. కానీ నేనే వస్తున్నాను. నేను వెళ్లేదాకా ఆయన కంగారుపడుతుంటారు. నన్ను చూడగానే ముందు అడిగే ప్రశ్న 'ఏం గొడవలు లేవుగా' అని. ఇప్పటికీ ఇంకా కక్షలు పోలేదు. అయినానసరే ఇప్పుడు నాకు భయంలేదు. ఈసారి నా జాగ్రత్తలో నేనున్నాను. ఈసారి నామీద దాడి చేయబోతే ... ప్రతిఘటిస్తాను" అంది లక్ష్మి.

జానకికి ఆ మాటలు ఏ దేవతో పలికినట్లనిపించింది.

లక్ష్మికేసి ఆరాధనాపూర్వకంగా చూసింది.

"మరి మేం శ్రీధర్‌ను చూసివస్తాం" అంటూ లేచాడు మధు. బండిదాకా తనూ వచ్చింది. మోపెడ్ వెళ్తోంది.

లక్ష్మి ఓ సామాన్య యువతి. ఎంతటి అద్భుతమైన ధైర్యాన్ని ప్రదర్శించింది. ఎంతటి మహోన్నతమైన ఆత్మవిశ్వాసం ... దాడులకూ, మరణానికీ వెరవని ఆమె వైఖరి ఎంతైనా ప్రశంసించదగింది. నిజమే... ప్రతి స్త్రీ ఇలాంటి ధైర్యాన్నే కలిగుంటే ఈ సమాజంలో ఎన్నెన్నో మార్పులు సాధించుకోవచ్చు.

శ్రీధర్ ఇంటిముందు ఆగారు. తను బయటే కూర్చున్నాడు.

వెళ్లగానే అన్నాడు-

"లక్ష్మిని చూశారా?"

"అక్కడి నుండే వస్తున్నాం" అన్నాడు మధు.

"తమ్ముడూ— నీకంటే ఆ అమ్మాయే ఎంతో ధైర్యంకలది. ఆ అమ్మాయి బాగానే ఉంది. నువ్వేం కంగారుపడకు"

"నిజమే అక్కా. నాకందుకే ఎంతో సంతోషంగాఉంది. నన్ను అర్థం చేసుకొంది లక్ష్మి. నాతో పయనానికి ఆమె బెదిరిపోవటంలేదు. నాకు వేళ్ళులేకపోయినా, నా కాళ్ళూ చేతులూ లేకపోయినా నన్ను నడిపిస్తుంది. ఏరోజూ బయటకురాని లక్ష్మి ఇంతపెద్ద సంఘటన భరించగలదా అనుకున్నాను. నాకు ఇప్పటికీ ఆశ్చర్యంగాఉంది. నేను ఊహించినదానికంటే ఎంతో ఎత్తులో ఉందిలక్ష్మి. ఆమెను నాభార్యగా చెప్పటంలేదు. ఓస్త్రీగా చెబుతున్నాను. లక్ష్మిని చూస్తుంటే నాకు గర్వంగాఉంది. నిజం చెప్పాలంటే నాకు భయం కలుగుతుంది. ఎంతైనా ఆమెస్త్రీ. ఆమెమీద దాడి జరగవచ్చు. కనీసం నేను వచ్చేంతవరకయినా అక్క



డకు వెళ్ళొద్దని అన్నాను. కానీ తనేమంటుందో తెలుసా? నువ్వు వస్తావు, వచ్చాకయినా ఇరవై నాలుగు గంటలూ నాతో ఉండటం నీకు కుదరదుగదా. అందుకే ఈరోజునుండి వెళ్తాను అంది. తను వంటరిగా వెళ్ళిపోయింది. సాయంకాలం రాగానే నాకెలా ఉందో అని ఆరాటపడుతుంది. సేవలు చేస్తుంది. వద్దంటే వినదు. తిరిగి ఉదయంవెళ్తూ మందులు వేసుకొమ్మని చెబుతుంది. అక్కా... నిజంగా స్త్రీ ఎంతగొప్పది" అన్నాడు శ్రీధర్. శ్రీధర్ తల్లి టీ చేసుకొచ్చింది.

"ఎందుకమ్మా ఇప్పుడు. మీకోడలు దగ్గర్నుండే వస్తున్నాం. ఆ అమ్మాయి అన్ని మర్యాదలూ చేసింది" అన్నాడు మధు. ఇంటికొచ్చారు కదయ్యా— అందామె.

ఆమె ముఖంలో ఎన్నెన్నో అనుభవాలు... దుఃఖాలు... ధైర్యాలు గూడు కట్టుకున్నట్లనిపించాయి. జానక్కి తలచుకుంటే ఆశ్చర్యం కలిగింది.

శ్రీధర్ తనకిచ్చిన పుస్తకాల్లో గొప్పగొప్ప స్త్రీలను గురించి చూసింది. పూర్తిగా వారిగురించి చదవకపోయినా వారి ఫొటోలు చూసింది. వారి చరిత్ర అక్కడక్కడ చదివింది. కానీ ఇలాంటి వారి చరిత్రలు రాయబడవు. వీరంతా చరిత్రకు అందని వ్యక్తులు. జీవితంలో అడుగడుగునాకనిపిస్తారు. వెదుక్కోగలిగితే ఇలాంటివారే శ్రీధర్‌లాంటి యువకులకు స్ఫూర్తి.

శ్రీధర్‌తల్లి... లక్ష్మి... ఇంకా ఎందరెందరో సాధారణ స్త్రీలు... వీరందరూ తమకు తెలిసీ, తమకు తెలియకుండా ప్రయాణంలో భాగమైనారు. ఎంతటి గొప్పవిషయం!

వీళ్లకి పోరాటం తప్పించి భయాలు తెలియవు. వీరికి లేచిందగ్గర్నుండి తిరిగి నిద్రించేదాకా తమదైన ప్రపంచముంది. అందులో కష్టాలూ... కన్నీళ్ళు ఉండవచ్చు. రెండుపూట్ల తిండానికి శ్రమించటమే మార్గంగా ఉండొచ్చు. వారికున్న సంపద తృప్తి. వారికున్న సంపద అభిమానం, ధైర్యం. తమకోసం ఆరాటపడేవారిపట్ల వీరు చూపించే ఆదరణ అపూర్వం. ఈ చిన్న సంఘటన ఎంతటి అద్భుతమైన గుణపాఠం నేర్పుతూంది.

లేని భయాల్ని ఇంతకాలం తను





ఊహించుకొని భయపడుతోంది. వీళ్ళేమో ఉన్న భయాల్ని రాబోయే కష్టాల్ని లెక్కచేయ టంలేదు. అందుకే ఆ కళ్లలో అంతతృప్తి. అందుకే వారు దారిద్ర్యాన్ని అధిగమించగలు గుతున్నారు. తనూ ఒకప్పుడు అలానే భతి కింది. ఈ నడుమే ఓ రకమైన స్తబ్దత... ఇంకేమాత్రం ఇలా ఉండకూడదు. తనూ ఏదో చేయాలి. ఏదో ఒకటి... తనకూ తన కుటుంబా నికి మాత్రమే ఉపయోగపడేదికాదు.

"ఏమ్మా మాట్లాడవే" అంటోంది శ్రీధర్ అమ్మ— జానకి ఉలిక్కిపడింది.

ఆమెతోపాటు వారింట్లోకివెళ్ళింది. తమ సంసారంగుర్తొచ్చింది. తిరిగివస్తుంటే ఆమె బొట్టుపెట్టింది తనకొంగుకు కట్టుకున్న ముడివి ప్పి రెండురూపాయల కాయితాల్ని చేతిలో ఉంచింది.

"ఎందుకమ్మా ఇవన్నీ?" అందిజానకి.

"నీ తల్లిలాంటిదాన్ని... తీసుకో" అందామె. జానకి కళ్లలో ఒక్కసారిగా నీటిపొర కదలా డింది. వాటిని అత్యంత అపురూపంగా అందు కొంది.

"నీ జ్ఞాపకంగా వాటిని దాచుకుంటాన మ్మా... దాచుకుంటాను" అంది.

"ఈరోజు ఊరేగింపు ఉంది-వస్తావా" అంటూ వచ్చాడు మధు.

"ఏం ఊరేగింపండి"

"శ్రీధర్‌ను చంప ప్రయత్నించిన దుండగు ల్ని అరెస్ట్ చేయటంలో జాప్యం జరుగుతోంది. వెంటనే వారిని పట్టుకోవాలని కోరుతూ కలెక్టర్ కో మెమొరాండం ఇస్తున్నారు"

"ఎవరెవరు రావచ్చు?"

"చాలామంది వస్తున్నారు. అందులో ఆడ వాళ్ళూ ఉంటారు"

జానకి కొంచెంసేపాగి అంది-

"వస్తాను"

* * *

ఊరేగింపు సాగుతోంది రోడ్డుమీద. దాదాపు రెండువందలమందిదాకా ఉంటారు. వారంద రూ "దోషుల్ని వెంటనే అరెస్ట్‌చేయాలి" అంటూ నినాదాలిస్తూ వెళ్తున్నారు.

అందులో ఏభైమందిదాకా మహిళలున్నా రు.

ప్రదర్శన ముందుభాగంలో శ్రీధర్ నడుస్తు న్నాడు.

అరుస్తున్న మహిళల్లో లక్ష్మి... శ్రీధర్ అమ్మ ఉన్నారు.

జానకి నడుస్తోంది. ఆమెకు ఈ ప్ర పంచంలో ఆ క్షణం మరేం కనబడటంలేదు. వారు రోడ్లన్నీ తిరుగుతున్నారు. జనమంతా చూస్తున్నారు. అసలు తమను జనం గమనిస్తు న్నారనే స్పృహలేదు.

"దోషుల్ని"

"శిక్షించాలి"

"వెంటనే"

"అరెస్ట్ చేయాలి"

అరచి...అరచి జానకి గొంతు బొంగురుపో యింది. ప్రదర్శన కలెక్టర్ భవనానికి చేరు కుంది.

కొంతమంది నాయకులు లోనికి వెళ్ళారు.

కొద్దిసేపటి తర్వాత ఆయన బయటకు రావటం జరిగింది.

తాను ఈ హత్యాయత్నాన్ని ఖండిస్తున్నాన నీ...హింసవల్ల సమస్యలు పరిష్కారం కావనీ, ప్రతి ఒక్కరూ అరాచకానికి వ్యతిరేకంగా కదలి నప్పుడే క్రమంగా అవి తగ్గుతాయని, దోషులు ఎంత పెద్దవారయినా వారిని అరెస్ట్ చేయటం జరుగుతుందని ఆయన హామీ ఇవ్వటం జరి గింది.

తిరిగి అందరూ నినాదాలు చేసుకుంటూ వెళ్లారు.

జానకి ఇంటికి తిరిగి వస్తున్నప్పుడు అని పించింది.

"మొట్టమొదటిసారిగా తను బయటికొ చ్చింది. ఈ అనుభవం తనకు కొత్తది. అంతేకా దు ఉత్తేజకరంగా ఉంది"

* * *

రెండురోజులదాకా గొంతు నొప్పనిపించింది. అయినా ఎందుకో అంతులేని తృప్తి...!

జానకికి రాత్రిపూట ఇప్పుడు పీడకలలు రావటంలేదు.



ఎవరెవరో నడుస్తూ వెళ్తుంటారు...

అందులో తనూ ఉంటుంది.

వారంతా పాడుకుంటూ ముందుకెళ్తుంటారు.

తమ వెనక...

మధు... శ్రీధర్...

వారివెనక తమ పిల్లలు...

వారి వెనక గుంపులు గుంపులుగా జనం...

వారలా ముందుకు వెళ్తూనే ఉంటారు!

ఆ రోజు ఊరేగింపులో ఎవరో తన వివరాల డిగారు.

"మీరు మధు భార్యా?"

"అవును."

"మిమ్మల్ని ఎప్పుడూ చూడలేదు. మీతో మాట్లాడాలి" అందామె.

అంతకంటే మాట్లాడటం కుదరలేదు.

వారంరోజుల తర్వాత ఆమె వచ్చారు.

ఆమె ఎన్నో విషయాలు చెప్పారు.

"మనం స్త్రీలం. అందరికంటే సమస్యలు ఎక్కువ మనకు ఉన్నాయి. పురుషులకూ కొన్ని సమస్యలున్నాయి. అలాగే భయాలు. మనకు రెండురకాల భయాలున్నాయి. పురుషులకీ, స్త్రీలకూ ఉండే భయాలు. స్త్రీలకు మాత్రమే ఉండే భయాలు.అందుకే వీటన్నింటినుండి మనం బయటపడాలి.

అందుకు మేమందరం ఓ సంఘంగా ఏర్పడ్డాం. మీరు మాతో రండి. మనం పరస్పరం చర్చించుకుందాం. ముందు మన సమస్యలేమిటో, మన భయాలేమిటో చెప్పుకుందాం. వాటికి ఏం చేస్తే పరిష్కారం లభిస్తుందో ఆలోచిద్దాం. మనతోపాటు మన భర్తలూ, అన్నలూ అంతా వస్తారు. మనం ఓ అద్భుత ప్రపంచాన్ని రూపొందించుకోవాలి. ముందు మనం మారాలి. మనతోపాటు ఎందరినో తీసుకురావాలి. మేం మీకు కబురు చేస్తుంటాం. మా సమావేశాలకు మీరు వస్తుండండి మనం ముందుకు వెళ్దాం" అందామె.

జానకి మెరుస్తున్న కళ్ళతో అంది-

"తప్పకుండా వస్తాను. ఇప్పుడు నాకు అలా రావటానికి ఏ అడ్డంకులూ లేవు. పిల్లలూ, ఆయనా ఎవరి ప్రపంచంలో వారున్నారు. నేను నాకంటూ ఓ ప్రపంచం నిర్మించుకోవాలి. అంతేకాదు మా అందరి ప్రపంచం ఒకటే కావాలి"

## విరామం

'భయం' పూర్తి కాలేదు...

'విరామం' మాత్రమే ఇది

'జానకి' భయం నుండి విముక్తి కావటానికి తన తొలి అడుగు వేసింది—

అయితే...

భయం సహజం.... నిత్యం

అడుగడుగునా భయాలు పుడుతుంటాయి.

అవి నూతన రూపాల్లో మానవజాతిని ఎదుర్కొంటూనే ఉంటాయి.

అన్నింటినీ అందరూ ఒకేలా ఎదుర్కోలేరు.

అందుకే ఇక్కడ 'విరామం' అంటున్నది.

జానకి తర్వాత జీవితం ఎలా ఉంటుంది?

ఆమె ఇంకెప్పుడూ భయాలకు లోనుకాలేదా? కాదా?

ఈ ప్రశ్నలకు సమాధానం ప్రస్తుతం మౌనమే.

ఒకటి మాత్రం వాస్తవం...

'భయం' ఓ సామాజిక రుగ్మత

'ఆచరణ' దానికి విరుగుడు

'భయం' గురించీ, 'జానకి' గురించీ

మరెప్పుడైనా మనం చర్చించుకునే

అవసరం వస్తుందా?

రావచ్చు!



### అంకితం

ఈ నవల రాసేంతవరకూ ఆచార్య ఆత్రేయ 'భయం' గురించి నాటకం రాసేరని నాకు తెలియదు.

ఈ నవలను కీర్తిశేషులు ఆచార్య ఆత్రేయకు అంకితంచేయటం ఎంతయినా సమంజసం అనిపించింది.

ఆయన స్మృతికి నివాళులర్పిస్తూ... నా 'భయం' నవలను అంకితమిస్తున్నాను...

— పి.చంద్రశేఖర్ ఆజాద్.

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd. Hyderabad. Tel. 229428. Office Address: CHATURA Telugu Monthly Eenadu Compound, Somajiguda, Hyderabad. Tel. Hyderabad: 223422, 229444, Madras 470434, Vijayawada 476685, Visakhapatnam 52211, Tirupati 5291.

ప్రతినెలా మీరు పొదుపుచేసేది మీ ఆదాయంలో అతికొద్ది భాగమేకావచ్చు. కానీ... మీ బిడ్డకు అది ఉన్నత భవితవ్యానికి మార్గంకావచ్చు. స్వతంత్రంగా నిలదొక్కుకోవటానికి అదే ఆమెకు పునాదికావచ్చు. లేదా- వైవాహిక జీవితంలో ఆత్మవిశ్వాసానికి అదే ఆసరాకావచ్చు.

మీ అవసరాలన్నిటికీ తగిన విధంగా మార్గదర్శిలో ఎన్నెన్నో పథకాలున్నాయి. మీకు తగిన పథకాన్ని ఎంచుకొని, చిన్నమొత్తాలు పొదుపుచేయండి. మీ డబ్బుకు మార్గదర్శిని మించిన భద్రతలేదు మార్గదర్శి చిట్‌ఫండ్‌కు 25 సంవత్సరాల చరిత్ర ఉంది. సాలీనా 120 కోట్ల రూపాయల బిజినెస్ టర్నోవర్‌తో, 80 కోట్ల రూపాయల ఆక్షన్ టర్నోవర్‌తో భారతదేశంలోకెల్లా నంబర్ 1 చిట్‌ఫండ్ సంస్థగా మీముందు నిలుస్తోంది- మార్గదర్శి.

అన్నిటా అగ్రగామి అయిన మార్గదర్శితో కలిసి నడవండి. మరిన్ని వివరాలకు మా ఏజెంట్లను కలవండి లేదా మమ్మల్ని సంప్రదించండి.

డబ్బుకోసమేనా మీ చింత? మార్గదర్శి ఉన్నది మీ చెంత!









**మార్గదర్శి**
**చిట్‌ఫండ్ ప్రైవేట్ లిమిటెడ్**
రిజిస్టర్డ్ మరియు సెంట్రల్ ఆఫీస్:
ఆబిడ్ సెంటర్, హైదరాబాద్- 500 001

# చిన్న మొత్తాలు పొదుపు చేయండి... అనన్యమైన భవిష్యత్తును ఆమెకు అందజేయండి!

KIRON/MCF/10289